

# ఒక్క రూపాయి ఇవ్వలేదు

**-నిత్యామీనన్**

**నిత్యామీనన్‌ను మొదటిసారి చూసిన వారికి కొద్దిగా జంకు, మరికొద్దిగా భయం కలుగుతుంది. పెద్ద కళ్లను మరింత పెద్దగా చేసి కొర కొర చూస్తూ ఏం కావాలో చెప్పమంటే 'గుండె జారి గల్లంతయ్యిందే' అన్న ఫీలింగ్ తప్ప కుండా కలిగి తీరుతుంది. సినిమాలో టీనేజీ అమ్మాయిగా చేసినా, టీనేజీ అమ్మాయికి అమ్మగా చేసినా ఏ పాత్ర చేసినా ప్రేక్షకుల మీద తన ప్రభావం ఉండేలా చేయడం బహుశా నిత్యాకు ఒక్కదానికే చెల్లిందేమో! త్వరలో తెలుగులో రెండు సినిమాలతో ప్రేక్షకుల ముందుకు రాబోతున్న నిత్యాతో....**

**నటనతో పాటు పాటలు కూడా పాడుతున్నట్టున్నారు?**

'100 డేస్ ఆఫ్ లవ్' సినిమాలో ఓ పాట పాడాను. సినిమాలో పాట పాడినందుకు ఎంత తీసుకున్నావు? అని అందరూ నన్ను అడుగుతున్నారు. వాస్తవానికి ఒక్క రూపాయి కూడా తీసుకోలేదు. సరదాగా పాడాను అంతే!

**సమంతతో రెండోసారి చేస్తున్నట్టున్నారు?**

మా కాంబినేషన్ అలా కుదిరింది అంతే తప్ప పెద్దగా కారణాలు లేవు.

**తెలుగులో బన్నీ, ఎన్టీఆర్‌లతో చేశారు కదా...వారి గురించి...**

ఇద్దరూ ఎనర్జీకి మారు పేరుగా ఉంటారు. ఎనర్జీ లెవెల్స్‌లో వాళ్ళతో పోటీ పడడం కష్టమే! డ్యాన్సులు ఇద్దరూ చాలా బాగా చేస్తారు. నాకు జూని యర్ డ్యాన్సులంటే ఇష్టం.

**'జనతా గ్యారేజీ' వాయిదా గురించి...**

అదంతా టెక్నికల్ ప్రాబ్లం అన్నారు. దాని గురించి నాకు పెద్దగా తెలియదు. అలాంటి విషయాలు పెద్దగా పట్టించుకోను. త్వరలోనే ప్రేక్షకుల ముందుకి రాబోతోంది కదా?

**మీ కోసం సృష్టించాల్సిన పాత్రలు ఇంకా ఉన్నాయంటారా?**

దాని గురించి ఎప్పుడూ ఆలోచించలేదు. కథలు నన్ను దృష్టిలో పెట్టు కుని రాయడం కాదు. నాకు వచ్చిన పాత్రల్లో నన్ను నేను చూసుకునేం దుకు ప్రయత్నిస్తాను.

**కొంచెం వివరంగా...**

'100 డేస్ ఆఫ్ లవ్' సినిమాలో నా పాత్ర నా జీవితానికి చాలా దగ్గ రగా ఉండే పాత్ర. ఈ సినిమా చేస్తున్నంత సేపూ నన్ను నేను చూసు కుంటున్నట్టు అనిపించింది.

**ఒక చట్రంలో లోబడి సినిమాలు చేయడానికి కారణం?**

మా పేరెంట్స్‌ను అతి కష్టం మీద ఒప్పించి సినిమాల్లోకి వచ్చాను. వారి నమ్మకాన్ని వమ్ము చేయకూడదు కదా! అందుకే గ్లామర్ రోల్స్ వైపు పెద్దగా దృష్టి పెట్టలేదు.

**భవిష్యత్తులో గ్లామర్ రోల్స్ చేసే ఉద్దేశం ఉందా?**

చెప్పలేను. అప్పటి పరిస్థితులను బట్టి ఆలోచిస్తాను.

**బాగా నచ్చిన పాత్ర?**

'మళ్ళీ మళ్ళీ రాని రోజు'లో నజీరా పాత్ర చాలా బాగా నచ్చింది. అందులో నా ఫాదర్ చనిపోయిన తరువాత ఆయన ఫోటో ముందు డైలాగులు చెబుతూ కన్నీళ్ళు కార్చాలి. ఆ సీన్‌లో గ్లిజరిన్ వాడలేదు. అనుకోకుండా కన్నీళ్ళు వచ్చేశాయి. ఆ ఒక్క సన్నివేశమనే కాదు చాలా సన్నివేశాలు మనసుకు హత్తుకునే విధంగా ఉంటాయి. అందుకేనేమో ఇప్పటి వరకూ చేసిన అన్ని సినిమాల్లోకన్నా ఆ సినిమా మనసుకు నచ్చిన సినిమా అయింది.



**నిజజీవితంలో నిత్యా ఎలా ఉంటుంది?**

నాలో స్వతంత్ర భావాలు ఎక్కువే! నాకు నచ్చినదే చేస్తాను తప్ప మరొ కరి కోసం నా నిర్ణయాలు మార్చు కోను. ఆఖరికి మా పేరెంట్స్ చెప్పినా కొన్నిసార్లు వినను. నిత్యా మొండిది. ఎవరి మాటా వినదు అంటూం టారు. నేను ఇలా తయారు కావ డానికి కారణం మా పేరెంట్సే!

**జర్నలిజం చదివి నటన వైపు ఎందుకొచ్చారు?**

జర్నలిజం ఇష్టంతో చదివాను. వెండితెరా? మీడియానా? అని నన్ను నేను ప్రశ్నించుకున్నప్పుడు వెండితెర మీదకే మనసు పోయింది. మనసుకు నచ్చిన పని చేస్తేనే నూటికి నూరు శాతం న్యాయం చేయగలుగుతాం. అనుకోకుండా నటిని అయినా, ఈ ప్రొఫెషన్ చాలా బాగుంది.

*-భరత్ కుమార్*

## సరదాగా

### ప్లాట్‌ఫామ్ టికెట్

హైదరాబాద్ నుంచి చెన్నైకు బయల్దేరిన చెన్నై ఎక్స్‌ప్రెస్‌లో ఎక్కి కూర్చున్నాడు ఆనందరావు.

టికెట్ కలెక్టర్ వచ్చి అందరి టికెట్లు చెక్ చేస్తున్నాడు. ఆనందరావు దగ్గరకు వచ్చి "మీ టికెట్ ఏది?" అడిగాడు.

పంచె చివరన కట్టుకున్న టికెట్ తీసి చూపించాడు ఆనందరావు.

"ఇది ప్లాట్‌ఫామ్ టికెట్. ఇది కాదు. చెన్నైకి వెళ్ళడానికి తీసుకున్న టికెట్ ఏది?" అని అడిగాడు టి.సి.

"నేను ఇక్కడ ఎక్కింది, చెన్నైలో దిగవలసింది కూడా ప్లాట్‌ఫామ్ మీదనే కదా!" అంటూ పళ్ళికిలించాడు ఆనందరావు.

### ఒక ప్రశ్న?

ఇంద్రనీల్ సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా పనిచేస్తున్నాడు. అతడికి ప్రయాణాలు చేయటమన్నా, కొత్త కొత్త ప్రదేశాలు దర్శించడమన్నా చాలా ఇష్టం. ఎప్పుడూ నాలుగైదు రోజులు సెలవు పెట్టేసి, ఏదో ఒక దేశం వెళ్ళి వస్తూ ఉంటాడు. వెళ్ళి వచ్చాక అక్కడి వింతలు, విశేషాలతో స్నేహితులు, బంధువులకు ఊపిరాడనివ్వడు. ఎక్కడకు వెళ్ళినా ఒంటరి గానే వెళ్తాడు. ఒకసారి ఇటలీ అందాలను చూడాలని బయలుదేరి వెళ్ళాడు. రోమ్, వెనిస్, మిలాన్ అన్నీ చూశాడు. సెల్ఫీలు తీసుకున్నాడు. మొత్తానికి ఇటలీదేశ అందాలకు ఫిదా అయ్యాడు. ఆఖరి రోజున ఇంట్లోవాళ్ళకి, బంధువులకు, స్నేహితులకు కొన్ని బహుమతులు తీసుకున్నాడు. షాపింగ్ అయింది. ప్రయాణానికి ఇంకా చాలా టైముంది. ఏం చేయాలా అని ఆలోచిస్తూ అక్కడి పరిసరాలను, జనాలను గమనిస్తున్నాడు. ఎంతకీ టైం గడవదే అని ఒకటే ఇదైపోతున్నాడు. ఇంతలో ఓ తుంటరి ఆలోచన నీల్ మనసులో మెదిలింది. దాన్ని ఆచరణలో పెట్టాడు. అక్కడి వీధుల్లో నడుస్తూ ఎదురుపడ్డ వారందరినీ ఒకే ప్రశ్న అడుగుతూ పోయాడు. దాదాపు వెయ్యిమందిని అదే ప్రశ్న అడిగాడు. అయితే వెయ్యిమందీ ఒక్కొక్కరూ ఒక్కో జవాబు చెప్పారు. ఒకే ప్రశ్న, వెయ్యిమంది, వెయ్యి జవాబులు...

ఇంతకీ నీల్ వాళ్ళందరినీ అడిగిన ప్రశ్న ఏమిటి? ఆలోచించండి ఏం ప్రశ్న అడిగి ఉంటాడో!

**సమాధానం**

ఇంతకీ నీల్ అడిగిన ప్రశ్న ఏంటంటే "టైమెంతయింది?" అని. ఈ ప్రశ్నకి మాత్రమే కదా ఒకే జవాబు లేకుండా వేరువేరు జవాబులు ఉండేది. ఇంకా ఇలాంటివే ఇతర ప్రశ్నలు ఏమైనా ఉన్నాయేమో ఆలోచించండి.

# అడపా దడపా నవ్వబ్బా

Jayadev






8

## థీమ్ హోటళ్ళు... థ్రిల్లింగ్ రెస్టారెంట్లు

కస్టమర్లను ఆకర్షించేందుకు వింతపోకడలు పోతోంది హోటల్‌రంగం. సరికొత్త థీములతో, థ్రిల్లింగ్ ఐడియాస్‌తో అబ్బురపరుస్తోంది. హార్ట్‌ఎటాక్ రెస్టారెంట్లూ, సీక్రెట్‌కోడ్ హోటళ్ళూ, క్యానబాలిస్టిక్ రెస్టారెంట్లూ, ఓపెన్‌ప్లేస్ రెస్టారెంట్లూ...అబ్బో! ఎన్నెన్ని చిన్నెలో!

56

### మనవళ్ని తీర్చిదిద్దే మలితరం పాత్రే కీలకం

తల్లిదండ్రులంతా ఉద్యోగాల్లో బిజీ! అందుకే మనవళ్ని పెంచే బాధ్యత తాతా బామ్మలే చేపడుతున్నారు. పాత తరం, కొత్త తరం మధ్య వారధిగా వారేం చేస్తున్నారో చదవండి

72

### ఇంటర్వ్యూ

వెండితెర, బుల్లితెరలను అలరిస్తున్న నంది అవార్డుల నటి కిన్నెర. టాలెంట్‌ను గుర్తిస్తే ఆర్టిస్టుకు అన్నంపెట్టి జీవితాన్నిచ్చినట్టే అంటున్న ఆమె ఇంటర్వ్యూ.

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: నయనతార
ఫొటో: గోపీకృష్ణ


**రచనలు, కథలు పంపవలసిన చిరునామా**
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33. email: navyaweekly@andhrajyothy.com





### కానుక

పెళ్ళి అయిపోయింది. తండ్రిని ప్రేమగా ముద్దు పెట్టుకుంది పెళ్ళికూతురు. ముద్దుపెట్టుకుని, ఎవరికీ కనిపించకుండా, దాచిపెట్టినదేదో అతని చేతిలో జాగ్రత్తగా పెట్టింది. అతిథులు అది గమనించారు. తండ్రి చేతికి కూతురేం ఇచ్చి ఉంటుంది? అంత గోప్యంగా ఇచ్చిందంటే అదేదో గొప్ప కానుకే అయి ఉంటుందని గుసగుసలు పోయారు. గుర్తించాడది తండ్రి. ఆహూతుల్ని సస్పెన్స్‌లో పెట్టడం ఇష్టం లేకపోయిందతనికి. గుప్పిటపట్టిన చేతిని పైకెత్తాడు. మాట్లాడేందుకు గొంతు సవరించుకున్నాడు.

నిశ్శబ్దమై అంతా అతన్నే చూడసాగారు. ఏదో చెప్ప బోతున్నాడు. వినండి అన్నట్టుగా ఒకరిని ఒకరు చూసుకున్నారు.

"నాకు మా అమ్మాయి ఏం ఇచ్చిందో మీ అందరికీ తెలియాలి. తెలుస్తుంది. చూడండి." అని గుప్పెట విప్పాడతను.

క్రెడిట్‌కార్డు!

"పెళ్ళి అయిపోయింది కదా! ఆఖరికి నా క్రెడిట్ కార్డు నాకిచ్చేసింది మా అమ్మాయి." అన్నాడు తండ్రి.

వావ్ అని ఆశ్చర్యపోయారు ఆహూతులు. అభినందనగా చప్పట్లు చరిచారు. పెద్దగా నవ్వారు. అంత మందిలోనూ నవ్వనిది, ముఖం ముడుచుకుని ఉన్నదీ ఒక్కరే! అతడు పెళ్ళికొడుకు.

### నెయ్యి

ఓ ఊరిలో ఓ చిన్న కిరాణాదుకాణం పెట్టుకుని ఓ ముసలిది జీవిస్తోంది. చాలా ఏళ్ళుగా అదే ఆమెకు జీవనాధారం. అయితే ఓ కార్పొరేట్ కంపెనీ ఆమె దుకాణానికి ఎదురుగా ఓ పెద్ద సూపర్‌మార్కెట్ పెట్టి, అందులోని ధరవరలు కూడా బోర్డు మీద రాసి పెట్టింది. ఆ రాసి పెట్టిన దాంట్లో కిలో నెయ్యి అయిదు వందలని ఉంది. ముసలిది అది గమనించి, తానూ ఓ బోర్డు పెట్టింది. అందులో కిలోనెయ్యి నాలుగువందల యాభై అని రాసింది. చూశారది సూపర్‌మార్కెట్‌వాళ్ళు. కిలో నెయ్యి నాలుగువందలని రాశారు. అది చూసి ముసలిది కిలోనెయ్యి మూడువందల యాభై అని పెట్టింది. సూపర్‌మార్కెట్ వాళ్ళు దాన్ని గమనించి కిలో నెయ్యి మూడువందలని రాశారు. ముసలిది రెండు వందల యాభై అని బోర్డు పెట్టింది.

జరుగుతున్న యుద్ధం గమనించిన ఓ మహిళ, ముసలిదానిని చేరి, అన్నదిలా.

"చూడమ్మా! సూపర్‌మార్కెట్‌వాళ్ళతో పెట్టుకోకు. దెబ్బయిపోతావు. కిలోనెయ్యి రెండు వందలయాభై అంటే నీకేం కిడుతుంది? నువ్వు ఎలా బతుకుతావు? వద్దు! నా మాట విని, వాళ్ళతో పెట్టుకోకు, గెలవలేవు"

"కదా! కానీ నేనే గెలిచాను. ఎలా అంటే... నేను నెయ్యి అసలు అమ్మితేగా?" అని నవ్వింది ముసలిది.

-వైనతేయ

www.navyaweekly.com

నవ్య

సంపుటి: 13 సంచిక: 22
3-8-2016



మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎస్.జగన్నాథశర్మ

మొదటి పేజి

# తాళం వేసిన ఇల్లు

పెరటిలో బాదంచెట్టును చూసిందామె. బాదంచెట్టునీడలో నూతిని చూసింది. నూతిలో తేలుతున్న బాదంకాయలను చూసింది. గట్టున ఉన్న బొక్కెనను చూసింది. బొక్కెనను నూతిలో వేసి, నీరు చేదింది. దోసిలితో నీరు తీసుకుని, ఆ నీటిలో ముఖాన్ని ఉంచుకుని భోరుమంది. ఈ క్షణంతో సరి! తర్వాత ఈ పెరడూ, ఈ బాదంచెట్టూ, ఈ నుయ్యీ, ఈ నీరూ ఇవేవీ కనిపించవనుకుంది. నూతిగట్టుని ఓసారి నిమిరి అక్కణ్ణుంచి వంటింటికి చేరుకుంది. అక్కడ అమ్మగా మిగిలిన పాత్రల్నీ, అరకొరగా మిగిలిపోయిన సరుకుల్నీ చూసింది. దుఃఖం పొంగుకొస్తోంటే చీరకొంగు నోటికి అడ్డం పెట్టుకుంది. నట్టింట్లోకి వచ్చింది. ఖాళీగా ఉన్న గాదెకు చేరబడి, అక్కణ్ణుంచి దేవుడిగదికేసి చూసింది. బోసిపోయి ఉంది ఆ గది. విలువైన విగ్రహాలు మూటగట్టేశారు. పగిలిపోయిన మట్టి వినాయకుడిబొమ్మను మాత్రం వదిలేశారు. చూడలేకపోయింది దాన్ని. వెను తిరిగి, గదిలోనికి వచ్చింది. పందిరిపట్టెమంచం, పాతపరుపు, వాలుకుర్చీ, కాళ్ళుపెట్టుకునే పీటా, దొంతులు దొంతులుగా పుస్తకాల్నీ చూసింది. శ్రీనివాస శిరోమణి రామాయణం, పిలకాగణపతిశాస్త్రి మహాభారతం, పురిపండావారి భాగవతం, గోపీచంద్ సాహిత్యం, అమరావతికథలు, పద్మరాజు పడవప్రయాణం...అన్నీ నచ్చిన పుస్తకాలే! వాటిని గుండెకు హత్తుకుందో లేదో అబ్బాయి వచ్చాడంతలో. వాణ్ణి చూసి, పుస్తకాలను వదలి నిల్చుంది.

ఈ పుస్తకాల్ని కిరాణాకొట్టువాడు కూడా వద్దన్నాడమ్మా! పాతపుస్తకాలు, పసుపు పొట్లాలకు కూడా పనికిరావన్నాడు. ఏం చెయ్యను? అందుకే వదిలేశాను. నాన్న పుస్తకాలు, నాన్నతోనే పోయాయనుకుందాం, పద అన్నాడు. ఆమె చేయి పట్టుకుని ముందుకు నడిచాడు. వాకిట్లోకి వచ్చిందామె. మైదానంలా పెద్దవాకిలి. పప్పులూ, ఉప్పులూ, అవకాయలూ అన్నీ ఎండబెట్టుకునే దక్కడ. స్నానం చేస్తే విరబూసుకుని జుత్తుని కూడా అక్కడే ఆరబెట్టుకునేది. జుత్తు ఆరబెట్టుకుంటుంటే...నవ్వుతూ భర్త తనని చూడడం బాగుండేదామెకు.

ఇప్పుడు ఆ నవ్వూ లేదు. ఆయనా లేడు. పోయి పన్నెండురోజులైంది. ఒక్కగానొక్క కొడుకు. ఆ కొడుక్కి పూణెలో ఉద్యోగం. పదేళ్ళుగా అక్కడే ఉంటున్నాడు. ఇల్లు కూడా కొనుక్కున్నాడక్కడ. తల్లిని అక్కడికే తీసుకుపోతున్నాడిప్పుడు. అందుకే ఆ ఇంటి ఇల్లాలుగా తల్లడిల్లిపోతోందామె. పదహారేళ్ళకి పెళ్ళయ్యిందామెకి. కాపురానికి వచ్చిందగ్గర్నుంచీ అదే ఇల్లు. నలభై అయిదేళ్ళుగా ఆ ఇంట్లోనే ఉంటోంది. ఇప్పుడిక ఉండలేదు. ఉండొద్దన్నాడు కొడుకు. కోడలు, మనవడుసహా పూణెలో ఉందాంగాని వచ్చేయమని లాక్కుపోతున్నాడు. బాధగా ఉంది ఆమెకు. వసారాలోనికి వచ్చింది. ఫ్రేం కట్టించిన క్యాలెండర్ శ్రీరామపట్టాభిషేకం వేలాడుతోందక్కడ. స్నానం చేసి, ఆ బొమ్మకి బంతిపువ్వో, మందారపువ్వో పెట్టి, భక్తిగా నమస్కరించడం అలవాటు. ఆ అలవాటును ఈరోజు కూడా వదులుకోలేదామె. మందార పువ్వు తెచ్చి పెట్టింది. చేతులెండూ జోడించి నమస్కరించింది. రేపు నిన్నెవరు తుడిచి శుభ్రం చేస్తారయ్యా? నిన్ను ఎవరు అలంకరిస్తారు? ఎందుకిలా మమ్మల్ని దూరం చేసుకుంటున్నావు? అని కన్నీరుపెట్టుకుంది.



మెయిన్ ఆఫ్ చేసేశాడు అబ్బాయి. ఇక ఆ ఇంట్లో దీపాలు వెలిగే అవకాశం లేదు. సాయంత్రం అయితే చాలు! ఇంటి నిండా దీపాలు వెలగాల్సిందే! ఏ ఒక్క దీపం వెలగకపోయినా ఆయన ఒప్పుకునేవారు కాదు. పడుకునే వేళ వరకూ ఇల్లు పెళ్ళిపందిరిలా ఉండాలనేవారు. ఇప్పుడు? ద్వారానికి చేరబడి చేతుల్లో ముఖాన్ని దాచుకుని గొల్లుమందామె. తలుపులు ముందుకులాగి గడియ పెట్టాడు అబ్బాయి. తాళం వేశాడు. చూసి తట్టుకోలేకపోయిందామె. తలుపులకి చేరబడి అలాగే కిందికి కూలిపోయింది.

పిచ్చి సెంటిమెంట్లు పెట్టుకోకు! ఇల్లు అమ్మదామంటే కొనేవాడు లేడు. అన్నాడు అబ్బాయి. ఆమెను పట్టుకుని లేపి, కారెక్కించాడు. ఆసరికే కోడలూ, ఏడాది మనవడూ కారెక్కి ఉన్నారు. తాళాలు తీసుకో అన్నాడు అబ్బాయి. అందించాడామెకు. తాళాలు తనకెందుకు? చెందాల్సినవాళ్ళకే చెందాలి అనుకున్నదామె. వాటిని మనవడికి అందించింది. తాళాల్ని గట్టిగా పట్టుకున్నాడు మనవడు. నోట్లో పెట్టుకున్నాడు. అబ్బాయి తీసుకోబోతుంటే...వదల్డే! ఏడుస్తూ వెనక్కి లాక్కుంటున్నాడు. చాలది! ఆనందించిందామె.



## బాల్యవివాహాలపై పోరాటం

ప్రభుత్వం ఎన్ని చర్యలు తీసుకున్నప్పటికీ ఇంకా అక్కడక్కడా అప్పుడప్పుడు బాల్యవివాహాల ప్రస్తావన వినిపిస్తూనే ఉంది. కొన్ని మారుమూల ప్రాంతాల్లో ఆడపిల్లల జీవితాలు ఇప్పటికీ ఇంటి నాలుగ్గోడలకే పరిమితమవుతున్నాయి. తల్లిదండ్రులు వారిని ఇంటిచాకిరీకే అంకితం చేస్తున్నారు. అయితే ఆ అడ్డుగోడలు ఛేదించుకుని తన ఇష్టానికనుగుణంగా తన జీవితాన్ని తీర్చిదిద్దుకోవాలనుకుంది కిరణ్. ఆ కథేంటో చూద్దామా!

జార్ఖండ్ రాష్ట్రం మారుమూల గ్రామానికి చెందిన పదిహేడేళ్ళ కిరణ్‌ది కూడా అందరిలాగా తలుపుచాటు జీవితమే. 'ప్లాన్ ఇండియా' అనే స్వచ్ఛంద సంస్థ ఆడపిల్లల హక్కులూ, చట్టాలూ, చదువు విలువల్ని వివరిస్తూ ఆ ఊళ్ళో ఓ సమావేశం జరిపింది. కానీ గ్రామంలో ఏ ఒక్క అమ్మాయీ అటువైపు తొంగిచూడలేదు. కాని కిరణ్ మాత్రం ధైర్యం చేసి తల్లిదండ్రులతోనూ, అన్నలతోనూ పోట్లాడిమరీ ఈ సమావేశానికి హాజరై వాళ్ళ ఉపన్యాసాలు ఆలకించింది. తాను కూడా అలాంటి కార్యక్రమాల్లో భాగస్వామి కావాలనుకుని, ఆ స్వచ్ఛంద సంస్థ ఏర్పాటు చేసిన క్లబ్‌లో సభ్యురాలిగా చేరింది. కిరణ్ తల్లిదండ్రులు అస్సలు ఒప్పుకోలేదు. కానీ ఆమె పట్టించుకోలేదు. ఆమె స్ఫూర్తితో క్లబ్బులో మరికొందరు చేరారు. ఆ స్వచ్ఛంద సంస్థ వారినే ఒక బృందంగా తయారుచేసింది. సమస్యల్ని పంచుకోవడానికి అవకాశం కల్పించింది. వాళ్ళందరి సమస్యా ముఖ్యంగా, బాల్య వివాహాలను ఎదుర్కొని బాగా చదువుకోవడం. దాంతో కిరణ్ బృంద నాయకురాలిగా మారి నాలుగు గోడల మధ్య నలిగిపోతున్న వారిని బయటకు తీసుకురావాలనుకుంది. కానీ చాలామంది కిరణ్ బృందాన్ని చూడగానే తలుపులు మూసుకునేవారు. అయినాసరే, తల్లిదండ్రుల్ని బతిమాలి బాల్యవివాహాలకు వ్యతిరేకంగా అవగాహన కల్పించడం మొదలుపెట్టింది. అంతే కాదు ఎక్కడ బాల్య వివాహాలు జరుగుతున్నా, వెళ్ళి పెద్దలతో మాట్లాడుతూ ఉండేది. వారు తేలిగ్గా తీసుకుంటే స్థానిక ప్రభుత్వాధికారులను కలిసి చట్టపరంగా చర్యలు తీసుకునేలా చూసేది. అలా ఈ మూడేళ్ళలో కిరణ్ యాభైకిపైనే బాల్య వివాహాల్ని అడ్డుకోగలిగింది. ఇప్పుడు అక్కడ అమ్మాయిలూ చదువుకోవడానికి ముందుకొస్తున్నారు. ఎంతోమంది ఆడపిల్లల జీవితాల్ని చక్కదిద్ది వారిని చదువుబాట పట్టించిన కిరణ్ ఇప్పుడు అక్కడి అమ్మాయిలకు ఆదర్శం. హ్యాట్సాఫ్ టు కిరణ్!



# మెయిల్ బాక్స్

### ఉత్కంఠ రేపిన రామాయణం

రామాయణంలో మహావీరులు ధూమ్రాక్షుడు, వజ్రదంష్ట్రుడు, అకంపనుడు వంటివారిని అంగదుడు, హనుమ హతమార్చిన భీకరపోరు ఉత్కంఠ కలిగించింది. మార్నింగ్ కాఫీలో మహావిశ్లేషణ ఫన్నీగా ఉంది. నివేదన కథనం ఆకట్టుకుంది. ఆత్రేయ నాటక ప్రస్థానం, డబ్బింగు పాటలు, ఘంటసాల సంగీత సమీక్షలు ఆహ్లాదపరిచాయి. నవ్య సినిమా బిట్లు అలరించాయి. అనువాద కథ 'గ్రహణం' ఆలోచింపజేసింది. రావుబాలసరస్వతి పిన్నవయసులోనే గాయనిగా, నటిగా పేరొందడం ఆనందింపజేసింది. ఇవన్నీ నిజాలే ఆసక్తిగొలిపాయి. సరదాగాలో ఒక ప్రశ్న డిటెక్షన్ బాగుంది. రివ్యూలో సుబ్రమణ్యస్వామి బాగోతం విపులంగా చర్చించారు. సిజరింగు, సాహసక్రీడ, కొత్తనీరు, నైటీ కథలు రసవత్తరంగా ఉన్నాయి.

*-కృష్ణ మాధవరపు, కాకినాడ*

### ప్రయోజనకరమైన ఆర్టికల్స్

అందాలనటి రకుల్ ప్రీత్‌సింగ్ ముఖచిత్రంతో నవ్యవీక్లీ కనువిందు చేసింది. లవ్ ఫెయిల్యూరా? డోంట్ వర్రీ' వ్యాసం నేటి యువతకు కనువిప్పు. వార్ధక్యం గురించి చింత వలదంటూ మరోవ్యాసం వృద్ధులకు ఎంతో ప్రయోజనకరం. ఈ వారం కథలు బాగున్నాయి. ముఖచిత్రాలు ప్రచురించడంలో మీకు మీరే సాటి. మరిన్ని జోక్స్ ప్రచురించండి.

*-ఎల్.ప్రఫుల్లచంద్ర, ధర్మవరం*

### ఆర్టికల్స్ అదుర్స్

నవ్య వీక్లీలో ఇటీవలికాలంలో ప్రతివారం అద్భుతమైన వ్యాసాలు ప్రచురిస్తున్నారు. ప్రపంచ వింతలు, విడ్డూరాలనూ, విభిన్నమైన లైఫ్ స్టైల్స్‌నూ ఆర్టికల్స్ ద్వారా చెబుతూ ఎంతో ఆసక్తిగా చదివిస్తున్నారు. ముఖ్యంగా దహగాంగారికి, మావూరి విజయలక్ష్మిగారికి అభినందనలు. గడుగ్గాయి బొమ్మలు, ముద్దంటే చేదా!, హ్యాపీ లైఫ్‌కి చాక్లెట్ ట్రీట్‌మెంట్....ఇలా ప్రతీదీ బాగుంటున్నాయి. అడవిలోకి నడక నడవాలంటూ నాగరిక మనిషిని తట్టిలేపిన ఆర్టికల్ చాలా బాగుంది. నవ్య వీక్లీలో మీరు ప్రచురించే నయా ట్రెండ్ ఆర్టికల్స్‌కోసం ప్రతివారం మేం ఎదురుచూస్తూ ఉంటాం. సురభి వింతలు ఎంతో బాగుంటున్నాయి.

*-వల్లీపద్మావతి, సనత్‌నగర్, హైదరాబాద్*

### నేటి తరానికి మార్గదర్శి రావు బాలసరస్వతిదేవి

మొదటిపేజీ 'నివేదన' బాగుంది. అలనాటి నటి, గాయని రావు బాలసరస్వతిదేవి గారి ఇంటర్వ్యూ చాలా బాగుంది. నాటితరానికి చెందిన ఆవిడ పాటలు ఎంతో మధురంగా ఉండేవి. ఆవిడ లలిత గీతాలు ఎక్కువ ఆదరణ పొందాయి. ముప్పయ్యవ దశకంలోనే ఆమె 1500 రూపాయలు పారితోషికం తీసుకున్నారంటే, అప్పటికి అది చాలా ఎక్కువ. తొంభైయేళ్ళ వయసు దగ్గరపడుతున్నా ఆమె గాత్రంలో మార్పు లేకపోవడం గొప్ప విశేషం. నేటి తరానికి బాలసరస్వతీదేవి మార్గదర్శి.

*-బి.మల్లీశ్వరి, ఇ-మెయిల్*

### పొట్టివీరయ్య ఇంటర్వ్యూ బాగుంది

జూలై 13 సంచికలో పొట్టి వీరయ్య సినీ జీవిత విశేషాలు చాలా బాగున్నాయి. శ్రుతిహాసన్ మనోభావాలు బాగున్నాయి. 'మాతృత్వం ఒక చేదు జ్ఞాపకం', 'నిలబడి నీళ్ళు', 'ఆసరా' కథలు వాస్తవ జీవితానికి అనుగుణంగా ఉన్నాయి. హవేలీ సీరియల్ ఆసక్తికరంగా, ఉత్కంఠతో సాగుతోంది. చాక్లెట్ మ్యూజియం భలే ఆశ్చర్యాన్ని కలిగించింది. ముఖ్యంగా సినీ నారాయణీయం చాలా గొప్పగా ఉంటోంది.

*-చోడవరపు నాగేశ్వరరావు, బాగ్అంబర్‌పేట, హైదరాబాద్*



### సాహితీపురస్కార ప్రదానోత్సవం

*తెలంగాణ ప్రభుత్వ సలహాదారు డాక్టర్ కె.వి.రమణాచారి, పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య ఎల్లూరి శివారెడ్డి చేతులమీదుగా విశ్వవిద్యాలయ సాహితీపురస్కారం అందుకుంటున్న ప్రముఖ కథా రచయిత,నవ్య వారపత్రిక సంపాదకులు ఎ.ఎన్.జగన్నాథశర్మ. 2013వ సంవత్సరానికిగాను కథ ప్రక్రియలో ఉత్తమ గ్రంథంగా ఎంపికైన 'పేగుకాలిన వాసన' కు ఈ పురస్కారం లభించింది. హైదరాబాద్ పబ్లిక్‌గార్డెన్స్‌లోని డా.ఎన్.టి.రామారావు కళామందిరం వేదికపై జూలై 13 బుధవారం, 2016 న ఈ కార్యక్రమం జరిగింది.*

# చక్కని పోషకాహారం మన చద్దన్నం

రాత్రి మిగిలిన అన్నం దాచుకుని పొద్దున్న తినేదే చద్దన్నం. ఒకప్పుడు చద్దన్నాన్ని ఎంతో ఇష్టంగా తినేవారు. కానీ ఇప్పుడు రాత్రివేళ మిగిలిన ఆహారాన్ని అప్పటికప్పుడే పడేస్తున్నారు లేదా ఎవరికైనా ఇచ్చేస్తున్నారు. ఇప్పుడంటే ఉపాహార సంస్కృతి పెరిగిందిగానీ ఒకప్పుడు చద్దన్నమే పరమాన్నం కన్నా ఎక్కువ. పైగా పోషక విలువలు కూడా ఎక్కువ ఉంటాయట. అందుకే కాబోలు పెద్దల మాట చద్దన్నం మూట అనే సామెత పుట్టింది.

చద్దన్నం తినడం వల్ల శరీరంలో చాలా మార్పులు వస్తాయని ఓ సర్వేలో తేలింది. పాతతరం వారు ఎంతో ఇష్టంగా చద్దన్నం తినేవారట. అందుకే వారి ఆరోగ్యం చాలా చక్కగా ఉండేదని అంటారు. రాత్రి వండిన అన్నాన్ని తెల్లారి ఆవకాయ, పెరుగు కలుపుకుని పచ్చిమిరప, ఉల్లిగడ్డ నంజుకుని తినేవారు. దీంతో వారు రోజంతా ఎంతో ఉత్తేజంగా, శక్తిమంతంగా ఉండేవారు. అలా వారు అప్పటికీ ఇప్పటికీ అదే శక్తితో ముందుకు సాగుతున్నారు. కానీ మనమే దాన్ని పట్టించుకోలేదు.

G అమెరికన్ డైటెటిక్ అసోసియేషన్‌వారి పరిశోధన ప్రకారం సాధారణ భోజనం కంటే పైన చెప్పినవిధంగా తయారైన చద్దన్నంలోనే ఐరన్, పొటాషియం, కాల్షియం, విటమిన్లు దాదాపు 20 రెట్లు ఎక్కువ ఉంటాయని తేలింది. అందుకే అప్పట్లో మన పెద్దలకు అంతశక్తి ఉండేది. ఇప్పటికీ వారు ఆరోగ్యంగా ఉండగలుగుతున్నారంటే అదే కారణం.



G అన్నం పులవడం అంటే దానిని ఒకరాత్రి నిల్వ ఉంచడం. దీనివల్ల ఆహారంలో పోషకాలు పెరుగుతాయట. అంటే ఉదాహరణకు 50 గ్రాముల అన్నం తీసుకుని రాత్రి పులియబెడితే 1.6 మిల్లీగ్రాములు ఉన్న ఐరన్ 35 మిల్లీగ్రాములుగా పెరుగుతుంది. అలాగే పొటాషియం, కాల్షియంలు కూడా భారీ మొత్తంలో పెరుగుతాయని శాస్త్రవేత్తలు తేల్చి చెబుతున్నారు.

G కొంతమంది శరీరం ఎప్పుడు చూసినా వేడిగా జ్వరం వచ్చినట్లు ఉంటుంది. అలాంటివారు పెరుగు, ఉల్లిపాయ, పచ్చిమిరపకాయలతో చద్దన్నం కలిపి తింటే వేడి తత్వం తగ్గి శరీరానికి చలువ చేస్తుంది. అధిక వేడితో కడుపులో ఉండే దుష్పలితాలు తగ్గుతాయి.

G చద్దన్నం తినడంవల్ల దేహం పూర్తిగా అలసిపోదు. శరీరానికి కావల్సిన శక్తి లభిస్తుంది. దీనివల్ల రోజులో ఎక్కువ సమయం ఉల్లాసంగా ఉండడానికి వీలవుతుంది.

G చద్దన్నంలో ఉండే పీచుపదార్థం వల్ల మలబద్ధకం, నీరసం వంటి సమస్యలు తగ్గుతాయి.

G ఎదిగే పిల్లలకు ఇది గొప్ప పౌష్టిక ఆహారం. బక్కచిక్కిపోతున్న వారు తోడువేసిన చద్ది అన్నాన్ని, స్థూలకాయులు చల్లలో నానిన అన్నాన్ని తినడం వల్ల మంచి ఫలితాలను పొందవచ్చు.

G శరీరాన్ని ఎంతో ఎనర్జిటిక్‌గా ఉంచడానికి చద్దన్నం ఉపయోగపడుతుంది. అదేవిధంగా చద్దన్నం తినడం ద్వారా శరీరానికి మేలు చేసే బాక్టీరియా సంఖ్య పెరుగుతుంది.

G చద్దన్నం తినడంవల్ల శరీరంలో రోగనిరోధక శక్తి పెరుగుదల మాత్రమే కాకుండా కొన్ని చర్మ సంబంధమైన వ్యాధులనుంచి కూడా అది శరీరాన్ని రక్షిస్తుంది.

G చద్దన్నంలో ఉండే కొన్ని విలువైన పోషకాలు కడుపులో ఉండే అనారోగ్య సమస్యలను తగ్గిస్తాయి. పేగుల్లో వచ్చే అల్సర్ల ప్రభావాన్ని తగ్గిస్తుంది. అంతేకాకుండా బ్లడ్ ప్రెషర్‌ను అదుపులో ఉంచి హైపర్ టెన్షన్‌ను గణనీయంగా తగ్గిస్తుంది.

G అయితే చద్దన్నం తినాలి అన్నాం కదా అని, చద్దన్నాన్ని తెల్లారిన తర్వాత కూడా ఎక్కువ సమయం అలా ఉంచేస్తే పాచిపోయి వాసన వస్తుంది. అలాంటి అన్నం తినడంవల్ల కొత్త సమస్యలు వస్తాయి, చద్ది అన్నాన్ని ఉదయాన్నే తినేయాలి.

నవ్య



# థీమ్ హోటళ్లు థ్రిల్లింగ్ రెస్టారెంట్లు!

**ప్రపంచంలో విడ్డూరాలెన్నో! ప్రకృతి సహజసిద్ధమైన విడ్డూరాలు కొన్నైతే, మానవ మేధ సృష్టించిన విడ్డూరాలూ, వింతలూ మరికొన్ని. మారుతున్న సమాజంలో మనిషి ఆలోచనలు కూడా విడ్డూరంగానే ఉంటున్నాయి. అలాంటి వింత పోకడలకు అనుగుణంగానే ప్రపంచ సేవారంగం కూడా తన వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకుంటోంది.**

ఎప్పటికప్పుడు సర్వేనివేదికలు రప్పించుకుని కస్టమర్ల ఊహించనిరీతిలో అనేక మార్పులు, చేర్పులు చేసుకుంటుంది వ్యాపార రంగం. అలాంటి వాటిల్లో ముందంజలో ఉండి అబ్బురపరుస్తోంది హోటల్ బిజినెస్. వివిధ రకాల థీమ్‌లతో రెస్టారెంట్లు నిర్వహిస్తూ, థ్రిల్లింగ్ హోటల్స్ నడుపుతూ అతిథులను ఆశ్చర్యంలో ముంచెత్తుతున్నారు. ఆనందింపజేస్తున్నారు!

చలేస్తుంటే ఎండ కావాలనిపిస్తుంది, ఎండ దంచేస్తుంటే చల్లటిగాలి కోసం తహతహలాడుతుంది శరీరం! తిండి విషయంలోనూ అంతే! ఏసీ రెస్టారెంట్లో తిండిమీద విరక్తిపుడితే, బూబమ్మ దగ్గర ఆపాలూ, పుల్లట్లూ రోటిపచ్చడిలో నంజుకుని తినాలనిపిస్తుంది. ఆరుబయట చుక్కలు లెక్కబెడుతూ మాంచి కాఫీ తాగాలనిపిస్తుంది. ఇలా జిహ్వాకో రుచి, పుర్రెకో స్టైలూ ఉంటుంది. అందుకే ఇప్పుడు థీమ్ హోటల్స్, థ్రిల్లింగ్ రెస్టారెంట్లూ వచ్చేశాయి. అంతేకాదు, వీళ్ళంతా ఊహించని థీములతో ఆతిథ్యమిచ్చి అబ్బురపరుస్తున్నారు. ఓ హోటల్‌లో కళ్ళు మూసుకుని పడుకున్న ఓ అమ్మాయినే టేబుల్‌గా చేసుకుని భోజనం చేయాల్సి ఉంటుంది! ఇంకో రెస్టారెంట్‌లో మందు తాగాలన్నాసరే సిరంజీతోనే తాగాలిమరి! మరో రెస్టారెంట్‌లో ఏం తినాలన్నా సరే ముందుగా సీక్రెట్‌కోడ్ ఛేదించితీరాల్సిందే! ఇలా భిన్న రుచులతోనే కాదు విభిన్నమైన ఆలోచనలతో రూపొందించిన ఈ రెస్టారెంట్ల గురించి తెలుసుకోండి మరి!

## ఏదైనా సిరంజీ ద్వారానే

అక్కడికి వెళితే "నర్స్ త్వరగా రండి నాకు 800 ఎమ్ఎల్ వోడ్కా కావాలి. చాలా బాధగా ఉంది" అని ఓ కంఠం వినిపిస్తుంది. అదేదో హాస్పిటల్ అనుకునేరు! అయినా హాస్పిటల్‌లో వోడ్కా ఎందుకు సరఫరా చేస్తారు? అది హాస్పిటలూ కాదు వచ్చే అమ్మాయి నిజమైన నర్సూ కాదు, హాస్పిటల్ లాంటి ఓ రకమైన హోటల్. అవును ఈ హోటల్‌లో ఉండే పద్ధతంతా విచిత్రమే. తైపీలో ఉన్న విభిన్నమైన హోటల్ ఇది. ఇక్కడ అందమైన అమ్మాయిలు నర్సులుగా తయారయ్యి వడ్డిస్తారు. ఆపరేషన్ టేబుల్ మీదనే డిషెస్ ఉంటాయి. అక్కడే తినాలి. టెస్ట్‌ట్యూబ్ లేదా సిరంజ్ ద్వారా మాత్రమే బీర్‌గానీ, మరేదైనా డ్రింక్ గానీ సేవించాలి. దాన్ని నర్సులు తెచ్చి ఇస్తారు. గోడలపై మంచి మంచి బొమ్మలు ఉంటాయనుకునేరు ఎక్స్‌రే బొమ్మలు, స్కాన్ చేసిన స్కెలిటెన్ బొమ్మలు చూడ్డానికి భయం గొలిపేలా ఉంటాయి. వాటిని చూస్తూ ఫుడ్ లాగించడమూ ఓ వెరైటీయే అంటున్నారు అతిథులు. పైగా మీరు టాయిలెట్‌కి వెళ్లవలిసి వస్తే దాని పేరు ఎమర్జెన్సీ రూమ్ అని రాసుంటుంది. సర్వ్ చేసే ప్లేట్లు, స్పూన్లు అన్నీ హాస్పిటల్‌నే తలపిస్తాయి.

## హార్ట్‌ఎటాక్ రెస్టారెంట్!

పైన చెప్పిన హాస్పిటల్ లాంటి థీమ్ హోటలే ఇది కూడా. కాకుంటే వేటికవే ప్రత్యేకం. ఈ రెస్టారెంట్ లాస్‌వెగాస్‌లో ఉంది. పేరు హార్ట్ ఎటాక్ రెస్టారెంట్. అదేంటండీ బాబు పేరే హార్ట్‌ఎటాక్ తెప్పించేలా ఉందనుకుంటున్నారా? ఈ రెస్టారెంట్‌కి వెళ్లాలంటే ముందుగా ఆ హెచ్చరిక బోర్డు చదువుకుని లోనికి వెళ్లడం మంచిది. ఎందుకంటే రెస్టారెంట్ నిర్వాహకుడు అక్కడికి రావొద్దనీ, వస్తే చావు తప్పదనీ హెచ్చరిస్తుంటాడు. ఆ రెస్టారెంట్‌లో ఉన్న ప్రతీ టేబుల్ పేరు కూడా రోగాల పేర్ల మాదిరిగా ఉంటాయి. ఇక ఆర్డరిచ్చే పదార్థాల పేర్లు కూడా వివిధ మాంసాలతో తయారుచేసే బైపాస్ బర్గర్, కరోనరీ, హాట్‌డాగ్, ఫ్లాట్‌లైన్, ఫ్రైస్ ఇలాంటి వ్యాధులు, వాటి చికిత్సల పేర్లతో కస్టమర్లను



భయపెడుతుంటాయి. ఇక్కడ కూడా సర్వ్ చేసేది నర్స్ వేషంలో ఉన్న అమ్మాయిలే. వచ్చిన ప్రతీ కస్టమర్‌కీ హాస్పిటల్‌లో ధరించే గౌన్ లాంటిది ఇస్తారు. కస్టమర్లు దాన్ని తొడుక్కుని భోజనం చేయాలన్నమాట!

### నగ్న శరీరంపై

ఓ మహిళ శరీరంపై వరుసగా పేర్చబడిన ఆహారపదార్థాలను తినగలరా? కానీ ఇదే ఆ హోటల్ స్పెషాలిటీ. జపాన్‌లో ఉన్న రెస్టారెంట్లలో ఇదో వెరైటీ రెస్టారెంట్. పేరు క్యానబాలిస్టిక్ రెస్టారెంట్. నగ్నంగా ఉన్న మహిళ శరీరంపై తినే ఆహార పదార్థాలు పెడతారు. అయితే నిజమైన మహిళ అనుకునేరు అక్కడే ట్విస్ట్ ఉంది. వాళ్లంతా నిజమైన మహిళలు కారు అచ్చం నిజమైన నగ్న మహిళలా కనిపించే బొమ్మలు మాత్రమే. వివిధ రకాల డిషెస్‌తో మహిళల ఆకారంలో రూపొందించిన బొమ్మల్ని టేబుల్‌పై ఉంచుతారు. వచ్చిన వాళ్లు తాము నిజంగానే నరమాంస భక్షణ చేస్తున్నట్టు భావించి ఆ ఆహారాన్ని గుటుక్కుమనిపిస్తారు. ఇలా కళ్లు మూసుకుని పడుకున్న మహిళలపై పెట్టిన ఆహారపదార్థాలను వినియోగదారులు ఇష్టంగా తింటున్నారనీ, తమ కలెక్షన్లు కూడా బాగుంటున్నాయనీ ఈ హోటల్ నిర్వాహకులు చెబుతున్నారు.

### ప్రకృతి ఒడిలో ప్రశాంతంగా

జనావాసాలకు దూరంగా ఓపెన్‌ప్లేస్‌లో చల్లటి గాలిలో ఆకాశంలో నక్షత్రాలు చూస్తూ హాయిగా గడపాలని ప్రతీఒక్కరూ కోరుకుంటారు. కానీ ఇప్పటికాలంలో ఇలాంటి కోరికలు నెరవేరడం చాలా కష్టమైన పనే. పోనీ ఎటైనా ప్రకృతి ప్రాంతాలకు వెళ్లినా అన్నీ హంగులతో కూడిన హోటళ్ళే తప్ప ప్రకృతిని పంచే ప్రాంతాలు లేనేలేవు. అందుకోసమే స్విట్జర్లాండ్‌లో ప్రకృతి ప్రేమికులకోసం ప్రత్యేకమైన హోటల్ ఏర్పాటు చేశారు. స్విట్జర్లాండ్‌లోని పర్వతప్రాంతం స్విస్ ఆల్ప్స్‌లో నల్ స్టర్న్ అనే పేరుతో హోటల్ ప్రారంభమైంది. చుట్టూ పచ్చటి పచ్చిక తప్ప మనుషులు కనిపించరు, ఎలాంటి అడ్డుగోడలూ ఉండని ఈ ప్రదేశంలో మంచం.. టేబుల్ క్యాండిల్ లైట్స్ ఏర్పాటు చేస్తారు. ఈ బహిరంగ ప్రదేశంలో నేలకూ నింగికీ మధ్య హాయిగా సేద తీరవచ్చు. అతిథులకు అవసరమైనవన్నీ అందుబాటులో ఉంచి సేవకులు అక్కడి నుండి వెళ్ళిపోతారు. తిరిగి మళ్ళీ సూర్యోదయం తర్వాతే సదరు అతిథులకు కాఫీ టిఫిన్ తీసుకుని వస్తాడు. ఈ ప్రకృతి హోటల్‌లో ఒకరాత్రి బస చేయాలంటే మాత్రం 23 వేల రూపాయలు చెల్లించాల్సిందే. అయితే ఈ హోటల్ సర్వీస్ వాతావరణంపై ఆధారపడి ఉంటుందంటున్నారు నిర్వాహకులు.

### సీక్రెట్ కోడ్ తెలిసి ఉండాల్సిందే

ఆ రెస్టారెంట్‌లో అడుగుపెట్టడం అంత సులభం కాదు. ఆ రెస్టారెంట్‌కి వెళితే అడుగడుక్కీ చెకింగ్‌లూ, సీక్రెట్ కోడ్‌లూ చెప్పాల్సిందే. సీఐడీ ఇన్వెస్టిగేషన్‌లా సెక్యూర్‌గా ఏదో మిస్టరీ ఛేదిస్తున్న అనుభవం కలుగుతుంది అతిథులకు. కస్టమర్‌కి రెస్టారెంట్ సీక్రెట్ కోడ్ తెలిసే ఉండాలట. కేవలం ఆ హోటల్‌లో అడుగుపెట్టినంత మాత్రాన సరిపోదు ఆహార పదార్థాలు తెప్పించుకోవడం కూడా ఓ పెద్ద పనే! సీక్రెట్ ఫోన్‌బూత్ ద్వారా బయట వ్యక్తులకు తెలియకుండా ఆహారపదార్థాలను తెప్పించుకోవాలన్నమాట. అన్నిటికీ పాస్‌వర్డ్, సీక్రెట్‌కోడ్ చెప్పాల్సిందే! ఇలా రహస్యంగా అన్ని పనులు చేయడం అతిథులకు థ్రిల్ కలిగిస్తుందని హోటల్ నిర్వాహకులు చెబుతున్నారు.

### వాటర్‌ఫాల్ రెస్టారెంట్

హాయిగొలిపించే జలపాతం జాలువారుతూ ఓ వైపు చూడడానికి ఎంతో ఆకర్షణీయంగా కనబడుతూ ఉంటుంది. కనువిందు చేసే ఆ జల కళను ఎంజాయ్ చేస్తూ మనం కాళ్ళు ఆ నీళ్ళలో ఉంచి ఆడుతూ, అక్కడ కూర్చుని భోజనం చేస్తుంటే ఎంత బాగుంటుందో కదూ! ఇలాంటి అభిరుచి ఉన్నవారి కోసమే ఈ జలపాతం ఏర్పాటు చేశారు. ఇదే ఈ రెస్టారెంట్ స్పెషాలిటీ! ఫిలిప్పీన్స్‌లో ఉన్న ఈ రెస్టారెంట్ పేరు విల్లా ఎస్కుడెరో వాటర్‌ఫాల్స్ రెస్టారెంట్. కృత్రిమమైన వాటర్‌ఫాల్‌ని ఏర్పాటు చేసి ప్రకృతి ఒడిలో సేదదీరుతూ భోజనం చేసేలా అతిథులకు ఆహ్లాదాన్ని అందించడమే ఈ రెస్టారెంట్ స్పెషాలిటీ.

### అన్నీ పురాతనమే

పూర్వకాలంలో సత్రాలు, పూటకూళ్ళమ్మ ఇళ్ళే రెస్టారెంట్లు. అలాంటిదే 18వ శతాబ్దం నాటి ఓ జపనీస్ గ్రామంలో నింజా హోటల్ కట్టారు. పురాతన సంప్రదాయాల్ని వదలకుండా, నింజాల మాదిరి మాస్కులు ధరించి సర్వర్లు ఇక్కడ సర్వ్ చేస్తుంటారు. సంప్రదాయకమైన భోజనం కావాలనుకునే వారు ఇక్కడికి వెళ్లవచ్చు. ఇక్కడ దొరికే ఆహార పదార్థాలు కూడా 18వ శతాబ్దం నాటి ఆహారం మాదిరిగానే ఉంటాయి. హోటల్ రూపురేఖలు కూడా ఆ కాలానికి తగినట్లే ఉంటాయి.

- సంతోషలక్ష్మి దహగాం

## రొమాన్స్‌కి సరైన స్థలం హోటలే!



శృంగారానికి సరైన ప్రదేశం ఏది? ఇల్లా? హోటల్ రూమా? ఇల్లు ఉండగా హోటల్ రూమ్ ఎందుకన్న సందేహం కలగొచ్చు కానీ ఇదే అంశం మీద ఒక తాజా సర్వే నిర్వహించారు. అందులో వెల్లడైన అంశాలు ఆసక్తికరంగా ఉండటమే కాదు ఆశ్చర్యాన్ని రేకెత్తిస్తున్నాయి. 11 దేశాలకు చెందిన దాదాపు 2,200 మందిని ప్రశ్నించి మరీ ఈ విషయాన్ని తేల్చేశారు పరిశోధకులు. భాగస్వామితో శృంగారానికి హోటల్‌కి మించిన బెస్ట్‌ప్లేస్ మరోటి లేదని ఈ సర్వేలో చాలామంది అభిప్రాయపడ్డారు. ఇంటితో పోలిస్తే హోటల్‌రూంలోనే పార్టనర్లు ఇద్దరూ చెలరేగిపోతారట. దీర్ఘకాలిక శృంగారానికి హోటల్‌రూమే వేదిక అవుతుందని తేల్చేశారు. ఇంటి బెడ్‌రూమ్‌లో ఉన్నప్పుడు కొద్దినిమిషాల పాటు సాగే శృంగారం హోటల్ రూమ్‌లో మాత్రం 25 నుంచి 49 నిమిషాల వరకూ ఉంటుందని చెబుతున్నారు. క్వాలిటీ రొమాన్స్‌కు హోటల్ రూమ్ బెస్ట్ చాయిస్ అంటున్నారు వీళ్ళంతా!! బ్రిటీషర్లతో పాటు కెనడియన్లు పలు దేశాలకు చెందిన వారు కూడా ఇదే విషయాన్ని వెల్లడించినట్టు సర్వే పేర్కొంది.

## చల్లచల్లని ఇగ్లూ రెస్టారెంట్



చల్లని ప్రదేశాలలో నిర్మించిన ఇళ్ళని ఇగ్లూలంటారని మనందరికీ తెలిసిందే. అలాంటి ఇగ్లూ హోటల్ గురించి విన్నారా ఎప్పుడైనా! ఫిన్లాండ్‌లోని శారిసెల్కాలో ఉంది ఈ హోటల్. ఇందులో మొత్తం 40 అద్దాల ఇగ్లూలు ఉంటాయి. ఆకాశంలో కనువిందు చేసే ఉత్తరధృవ కాంతులను చూడడానికి పర్యాటకులు ఎక్కువ మంది ఇక్కడికి వస్తారు. బయట విపరీతంగా మంచు ఉన్నా గదిలో మాత్రం వెచ్చగా ఉంటుంది. ఈ హోటల్‌లో ఓ మంచు రెస్టారెంట్ కూడా ఉంది. ఇక్కడ బల్లలు సహా అన్నీ ఐస్‌తో చేసినవే. ఒక్కో ఇగ్లూ రూంలో ఇద్దరు ఉండొచ్చు. ఒక రోజుకు 25 వేల రూపాయలు అద్దె వసూలు చేస్తారు.

# మాధవసేవ

ఎమ్వీ రామిరెడ్డి



**తాపీగా రెండో కప్పు కాఫీ తాగి, పేపర్లో మునిగిపోయాడు జేకేఆర్.**

**"మళ్లీ పేపర్లో తల దూర్చారా? సరుకుల లిస్టు రాయమన్నాను గదా" కోప్పడింది భారతి.**

**"రోట్లో తల పెట్టొద్దంటారు గానీ పేపరు విషయంలో అలాంటి రూలేమీలేదే" ఏ అంశాన్నైనా సరదాగా తీసుకునే జేకేఆర్, భార్య సహనాన్ని మరింతగా దెబ్బతీశాడు.**

ఆమె ఉరిమి చూసేసరికి కలం, కాగితం చేతుల్లోకి తీసుకుని "ఇక చెప్పవోయ్" అన్నాడు.

"ముందు ఓం రాయండి" అందామె.

"ఓమా! అలాంటి వస్తువేదీ సూపర్ మార్కెట్లో దొరకదే?" సీరియస్‌గా అన్నాడు జేకేఆర్.

"జోకార్లేగానీ, చెప్పింది చెయ్యండి" ఆయన వెటకారానికి ఉప్పు దట్టించటం ఆమెకు అలవాటే.

ఆయన 'ఓం'కారం చుట్టి, "తర్వాత.." అన్నాడు.

"పసుపు, కుంకుమ రాయండి".

"అవి మనింట్లో రెండు డబ్బాలనిండా ఉన్నాయ్ కదోయ్!"

"అబ్బా, శుభకార్యానికి ఓం ప్రథమం పసుపు కుంకుమలు రాయడం సంప్రదాయం" విసుక్కుందామె.

"ఓహో... అలాగా..."

"ఏమిటీ, అలాగా అని దీర్ఘాలు తీస్తున్నారు" అంటూ అప్పుడే లోపలికొచ్చాడు మాధవయ్య. ఆయన అదే అపార్టుమెంటులో పై అంతస్తులో ఉంటాడు.

"రండి రండి. మీ చెల్లెమ్మ డిక్టేషన్ ఇస్తోందిలే" అన్నాడు జేకేఆర్ నవ్వుతూ.

"రండన్నయ్యా, తెల్లవారితే కావ్య ఎంగేజ్‌మెంటు. ఈయనకి చీమ కుట్టినట్లయినా లేదు. పూజాసామగ్రి, చిల్లరసరుకులు తెమ్మని నిన్నటి నుంచీ పోరుతుంటే, ఇదుగో ఇప్పటికి తీరింది ఈయనకి" భారతి ఫిర్యాదు.

వారం క్రితం హైదరాబాదులోని బీహెచ్ఇఎల్ దగ్గర్లో ఉంటున్న జేకేఆర్ ఇంటిని వెతుక్కుంటూ ఓ కుర్రాడొచ్చాడు. డైరెక్టుగా విషయంలోకి వచ్చాడు. తనలాగే సరదాగా మాట్లాడుతున్న ఆ కుర్రాడితో పది నిమిషాల్లో స్నేహం కుదిరింది జేకేఆర్‌కు. భారతికి కూడా అర్జంటుగా నచ్చేశాడు.

బయటికెళ్లిన కావ్య అప్పుడే ఇంటికొచ్చింది. పెళ్లిచూపులు అనే తంతు లేకుండా అమ్మాయి, అబ్బాయి మనసులు విప్పుకున్నారు. ఒకరికొకరు నచ్చారు.

మరుసటిరోజే అబ్బాయి తల్లిదండ్రులు వచ్చారు. అన్నీ మాట్లాడుకున్నారు. పెళ్లికి పచ్చ జెండా ఊపారు.

"చిత్రంగా ఉంది వదినగారూ. పెళ్ళికోసమని మావాడు నెల రోజులు సెలవుపెట్టి అమెరికా నుంచి వచ్చాడు. మూడు సంబంధాలు చూసి ఉంచాం. వాడికి ఒక్కటీ నచ్చలేదు. పది రోజుల్లో వెళ్లిపోతున్నాడు. ఇంతలో హఠాత్తుగా ఈ సంబంధం" సంబరంగా అంది కుర్రాడి తల్లి.

సరిగ్గా వారం రోజుల్లోనే ఎంగేజ్‌మెంట్ పెట్టుకున్నారు.

"వచ్చే ఆదివారం బాగుంది. ఆరోజు ఎంగేజ్‌మెంట్ అయిపోతే, మూడురోజుల తర్వాత బాబు అమెరికా వెళ్లిపోతాడు. నాలుగు నెలల తర్వాత పెళ్ళి పెట్టుకుందాం" అబ్బాయి తల్లి.

అందరికీ అంగీకారం కుదిరింది.

పుస్తకాలతో కాలక్షేపం చేసే జేకేఆర్ నాలుగైదు రోజులుగా పరుగులు తీశాడు. ఇంటికి దగ్గర్లోని చిన్న ఫంక్షన్‌హాలు బుక్‌చేశాడు. భోజనాలకు ఆర్డరిచ్చాడు. పురోహితుణ్ణి మాట్లాడాడు. భార్యతో కలిసి షాపింగ్ చేశాడు. బంధువుల్ని ఆహ్వానించాడు.

మిగిలిందల్లా ఎల్బీనగర్‌దాకా వెళ్ళి, మరదలిగారింట్లో ఉన్న బంగారు నగలు తీసుకుని, తిరుగు ప్రయాణంలో పూజాసామగ్రి, చిల్లరసరుకులు కొనడమే.

ఇప్పుడు ఆ పనిమీదే బయల్దేరబోతుంటే, 'నేనూ వస్తాను జేకే. బోర్ కొడుతోంది" అన్నాడు మాధవయ్య. ఆయన భార్య, కొడుకు, కోడలు క్రితం రోజే బెంగళూరు వెళ్లారు.

"సుశీలావాళ్లు రేపటికల్లా వస్తారా?" అడిగింది భారతి.

"లేదమ్మా, ఈ రాత్రికి గృహప్రవేశం. రెండ్రోజుల తర్వాత వస్తారు" చెప్పాడు మాధవయ్య.

"అయ్యో, నిశ్చితార్థానికి ఉంటే బాగుండేదే..."

"పర్లేదమ్మా, అందరి బదులూ నేనున్నాగా" నవ్వుతూ అన్నాడు మాధవయ్య.

"సరే, మరి మేం బయల్దేరతాం. మంటపం డెకరేషన్ వాళ్ళతో మాట్లాడాను, క్యాటరింగ్ వాళ్లతో మాట్లాడాను, పంతులుగారితో మాట్లాడాను. అరేంజ్‌మెంట్స్ అన్నీ అయినట్లే. నువ్వేం కంగారు పడకు. పన్నెండు గంటలకంతా ఇంట్లో ఉంటా" భార్యకు చెబుతూ కారు స్టార్ట్ చేశాడు జేకేఆర్. మాధవయ్య ముందు సీట్లో కూర్చున్నాడు.

కారు అలా వెళ్లిపోగానే, మార్కాపురం నుంచి కొందరు చుట్టాలు ఇంట్లో అడుగుపెట్టారు. బ్యూటీ పార్లర్‌కు వెళ్లిన కావ్య తిరిగొచ్చింది. ఇంటికి పెళ్ళి



కళ వచ్చింది. భారతి సంతోషంగా పనుల్లో నిమగ్న మైంది.

•••

మెయిన్‌రోడ్డు ఎక్కాక, కారు వేగం అందు కుంది. జేకేఆర్ జోకులు పేలుస్తున్నాడు. మాధవయ్య పడీపడీ నవ్వుతున్నాడు. పెద్దగా ట్రాఫిక్ లేకపోవడంతో ఉదయం తొమ్మిది గంటల్లోపే ఎల్బీనగర్‌లో మరదలి ఇంటికి చేరుకున్నారు. మాధవయ్య తాను కారులోనే కూర్చుంటానని చెప్పడంతో జేకేఆర్ ఒక్కడే ఇంట్లోకి నడిచి, పావుగంట తర్వాత నగలతో బయటికొచ్చి, కారెక్కాడు.

కారు స్టార్ట్ చేయబోతూ, మాధవయ్య ముఖంలోకి చూశాడు. ఏదో తేడా కనిపించింది.

"మాధవయ్యగారూ, ఆర్‌యూ ఆల్‌రైట్?" కంగారుగా అడిగాడు జేకేఆర్.

"కొద్దిగా గుండెల్లో నొప్పిగా ఉంది" బాధ పంటి బిగువున భరిస్తున్నాడన్న విషయం అర్థమవు తూనే ఉంది.

"అవునా! ఇక్కడికి దగ్గర్లోనే ఆస్పత్రి ఉంది. అయిదు నిమిషాల్లో తీసుకెళ్తా. డోన్ట్‌వర్రీ" కారు మెయిన్‌రోడ్డు ఎక్కింది.

మాధవయ్య తన రెండు చేతుల్నీ గుండెల మీద ఉంచుకుని, సీట్లో వెనక్కి వాలి, కళ్లు మూసు కున్నాడు.

"మాధవయ్యగారూ, దీన్నిబట్టి మీకు నిజంగా గుండె ఉందన్న విషయం రూఢి అయింది. ఏమం టారు?" వాతావరణాన్ని కాస్త తేలిక పరిచేందుకు ప్రయత్నించాడు జేకేఆర్. అంత బాధలోనూ సన్నగా నవ్వాడు మాధవయ్య.

ఏడెనిమిది నిమిషాల్లో కారు ఓ కార్పొరేట్ ఆస్పత్రి ముందు ఆగింది. నిమిషాల్లో స్ట్రెచర్ వచ్చింది.

కార్డియాలజిస్టు పరీక్షించి, వెంటనే యాంజియో గ్రామ్ చేయాలన్నారు. థియేటర్లోకి తీసుకెళ్లారు.

సునామీ వస్తోందని చెబితే 'రానీండి మాస్టారూ, మనకీ ఓ అనుభవం మిగులుతుందిగా" అంటూ నింపాదిగా జోకులేసే జేకేఆర్, జీవితంలో తొలిసారి కంగారుగా రిసెప్షన్‌లో వెయిట్ చేస్తు న్నాడు.

పదిన్నర కావస్తుండగా, డాక్టరు పిలిచాడు.

"ఆయనకు హార్ట్‌లో రెండు సివియర్ బ్లాక్స్ ఉన్నాయి. అర్జెంటుగా ఆపరేషన్ చెయ్యాలి. అఫ్

**నవ్యవీక్లి- నాటా సంయుక్త నిర్వహణలో బహుమతి పొందిన కథ**

## నయన దెబ్బ మామూలుగా లేదు

*గతంలో దర్శకుడు చెప్పినట్టు నటీనటులు వినేవారు. ఇప్పుడు సీన్ రివర్స్ అయింది అంటున్నారు సినీ జనాలు. చాలా రోజులు గ్యాప్ తీసుకుని తెలుగు సినిమా చేస్తున్న నయన ఆ సినిమా దర్శకనిర్మాతలను ఓ రేంజ్‌లో ఆడుకుంటోందట! 'బాబు బంగారం' సినిమాలో నయన మీద తీయవలసిన ఒకపాట, కొన్ని సన్నివేశాలు బ్యాలెన్స్ ఉండిపోయాయనే సంగతి తెలిసిందే! వీటిని పూర్తి చేసేందుకు రమ్మని ఎంత పిలిచినా నయన ససేమిరా అంటోందట! ఆమె కారణాలు ఆమెకుంటే, దర్శకనిర్మాతలు చెప్పే కారణాలు వేరేగా ఉంటున్నాయి. దాంతో ఇక నయనతో వేగలేమంటూ ఆమెతో చేసే సన్నివేశాలకు చెక్ పెట్టేసి సినిమా విడుదలకు డిసైడ్ అయిపోయారట! ఇక మీదట నయనతో తెలుగులో సినిమా చేయలనుకునేవారికి కష్టాలు తప్పవని కొందరు దర్శకనిర్మాతలు బాహాటంగానే విమర్శిస్తున్నారట!*



కోర్స్, చేసినా అది సక్సెస్ అవుతుందన్న గ్యారంటీ లేదు. ఆయన్ని బెడ్‌మీదే ఉంచాం. మీ నిర్ణయం చెబితే, ఆపరేషన్ స్టార్ట్ చేస్తాం" అన్నాడు డాక్టర్.

"సక్సెస్ అవుతుందిగా!" ఆశగా అడిగాడు జేకేఆర్.

"టెన్ పర్సెంట్" డాక్టరు జవాబు.

"గాడ్! చాలాతక్కువ. ఆయన భార్యాపిల్లలు బెంగళూరులో ఉన్నారు. నేనెలా నిర్ణయం తీసుకోగలను?"

"అవన్నీ నాకు తెలియవు. బట్, ఇలాంటి కేసుల్లో ఛాన్సెస్ అలాగే ఉంటాయి. నిజానికి టెన్ పర్సంటంటే ఎక్కువ".

"పోనీ, మార్గాంతరం ఏదైనా ఉందా?"

"మీరు ఆఘమేఘాల మీద అమెరికా తీసుకెళ్లినా, ఇంతకంటే ఆల్టర్నేటివ్ లేదు".

"ఒక్కనిమిషం టైమివ్వండి డాక్టర్. వాళ్ళ బ్బాయికి ఫోన్ చేసి చెబుతాను".

"ఓకే. బట్, మీరెంత ఫాస్ట్‌గా నిర్ణయం తీసుకుంటే అంత మంచిది. బిల్లు మూడు లక్షలపైనే అవుతుంది. అదికూడా ఆలోచించుకోండి" డాక్టర్ మళ్ళీ థియేటర్లోకి వెళ్లిపోయాడు.

జేకేఆర్‌కు ఏమీ తోచలేదు. చకచకా రిసెప్షన్ దగ్గరికెళ్లాడు. అక్కడ కుర్చీలో పెట్టి ఉన్న మాధవయ్య చొక్కా జేబులోంచి సెల్‌ఫోన్ తీసుకుని, ఆయన కొడుక్కి రింగ్ చేశాడు. కలవలేదు. ఎన్నిసార్లు ప్రయత్నించినా ఫలితం లేదు.

తన శ్రీమతికి చెప్పి, మాధవయ్య భార్యతో మాట్లాడిస్తే!

ఇద్దరూ ఫంక్షన్ల హడావిడిలో ఉన్నారు. కంగారెత్తిపోతారు. అనవసరం. తనే నిర్ణయం తీసుకోవాలి.

డాక్టర్ దగ్గరకెళ్లి "ఆపరేషన్ చేసెయ్యండి సార్" అన్నాడు.

డాక్టర్ ఓ స్లిప్ ఇచ్చి, "కౌంటర్లో అడ్వాన్స్ కట్టి రండి" అన్నాడు.

క్రెడిట్ కార్డు మీద లక్ష రూపాయలు చెల్లించి, రశీదు తీసుకున్నాడు జేకేఆర్.

మాధవయ్యను ఆపరేషన్ థియేటర్లోకి తీసుకెళ్లారు. కనీసం నాలుగు గంటలు పడుతుందని చెప్పారు.

మళ్లీ రిసెప్షన్ దగ్గరకొచ్చి, అక్కడున్న కుర్చీలో కూర్చున్నాడు జేకేఆర్.

ఒంటిగంటకు భారతి నుంచి ఫోను "ఎక్కడున్నారు, ఇంకా రాలేదేంటి?" అని.

"ఇక్కడ పాతకాలపు మిత్రుడొకడు కలిశాడు. బయల్దేరుతున్నాం. గంటలో వచ్చేస్తాం" అబద్ధం చెప్పాడు.

హైదరాబాదులో అయిదు వేల కోట్ల టర్నోవర్ గల ఓ మౌలిక వసతుల కంపెనీకి చీఫ్ ఫైనాన్షియల్ ఆఫీసరుగా, సౌదీ, దుబాయ్ వంటి దేశాల్లో ఎకనామిస్ట్‌గా పని చేసినప్పుడు... ఎన్నోసార్లు సమస్యలు మీద పడ్డాయి. వ్యాపారం దెబ్బతిని, కంపెనీ ఆర్థికంగా కుంగిపోతున్న పరిస్థితుల్లోనూ ఆయన చెక్కు చెదరలేదు. చిరునవ్వుతో పరిష్కార మార్గాలు కనుగొన్నాడు. కంపెనీకి తానెంత విలువైన వ్యక్తో నిరూపించు కున్నాడు. అలాంటి మనిషి ఇప్పుడు ఆందోళనలో చిక్కుకున్నాడు.

రెండున్నరకు మళ్లీ భార్య నుంచి ఫోను.

"మాధవయ్యగారికి స్ట్రోకు వచ్చింది. ఆస్పత్రిలో చేర్పించాను. ఆపరేషన్ జరుగుతోంది" మెల్లగా చెప్పాడు జేకేఆర్.

"అయ్యో, అలాగా! సరే, మీ ఫ్రెండ్స్‌కెవరికైనా ఫోన్జేసి రమ్మనండి. వాళ్లను ఆస్పత్రిలో ఉంచేసి, మీరు ఇంటికొచ్చేయండి" సలహా చెప్పి, ఆమె ఫోన్ కట్ చేసింది, అదే ఆర్డర్ అన్నట్టుగా.

నలుగురైదుగురు మిత్రులకు ఫోన్‌చేశాడు. ఒక్కొక్కరూ ఒక్కో కారణం చెప్పారు.

కుర్చీలోనే వెనక్కి వాలి, విశ్రాంతిగా కళ్లు మూసుకున్నాడు.

తనకన్నా మాధవయ్య మూడేళ్లు పెద్ద. చాలా మంచి మనిషి. పదిహేనేళ్ల స్నేహం. ఇద్దరూ రిటైరయ్యారు. ఉదయపు నడకనూ, ఉబుసుపోక కబుర్లనూ పంచుకుంటారు. చాలా సందర్భాల్లో తనకు అండగా నిలిచాడు. పదేళ్లక్రితం తను మార్కాపురం దగ్గర పదెకరాలు కొన్నాడు. అప్పట్లో ఎకరం రెండు లక్షల్లోపే. బంధువొకాయన్ని నమ్మి, సగం డబ్బులిచ్చేశాడు. ఆ దశలో స్థానిక రాజకీయనాయకుడొకరు రంగప్రవేశం చేసి, రిజిస్ట్రేషన్ అడ్డుకున్నాడు. తనే మార్కాపురం వెళ్లి, అతనితో మాట్లాడాడు. అతగాడు దారికి రాకపోగా, 'ఆ పొలం జోలికొస్తే ప్రాణం తీస్తా"నని బెదిరించాడు.

**ఊపిరిసలపని పెళ్ళి పనులతో తిరుగుతున్నాడతను. ఒక పని చక్కబెట్టుకుని వచ్చేసరికి కారులో కూర్చున్న స్నేహితుడు గుండెనొప్పితో మెలికలు తిరిగిపోతున్నాడు. ఆ పనులన్నీ పక్కనబెట్టి హాస్పిటల్‌లో చేర్పించాడతన్ని. హార్ట్‌లో రెండు బ్లాక్స్ ఉన్నాయి. వెంటనే ఆపరేషన్ చెయ్యాలన్నారు డాక్టర్లు. అతని భార్యాపిల్లలకి ఎన్ని సార్లు ఫోన్ చేసినా లిఫ్ట్ చెయ్యడం లేదు. ఆ పరిస్థితుల్లో అతనేం చేశాడు? స్నేహధర్మం పాటించాడా? లేదా?**

తనకిలాంటి గొడవలంటే చిరాకు. ఇరవై లక్షలు పోతే మాన్లే అనుకుని వదిలేశాడు. విషయం తెలుసుకున్న మాధవయ్య రంగంలోకి దిగాడు. పాత పరిచయాలతో ఎమ్మెల్యేలను, అధికారులను కలిసి సమస్యను వారి దృష్టికి తీసుకెళ్లాడు. వాళ్లిచ్చిన ధైర్యంతో మాధవయ్య తనను వెంటబెట్టుకుని మార్కాపురం తీసుకెళ్లాడు. ఆ పాటికే ఇద్దరు ఎమ్మెల్యేలు ఫోన్లో వార్నింగ్ ఇచ్చిన కారణంగా సదరు చోటానాయకుడు మారు మాట్లాడకుండా రిజిస్ట్రేషన్‌కు సహకరించాడు.

ఇప్పుడా ఆస్తి విలువ రెండుకోట్ల పైమాటే.

మధ్యాహ్నం మూడున్నరకు డాక్టరు నుంచి పిలుపొచ్చింది.

"ఆపరేషన్ పూర్తయింది. ఓపెన్‌చేశాక, రెండు స్టంట్లు వేయాల్సి వచ్చింది. అందుకే ఎక్కువ సమయం పట్టింది. ఇటు చూడండి.." అంటూ డాక్టర్ తన ఎదురుగా ఉన్న డెస్క్‌టాప్‌లో ఓ ఫైల్ ఓపెన్

చేశాడు. రెండుచోట్ల నరాలు పూడుకుపోవడం వల్ల రక్తం సరఫరా నిలిచిపోయిందనీ, స్టంట్లు వేయడానికి చాలా శ్రమపడాల్సి వచ్చిందనీ కంప్యూటర్లో ఆయా భాగాలు చూపిస్తూ చెప్పాడు. ఇరవై నాలుగు గంటల్లోపు మళ్లీ స్ట్రోక్ వచ్చే అవకాశం లేకపోలేదన్నారు.

"ఎనీ హౌ, ఆయన ఒక రకంగా చాలా అదృష్ట వంతుడు. సమయానికి వైద్యం అందింది" అన్నాడు డాక్టర్.

"ప్రాణహాని లేదని ష్యూర్‌గా చెప్పలేమా డాక్టర్?" అడిగాడు జేకేఆర్.

"నో. కనీసం పద్దెనిమిది గంటలు గడవాలి. ఐసీయూకి తరలిస్తున్నాం. అరగంట తర్వాత మీరు ఆయన్ని చూడొచ్చు" చెప్పేసి, మళ్లీ థియేటర్‌వైపు వెళ్లాడు డాక్టర్.

జేకేఆర్ భారంగా ఊపిరి తీసుకున్నాడు.

నాలుగంతస్తులు మెట్లు దిగి, ఆస్పత్రి బయట రోడ్డుమీద ఉన్న కేఫ్‌లోకి నడిచాడు.

మరోసారి మాధవయ్య కొడుకు ఫోనుకు రింగ్ చేశాడు. కలవలేదు.

ఆకలి దంచేస్తోంది. టిఫిన్ దొరకలేదు. బిస్కెట్ టీలో ముంచుకొని నోట్లో పెట్టుకున్నాడు. ఫోన్ మోగింది. భార్య. సెల్‌ఫోన్‌లో సమయం చూశాడు. నాలుగున్నర దాటింది.

"అసలు మీకు మతి ఉందా? ఒక్కదాన్నీ ఛస్తున్నాను. ఇంకెంతసేపట్లో వస్తారు?" ఆమె కస్సుమంది.

"వస్తున్నా భారతీ, వస్తున్నా. ఆపరేషన్ ఇప్పుడే అయిపోయింది".

"అవన్నీ నాకు తెలియదు. పెద్దపాప విషయంలో పెళ్ళిముచ్చట లేకుండా చేశారు. కనీసం ఈసారైనా నాకా సంతోషం మిగల్చండి. బయల్దేరండి" ఫోన్ పెట్టేసింది.

జేకేఆర్ చిత్రంగా నవ్వుకున్నాడు. తను ఉద్యోగం చేసినంత కాలం భార్య సరిగ్గా మధ్యాహ్నం రెండు గంటలకు ఫోన్ చేసి "భోంచేశారా" అనడిగేది.

మార్కాపురం ప్రాంతం నుంచి ఎంతోమంది తనను ఉద్యోగం కోసం ఆశ్రయించేవారు. తన పలుకుబడి ఉపయోగించి, వాళ్లను ఉద్యోగాల్లో పెట్టించేవాడు. కనీసం యాభైమందికి పైగా యువతీ యువకులకు ఆ కంపెనీలో ఉద్యోగావకాశం కల్పించాడు. వయసులో పెద్దవాడైనా, వాళ్లతో ఫ్రెండులా కలిసిపోయేవాడు. పెళ్ళికాని అమ్మాయిలు హాస్టళ్లలో ఉండేవారు. అక్కడి తిండితో మొహం మొత్తిన కొందరు తనతోపాటు ఇంటికి వచ్చేవారు. భార్య కూడా విసుక్కోకుండా వంటలు చేసి పెట్టేది.

పెద్దకూతురు కవితకూ, చిన్నకూతురు కావ్యకూ మధ్య పదేళ్ల తేడా ఉంది. తన వెంట వచ్చిన వాళ్లందరికీ కవిత నేస్తమై పోయింది. కావ్య చిన్నపిల్ల కావడంతో ఆటలే లోకంగా ఉండేది.

ఓసారి అకౌంటెంటుగా పనిచేసే శ్రీవిద్య తన దగ్గరకొచ్చి, ప్రాజెక్ట్ డిపార్టుమెంటులో పని చేసే కుమార్‌ని ప్రేమించానని చెప్పింది. కులం వేరన్న కారణంగా తల్లిదండ్రులు పెళ్లికి ఒప్పుకోవడం లేదని చెప్పింది. అప్పుడు తను అభయమిచ్చాడు. ఇరువైపులా మాట్లాడి, నచ్చచెప్పి చివరికి పెళ్ళి చేశాడు. ఆ తర్వాత కనీసం పది జంటలను అలాగే కలిపి ఉంటాడు.

తల్లిదండ్రులు ఒప్పుకోని పక్షంలో దగ్గరుండి రిజిస్టర్ మ్యారేజ్ జరిపించేవాడు. అయితే అబ్బాయి, అమ్మాయిల గుణగుణాలను ఒకటికి నాలుగు సార్లు చెక్ చేసుకునేవాడు.

పెళ్ళికిముందు ఓసారి శ్రీవిద్యను హాస్టల్‌కు దూరంగా ఉంచాల్సి వచ్చింది. తన ఇంటికి తీసుకొచ్చాడు. భార్య కూడా సమాదరించింది. వారం రోజుల పాటు కూతురులా చూసుకుంది.

కానీ, తన పెద్దకూతురు కవిత కూడా ఓ అబ్బాయిని ప్రేమిస్తోందని తెలిసినప్పుడు మాత్రం అగ్గిబరాటా అయింది. ఎన్ని విధాలుగా నచ్చచెప్పినా ఒప్పుకోలేదు.

కవిత అన్ని విషయాలూ తనకు చెప్పేది. ఆ అబ్బాయి చాలా మంచివాడనీ, తాను అతన్ని మనస్ఫూర్తిగా ఇష్టపడుతున్నాననీ చెప్పింది. ఓరోజు తను ఆ అబ్బాయితో మాట్లాడి, ఆ విషయాన్ని ధ్రువీకరించుకున్నాడు.

ఇక గత్యంతరం లేని పరిస్థితుల్లో కవితను పిలిచి "హిమాయత్‌నగర్‌లో ఫ్లాట్ మాట్లాడాను. రిజిస్టర్ మ్యారేజ్ చేసుకుని, ఆ ఫ్లాట్‌కు వెళ్లిపోండి. కొన్నాళ్ళు దూరంగా ఉండు, అమ్మను ఒప్పిస్తా. అప్పుడు ఇంటికి వద్దురుగాని" అని తనే చెప్పాడు.

రెండు రోజులు గడవకముందే భార్యకు విషయం తెలిసింది. ఆ తంతు వెనుక తన హస్తముందన్న

## నవ్యవీక్లి-నాటా సంయుక్త నిర్వహణలో బహుమతి పొందిన కవిత




### నిరంతరం... అనంతం

నువ్వు 'డిజిటైజ్' చేయబడ్తున్నావు
కదుల్తూ ఉంటావు... రోడ్డుపై... క్యాబ్‌లో.. చౌరస్తాలో
ఏర్‌పోర్ట్ రెస్ట్‌రూం గదుల్లో... బెడ్‌రూంలో... నగ్నకేళీ విలాసాల్లో
...నువ్వు 'స్కాన్' చేయబడ్తూ... అదృశ్య, అజ్ఞాత నేత్రాలతో 'డిజిటైజ్' చేయబడ్తున్నావు
స్కాన్ చేయబడ్తున్నప్పుడు
బట్టలూ, తొడుగులూ, ఆభరణాలూ, నీ లోలోపలి బురదనంతా తొలగించి
నువ్వు నగ్నంగా నిలబడాలి... పూర్తిగా లొంగిపోయి
పెదవులపై చిరునవ్వు... లోపల పొగమంచువంటి భయంతో
'సెన్సర్ల' నిఘాలో
ఉనికినీ, అస్తిత్వాన్నీ కోల్పోతున్నప్పుడు
రాలుతున్న ఎండుటాకువంటి భావన
పౌర జీవితంలో... వరదలూ, భూనభో కంపాలూ వస్తున్నప్పుడు
తెలిసిన పదాలే పునర్నిర్వచించబడ్తూంటాయి
దేశం... దేశప్రేమ... దేశభక్తి... దేశద్రోహి
భార్య... భర్త... ప్రేయసి... రహస్యప్రియురాలు... అన్ని పదాల అర్థాలూ
పునః పునః మళ్ళీమళ్ళీ మారుతూ
మనుషుల మధ్య 'అనుమానాలు'
చితికిపోతున్న సముద్ర కెరటాల్లా... ధ్వంసిస్తూంటాయి
'వాట్సప్'లో నువ్వు నిన్నరాత్రి రెండు వరకు ఎందుకు... ఎవరితో
'చాట్' చేస్తున్నావో... అని రెండు కళ్ళు
ఒక శరీరం... లోపల భగభగ అంతర్దహిస్తూ... ఒక హృదయం
యంత్రాలతో కాదు... ఒక ఆత్మతో 'డిజిటైజ్' చేయబడ్తూ
అన్నీ పగిలిన అద్దాలు... రాలిపోయిన నీడల శిథిలావశేషాలు
అక్కడక్కడ ఎండిపోయిన రక్తపు మరకలు
చెదిరిపోతున్న చరణ ముద్రలు... ఎన్నని వెదుకుతావు




తిరిగి తిరిగి పోగొట్టుకున్న నీ 'అస్తిత్వాన్ని' పొందటానికి
ఆకాశంలో... వ్రేలాడ్తున్న పాలిపోయిన చంద్రుని ప్రక్కనే
ఒక నీ 'శవదేహం'... అంతరిక్షంలో
పార్థివ శరీరుడా... కళ్ళు తెరువు
నీ 'పుటేజ్' ఎక్కడో... ఎవరితోనో నిరంతరం చూడబడ్తూనే ఉంది
ముద్రలు ముద్రలుగా
'డిజిటైజ్' చేయబడ్తున్నప్పుడు కరుణ, ప్రేమలుండవు
ఒట్టి కళ్ళుంటాయి... కన్నీళ్ళుండవు

**-రామా చంద్రమౌళి**
**సెల్:93901 09993**

సంగతీ తెలిసింది. ఆగ్రహంతో ఊగిపోయింది. శాపనార్థాలు పెట్టింది. తిండి మానేసింది. నాలుగు రోజులు పట్టింది ఆమెతో మాట్లాడటానికి.

నెలలు గడిచాయి. ఆమె కోపం తగ్గింది. తనతో మామూలుగానే ఉంటోంది. అడపాదడపా ఆఫీసు నుంచి అమ్మాయిలు తనతోపాటు ఇంటి కొస్తూనే ఉన్నారు. ఆమె వారిని మామూలుగా ఆదరిస్తూనే ఉంది.

ఓరోజు తను ఆఫీసు నుంచి ఇంటికొచ్చి కాలింగ్ బెల్లు కొట్టాడు. ఆమె తలుపులు తీసింది.

తన పక్కనున్న అమ్మాయిని క్యాజువల్‌గా చూసి, "రామ్మా శ్రీవిద్యా" అంటూ ఆహ్వానించింది.

తను, ఆ అమ్మాయి సోఫాలో కూర్చున్నారు.

"ఏమ్మా, బాగా లావైనట్టున్నావు. ఏమైనా విశేషమా?" అడిగింది భార్య.

ఆ అమ్మాయి నవ్వి ఊరుకుంది.

"మాట్లాడుతూ ఉండండి. కాఫీ తీసుకొస్తా" అంటూ ఆమె కిచెన్‌లోకి వెళ్లింది.

అయిదు నిమిషాల తర్వాత కాఫీ కప్పులతో బయటికొస్తే, ఇద్దరూ కనిపించలేదు.

బెడ్‌రూములోంచి మాటలు వినిపిస్తుండడంతో అక్కడికొచ్చింది.

ఆ అమ్మాయి బెడ్‌మీద ఎక్కి కూర్చుని పకపకా నవ్వుతుంటే, ఆమెకు ఏదో అనుమానమొచ్చింది.

దగ్గరగా వచ్చి, పరిశీలనగా చూసి "క...వి....తా" అంటూ పెద్దగా అరిచింది గుర్తుపట్టగానే.

కవిత ఆగలేకపోయింది. ఒక్కగంతులో కిందికి దూకి, అమ్మను వాటేసుకుంది.

"మోసం... మోసం చేస్తారే అయ్యా కూతుళ్లు.." అంటూ వీపుమీద కొడుతూ, కూతుర్ని తనూ కౌగిలించుకుని, ఏడవటం మొదలుపెట్టింది.

అంతకాలం తన కూతురున్న హిమాయత్ నగర్ ఫ్లాటు మాధవయ్యదే.

ఇప్పుడు తల్లి అభిమతానికి అనుగుణంగా చిన్నకూతురు పెళ్లి చేసుకుంటోంది. ఆ సంబరాన్ని ఆస్వాదించాలని భారతి ఉవ్విళ్లూరుతోంది. అలాంటి సమయంలో తాను అందుబాటులో లేకపోతే ఆమెకు కోపం రాదా!

టీ తాగి, ఆస్పత్రిలోని ఐసీయూ వింగ్‌కి వచ్చాడు జేకేఆర్. అతన్ని లోపలికి అనుమతించారు.

మాధవయ్య బెడ్‌మీద పడుకొని ఉన్నాడు. ఫ్లూయిడ్స్ ఎక్కుతున్నాయి. నర్సు ఇంజక్షన్లు చేస్తోంది.

ప్రాణముందో లేదో తెలియని స్థితిలో పడి ఉన్న మాధవయ్యను చూస్తే, జేకేఆర్‌కు గుండె తరుక్కుపోయింది.

బయటికొచ్చి, మరోసారి మాధవయ్య కొడుక్కి ఫోను చేశాడు. ఫలితం లేదు. ఇంకోసారి ఎస్సెమ్మెస్ పంపాడు.

పొద్దుగూకింది. ఏడు దాటింది. తాను ఉద్యోగంలో పెట్టించిన ఇద్దరు కుర్రాళ్లకు ఫోన్ చేసి, విషయం చెప్పి కాస్త ఏర్పాట్లు చూడమని అభ్యర్థించాడు. వాళ్లు ఆఫీసు నుంచి జేకేఆర్ ఇంటికి చేరుకుని, భారతికి సహకరించడం మొదలుపెట్టారు.

రాత్రి తొమ్మిదిన్నరకు మాధవయ్య కొడుకు ఫోన్ చేశాడు. "సారీ అంకుల్, నేను మా ఫ్రెండ్స్‌తో కలిసి కర్ణాటకలో ఓ మారుమూల ప్రాంతానికి వెళ్లాను. ఇప్పుడే సిగ్నల్ వచ్చింది. ఏమిటి, వెంటనే ఫోన్ చెయ్యమన్నారు?"

జరిగిందంతా చెప్పాడు జేకేఆర్.

"అరె, అలానా! నేను ఫ్లైట్ దొరికితే ఈ రాత్రికే వస్తాను. లేదంటే రేపు ఫస్ట్ ఫ్లైట్‌కి వచ్చేస్తాను. అప్పటిదాకా కాస్త చూసుకోండి. ప్లీజ్" అభ్యర్థించాడతను.




రాత్రి పదిన్నర. మధ్యలో భార్య రెండుసార్లు ఫోన్ చేసింది. ఏం చెప్పాలో అర్థం గాక, కట్ చేశాడు. పదకొండు గంటలవేళ మళ్లీ ఆమె నుంచి ఫోను. ఈసారి ఎత్తాడు.

"ఏమండీ, అసలేమైనా అర్థముందా మీ పనికి? మీ శిష్యులొచ్చారు. పూజాసామగ్రి తెచ్చారు. పనులు సరే, మీరు లేకపోతే ఎంత నామోషీగా ఉంది! కావ్య చాలా బాధ పడుతోంది. ఓసారి మాట్లాడండి" అంటూ ఫోన్ కూతురుకిచ్చింది.

"డాడీ, మీరు లేకపోతే ఏమీ బాలేదు. హలో.. హలో... సిగ్నల్ అందడం లేదు. బయటికొస్తున్నా, ఒక్క నిమిషం లైన్లో ఉండండి" అంటూ తల్లికి దూరంగా వెళ్లి "నాన్నా, మీరెలాంటి పరిస్థితుల్లో అక్కడి ఉండిపోయారో నేనర్థం చేసుకోగలను. అమ్మ అలాగే అంటుంది. పట్టించుకోకండి. రేపు ఎంగేజ్‌మెంట్ సమయానికి వచ్చేందుకు మాత్రం ట్రై చేయండి" అంది.

జేకేఆర్ కళ్లు తడిదేరాయి. "థాంక్యూ చిన్ని తల్లీ. నువ్వయినా అర్థం చేసుకున్నావు".

రాత్రి పదకొండు గంటలకు మాధవయ్య కొడుకు ఫోన్‌చేసి, అతికష్టం మీద మరుసటి రోజు ఎనిమిది గంటల ఫ్లైటుకు టికెట్ దొరికిందని చెప్పాడు.

రాత్రి పన్నెండు గంటల సమయంలో ఓసారి ఐసీయూలోకి వెళ్లి మాధవయ్యను చూశాడు. ఏమీ తేడా కనిపించలేదు. రాత్రంతా రిసెప్షన్‌లో ఓ కుర్చీలోనే ఉండుండీ కునికిపాట్లు పడ్డాడు.

•••

ఉదయం ఆరున్నరకు మెలకువ వచ్చింది జేకేఆర్‌కు. వాష్‌రూముకెళ్లి, చల్లటినీటితో మొహం కడుక్కుని, టీ తాగాడు. ఐసీయూకి వెళ్లి మళ్లీ మాధవయ్యను చూశాడు. ఏ మార్పూ లేదు. మనిషిలో కదలికే లేదు.

ఉదయం తొమ్మిది గంటలకు భార్య ఫోన్‌చేసి, చెడామడా తిట్టింది. కోపంగా ఫోన్ పెట్టేసింది.

"మరో గంటలో ఆయన కొడుకు వచ్చేస్తాడు. నేను వెళ్లొచ్చా" ఆశగా అడిగాడు జూనియర్ డాక్టర్ని జేకేఆర్.

"నో సర్. ఆయన స్టేటస్‌ను ప్రతి పది నిమిషాలకోసారి రివ్యూ చేస్తున్నాం. అటెండెంట్ ఉండాల్సిందే".

పది గంటలు దాటింది. శంషాబాద్ ఎయిర్‌పోర్టు నుంచి బయల్దేరానని మాధవయ్య కొడుకు ఫోన్ చేశాడు.

'ఎంగేజ్‌మెంట్ మొదలై ఉంటుంది. పూజ జరుగుతుండొచ్చు...' అనుకున్నాడు జేకేఆర్.

ఆయనలో మథనం మొదలైంది. తప్పు చేస్తున్నానన్న భావన తొలిచేస్తోంది.

పదిన్నరకు మాధవయ్య కొడుకు వచ్చాడు. ఇద్దరూ డాక్టర్ని కలిశారు. తాజా పరిస్థితిని తెలుసుకున్నారు.

అప్పుడు చెప్పాడు జేకేఆర్ తన కూతురి ఎంగేజ్‌మెంట్ గురించి.

"అయ్యో, సారీ అంకుల్. ప్లీజ్, మీరు వెంటనే బయల్దేరండి" తొందర చేశాడా కుర్రాడు.

కారు స్టార్ట్ చేశాడు జేకేఆర్. పెద్దగా ట్రాఫిక్ లేని రోడ్డుమీద కారును రేసుగుర్రంలా పరుగు తీయించాడు.

డ్రైవ్ చేస్తున్నాడన్న మాటేగానీ, జేకేఆర్ కళ్ల ముందు మాధవయ్య రూపమే మెదులుతోంది.

కల్యాణమంటపం సమీపిస్తున్న కొద్దీ భార్యాపిల్లలు గుర్తొచ్చారు. మనసులో సన్నగా వణుకు మొదలైంది.

అపరాధ భావనేదో అతన్ని తవ్వి పోస్తోంది.

కారు పార్క్ చేస్తుండగా ఫోన్ మోగింది. మాధవయ్య కొడుకు.

"అంకుల్, ఇప్పుడే నాన్నతో మాట్లాడాను. ఆయన బాగా కోలుకున్నాడు. ఇక ప్రాణానికేమీ ప్రమాదం లేదని చెప్పాడు డాక్టర్".

"అవునా! థాంక్‌గాడ్" కళ్లజోడు తీసి, కళ్లు తుడుచుకున్నాడు జేకేఆర్.

ఇప్పుడతని మనసు పూలవనంలా మారింది. వణుకు తగ్గింది. కళ్లల్లో వెలుగు. అపరాధ భావన అదృశ్యం.

అనిర్వచనీయమైన సంతృప్తితో, ధైర్యంగా, ధీమాగా కల్యాణమంటపంలోకి అడుగు పెట్టాడు.

**సెల్:98667 77870**

ప్రైమ్ హాస్పిటల్స్
హైదరాబాద్





డా॥ జి. సతీష్ రెడ్డి
MS. M.Ch. (Ortho) (UK)
Orthopedics & Joint Replacement Specialist
ప్రైమ్ హాస్పిటల్స్, హైదరాబాద్
ఫోన్. 84999 91829 / 040-4959 4959


# మోకాళ్ళ మార్పిడిలో సరికొత్త విధానాలు ఆధునిక ఇంప్లాంట్స్‌తో మెరుగైన ఫలితాలు

మన శరీర భారాన్ని మోసేవి మోకాళ్ళు, మన కదలికలకు ఆధారమే మోకాళ్ళు కాబట్టి సహజంగా వీటి మీద ఒత్తిడి ఎక్కువగా ఉంటుంది. మోకాలి భాగంలో ఉండే రెండు ఎముకలు సులువుగా అటూ ఇటూ కదలడానికి కార్టిలేజ్ దోహదపడుతుంది. ఇది అరిగిపోయినప్పుడు రెండు ఎముకలు ఒరుసుకుపోయి, నొప్పి మొదలవుతుంది. వయస్సు పైబడుతున్న వారిలో ఈ సమస్య ఎక్కువగా కనిపిస్తుంటుంది. మోకాళ్ళ నొప్పులు ముదిరితే సొంత పనులు చేసుకోలేని పరిస్థితి తలెత్తుతుంది. మోకాళ్ళ భాగంలో కార్టిలేజ్ పూర్తిగా దెబ్బతిన్న వారికి మోకాలి మార్పిడి శస్త్రచికిత్స ఒక వరం లాంటిదని చెప్పవచ్చు. సర్జరీ అనంతరం సాధారణ జీవితం గడపగలుగుతారు.

## సర్జరీలలో పెరుగుతున్న సాంకేతికత :

ఒక వయస్సు దాటాక మోకాలు కీలు అరిగిపోతే మోకాలు మార్పిడి చేయించుకునేవారి సంఖ్య క్రమంగా పెరుగుతోంది ప్రస్తుతం మోకాలు కీలు మార్పిడి శస్త్రచికిత్సల్లో అత్యాధునిక విధానాలు అందుబాటులోకి వచ్చాయి. ప్రపంచంలో మొట్టమొదటి మోకాలి మార్పిడి శస్త్రచికిత్స 1968లో అమెరికాలో నిర్వహించారు. అప్పటినుంచి మోకాలు మార్పిడి శస్త్రచికిత్సలో ఎన్నో మార్పులు చోటు చేసుకుంటున్నాయి. ఎప్పటికప్పుడు పాత పద్ధతులకు స్వస్తి పలుకుతూ ఆధునిక విధానాలు అందుబాటులోకి వస్తున్నాయి. ప్రస్తుతం ఎక్కువ కాలం మన్నగలిగే సురక్షితమైన కృత్రిమ మోకాళ్ళు అందుబాటులోకి వచ్చాయి. నూతన పద్ధతులలో ఆపరేషన్ నిర్వహించడం ద్వారా సర్జరీ జరిగిన రోజే రోగిని నడిపించగలుగుతున్నారు. ఎక్కువ రోజులు విశ్రాంతి అవసరం లేకుండా ఆపరేషన్ జరిగిన కొద్ది రోజులకే సాధారణ జీవితం గడపగలుగుతారు.

## అందుబాటులోకి అత్యాధునిక ఇంప్లాంట్స్ :

మోకాలి మార్పిడిలో ఉపయోగించే కృత్రిమ మోకాళ్ళలో రోజురోజుకు నూతన ఇంప్లాంట్స్ అందుబాటులోకి వస్తున్నాయి. మొదట్లో కోబాల్ట్-క్రోమియం మెటల్, ప్లాస్టిక్ కాంబినేషన్‌లో ఉండేవి. తర్వాత హైలీ క్రాస్ లింక్డ్ పాలీ ఇథిలిన్ కృత్రిమ మోకాళ్ళు అందుబాటులోకి వచ్చాయి. మోకాలు మార్పిడి ఆపరేషన్ తర్వాత కొంతమందిలో లోహ సంబంధమైన అలర్జీలు, ఇన్‌ఫెక్షన్‌లు వచ్చే అవకాశం ఉంటుంది. అయితే ఈ అలర్జీలు రాకుండా నివారించే ఆధునాతనమైన కృత్రిమ సిరామిక్ మోకాళ్ళు(ఆక్సీనియం) అందుబాటులోకి వచ్చాయి. దాంతో పాటు మోకాలు కదలికలు సులువుగా అటూ ఇటూ తిరగగలిగే హై ఫ్లెక్స్ నీ, బై క్రూషియేట్ రిటేయినింగ్ నీ వంటి అత్యాదునిక విధానాలు అందుబాటులో వచ్చాయి. ప్రస్తుతం 30 సంవత్సరాల పాటు పనిచేసే కృత్రిమ కీళ్ళు అందుబాటులో ఉన్నాయి. రోగి ఆరోగ్య పరిస్థితిని పరిశీలించి ఏ రకమైన ఇంప్లాంట్ అవసరమో వైద్యులు నిర్ధారిస్తారు.

## డిజైన్స్‌లో ఆధునికత :











మోకాళ్ళ మార్పిడిలో ఉపయోగించే కృత్రిమ మోకాళ్ళలో కొత్త కొత్త డిజైన్లు అందుబాటులోకి వచ్చాయి. వీటిలో స్త్రీల కోసం, పురుషుల కోసం ప్రత్యేకంగా తయారు చేసిన జెండర్ స్పెసిఫిక్ డిజైన్లు ఉన్నాయి. ఒక్కో రోగికి ప్రత్యేకంగా డిజైన్ చేసి అమర్చగలిగే కృత్రిమ మోకాళ్ళు కూడా ఇప్పుడు అందుబాటులోకి వచ్చాయి. వీటిని పేషెంట్ స్పెసిఫిక్ నీ అంటారు. ఇందులో మోకాలికి సీటీ స్కాన్ లేదా ఎంఆర్ఐ తీసి, మోకాలు ఏ మేరకు, ఏ విధంగా అరిగిపోయిందో చూస్తారు. ఆ కొలతలకు అనుగుణంగా కృత్రిమ మోకాలును రూపొందించి అమర్చుతారు. ఈ విధానంలో కీలు పరిమాణం, ఎంత కోణంలో కోత పెట్టాలి..? ఏ స్థానంలో పెట్టాలి..? తదితర అంశాలతో కచ్చితమైన కొలతలతో ఆపరేషన్ నిర్వహించగలుగుతారు. దాంతో మెరుగైన ఫలితాలను సాధించడం వీలవుతుంది.

## మీ కీళ్ళను కాపాడుకోండి :

ప్రతి రోజూ క్రమం తప్పకుండా వ్యాయామం చేస్తే ఆర్థరైటిస్ వచ్చే అవకాశాలు తక్కువగా ఉంటాయి. మోకాలు సమస్యలకు నడక, ఈత ఎంతో ఉపకరిస్తాయి. తరచుగా మెట్లు ఎక్కి, దిగడం వల్ల కూడా కీళ్ళపై ఒత్తిడి పెరిగే అవకాశం ఉంటుంది. అందుకే కీళ్ళనొప్పులున్నవాళ్ళు మెట్లు వాడకపోవడమే మంచిది. నడక, వ్యాయామానికి దూరంగా ఉండేవారిలో, మోకాళ్ళకు దెబ్బలు తలిగిన వారిలో మోకాళ్ల నొప్పులు ఎక్కువగా వచ్చే అవకాశం ఉంటుంది. కుటుంబంలోగానీ, వంశంలోగానీ మోకాళ్ళ నొప్పుల సమస్య ఉన్నవారు మరింత జాగ్రత్తగా ఉండాలి. ఎందుకంటే జన్యుపరమైన కారణాల వల్ల ఈ సమస్య తలెత్తే అవకాశం ఉంటుంది. నడక వల్ల మోకాళ్ళు అరిగిపోతాయనేది కేవలం అపోహ మాత్రమే. ప్రతిరోజూ వ్యాయామం చేయడం లేదా నడవడం ఎముకల పటుత్వానికి మరియు ఎముకల ధృడత్వానికి దోహపడుతుంది.

# వెట్టి (ది వారియర్)

-మధుబాబు




గుండెలు పట్టేసినంత పనైంది ఆ మనిషికి. ఊపిరి ఆగిపోయిన అనుభూతి కలిగింది.

తెల్లగా ఉన్నది ఆమె పల్వరుస. ఎంత తెల్లగా అంటే అప్పుడే పితికిన ఆవుపాల మీది నురగమాదిరి తళతళలాడిపోతోంది.

'మాట్లాడవేంటి? నోరు పడిపోయిందా?' ఉన్నట్లుండి మళ్ళీ సీరియస్‌గా చూస్తూ అడిగింది ఆమె.

### జరిగిన కథ

**బో**ల్తాపడిన బస్సులో చిక్కుకున్న నలభై మంది ఆ ఊరి ప్రయాణీకుల్ని ప్రాణాలకు తెగించి కాపాడతాడు మొనగాడులాంటి ఓ యువకుడు. అతడేదో ఆపదలో ఉన్నాడని ఇట్టే పసిగట్టేస్తారు ఆ ఊరి బడ్డీకొట్టు యజమాని చెన్నకేశవులు, గ్రామ వైద్యుడు ఆచార్యులు. యువకుడి ఆరోగ్యం బాగయ్యేదాకా అతడికి ఆశ్రయమిచ్చి ఆనక ఊరు దాటించి పంపేయాలని నిర్ణయించుకుంటారు.

ఆ తర్వాత......

'మాట్లాడాను కదా... నువ్వు ఎవరివి అని అడిగాను కదా?' అతి ప్రయత్నం మీద గొంతు పెగల్చుకుంటూ అడిగాడు.

ఆమె తలను కొంచెంగా ముందుకువంచి, కనుబొమల్ని చిత్రవిచిత్రంగా కదిలిస్తూ, సూటిగా చూసింది అతని ముఖంలోకి.

కంపించటం మొదలుపెట్టాయి ఆ మనిషి కాళ్ళు, చేతులు. గొంతు ఎండుకు పోతున్నట్లుగా కూడా అనిపించడం మొదలయింది.

పుట్టలోనుంచి బయటికి వచ్చేటప్పుడు, తమను గమనించి గొడవ చేయటానికి ప్రయత్నించే వాళ్ళవైపు అలాగే చూస్తాయి పాములు. పడగని కొంచెంగా ముందుకు వంచి నాలుకల్ని అతి వేగంగా కదిలిస్తూ-

'నాగమ్మవా తల్లీ నువ్వు? నాగమ్మవేనా?' జీర పడిన కంఠంతో అస్పష్టంగా అడిగాడు.

విసురుగా తలెత్తి, ముఖంమీదికి పడిపోబోతున్న కేశాల్ని వెనక్కి విదిలించుకున్నది ఆమె. 'నాగమ్మయితే ఏంటి? కాకపోతే ఏంటి? ఇప్పుడు నువ్వు చేస్తున్నదేంటి?' గంభీరంగా అడిగింది.

రెండు చేతుల్నీ పైకెత్తి నమస్కారం చేయాలన్న కోరికను అతి బలవంతంగా అదుముకున్నాడు ఆ మనిషి.

'వెంటపడుతున్నారు తల్లీ! ఏదో ఒక విధంగా నన్ను పట్టుకుని మళ్ళీ వెనక్కి తీసుకుపోవాలన్న పట్టుదలతో వేటకుక్కల మాదిరి తరుముకుంటూ వస్తున్నారు. ఈసారి నన్ను ప్రాణాలతో ఉంచరు. చంపేసి ఏదో ఒక గోతిలో కప్పెట్టేస్తారు' తడబడుతున్న కంఠంతో తన వ్యధను ఎరుకపరిచాడు.

'ఏడిశారు... ఎవరురా వాళ్ళు? ఏమని అనుకుంటున్నారో తమని గురించి? నేను ఒకదాన్ని ఇక్కడ ఉన్నానని తెలియదా? చూస్తూ ఊరుకుంటుందని నువ్వుకూడా భ్రమ పడుతున్నావా?' పెద్దపెద్ద కళ్ళని ఇంకా పెద్దవి చేసి గిరగిరా తిప్పుతూ అడిగింది ఆమె.

అంత అయోమయ పరిస్థితిలో కూడా చిన్నగా నవ్వకుండా ఉండలేకపోయాడు ఆ మనిషి.

'జీపు డ్రైవర్‌తో కలుపుకుంటే మొత్తం అయిదుగురు ఉన్నారు తల్లీ వాళ్ళు. నాగపూర్ నుంచి తెప్పించిన నాటు రివాల్వర్లు, పేష్కప్పులు ఉన్నాయి. నన్ను మాత్రమే కాదు. నాతో పాటు ఇంకో పదిమందిని చంపిపారేసినా వాళ్ళని ఎవరూ ఏమీ చేయలేరు. పెద్దపెద్ద పదవుల్లో ఉన్నవాళ్ళ అండదండలు పుష్కలంగా ఉన్నాయి వాళ్ళకి. నువ్వు ఇంకో వంద కోడెనాగుల్ని వెంటబెట్టుకు వచ్చినా వాళ్ళు నిలబడిన ప్రదేశంలోకి కూడా పోలేవు. నా తిప్పలు ఏవో నేను పడతాను గాని, నన్ను వదిలేయ్' అన్నాడు.

ఉన్నట్లుండి ఎర్రబడిపోయింది ఆ అమ్మి ముఖం. ఆగ్రహం అవధులు దాటి పోయినట్లు వెర్రిగా ఒక కేక పెట్టింది. వేగంగా ముందుకు దూకి చిరిగిపోయి ఉన్న అతని షర్టు కాలర్‌ని గట్టిగా పట్టుకుంది.

'ఆగు తల్లీ... ఆగిపో... ఆగిపోవమ్మా.. అతన్ని వది



లేయ్' అంటూ వినవచ్చింది ఒక కంఠం.

కాలర్‌ని పట్టుకున్న ఆమె చేతులు, అంతటితో ఆగకుండా తన మెడచుట్టూ బిగుసుకుంటాయేమో నన్న అనుమానంతో తనచేతుల్ని ముందుకు జాచి ఆమెను అవతలికి నెట్టే ప్రయత్నం మొదలుపెట్టబోతున్న ఆ మనిషి - చటుక్కున తల తిప్పి ఆ కంఠం విన వచ్చిన వైపు చూశాడు.

నాగమ్మతల్లి గుడి దగ్గరికి పోయి వస్తానని చెప్పిన వైద్యుడు రమణాచార్లు కనిపించాడు. ఆయన వెనుకే పరిగెత్తుకుంటూ వస్తున్నాడు చిల్లరకొట్టు చెన్నకేశ వులు.

'కంచుచెంబెడు పాలు గుటుకుగుటుకుమని తాగి నవ్ కదా.. చాపమీద పడుకుని హాయిగా నిద్రపోకుండా వీధిలోకి ఎందుకు వచ్చినవ్?' దగ్గరికి వస్తూనే చిరు కోపంతో మెత్తగా మందలించాడు అతను.

కోడెనాగు మాదిరి రాబోతున్నది అమ్మి. రెండో వైపు నుంచి ఆమె భుజాల్ని గట్టిగా పట్టుకుని అతి బలవంతంగా అవతలికి లాగాడు రమణాచార్లు.

'వాడిని వదిలిపెట్టను. నాకు ఏమీచేతకాదని వెక్కిరించాడు. ప్రాణాలు తీసి పారేస్తాను' ఆయన చేతుల్ని వదిలించుకోవటానికి ప్రయత్నం చేస్తూ కీచుగా అరిచింది ఆ అమ్మి.

'అమాయకుడు తల్లీ.. నీ గురించి మా గురించి ఏమీ తెలియనివాడు... నువ్వు కోపం చేయకూడదు.' అనునయంగా అంటూ ఇంకా కొంచెం అవతలికి తీసుకుపోవటానికి ప్రయత్నించాడు రమణాచార్లు.

'నువ్వు చెప్పావు కాబట్టి కోపాన్ని వదిలేస్తాను. వచ్చి నాకు వందనం చేయమని చెప్పు' కోపం పోయినట్టు శాంతంగా నిలబడుతూ చెప్పింది ఆ అమ్మి.

'చెయ్యవయ్యా సామి... వందనమంట చేసేయ్... చేయక పోతివంటే ఇయ్యాల నీతో పాటు మాకు కూడా రాత్రంతా రాములోరి భజనే' గబగబా ఆ మనిషికి చెప్పాడు చెన్నకేశవులు.

వందనం చేయటమేమిటో, చేయకపోతే రాము లోరి భజన అంటే ఏమిటో కొంచెంగా కూడా అర్థం కాలేదు కదలకుండా నిలబడి ఉన్న ఆ మనిషికి.

'అది కాదు. అసలు జరిగింది ఏమిటంటే-' అంటూ తన పరిస్థితిని వారికి విశద పరచబోయాడు.

పరమప్రశాంతంగా కనిపించే చెన్నకేశవులు ముఖం కూడా ఒక్కసారిగా ఎర్రబడిపోయింది. 'వందనం చేయవయ్యా మగడా! ముందు వందనం చేసి తర్వాత మాట్లాడు' గఁయ్‌మని అరిచాడు.

ఒక అడుగు ముందుకు వేసి చేతులు జోడిం చాడు ఆ మనిషి. 'వందనాలు తల్లీ..' అన్నాడు ఆ అమ్మితో.

కిలకిలా నవ్వింది ఆ అమ్మి.

తెల్లటి పల్వరుస కనులకు ఇంపుగా బయటికి కని పించేట్లు పెద్దగా నవ్వింది. నడుము దాటి ఇంకా కిందికి వేలాడుతున్న తలకట్టు చెదిరి భుజాలమీదికి పరచుకునేటంతగా పడీపడీ నవ్వింది.

'భయపడ్డాడు. నాగమ్మతల్లి నిజంగానే నా ఒంటి మీదికి వచ్చేసినట్లు కంగారుపడిపోయాడు..' అని రమణాచార్లుగారితో అన్నది.

'భయపడిపోయావు కదూ?' ఆ మనిషి వైపు తిరిగి మృదుమధురంగా అడిగింది.

నోరు తెరిస్తే మాట బయటికి వస్తుందో రాదో తెలియకుండాపోయింది కాబోలు - మూగగా తల ఊపాడు ఆ మనిషి.

'తీసుకుపోండి ఆచార్లుగారూ, తొందరగా ఇంటికి తీసుకుపోండి. వట్టి మొండివాడు కాబట్టి నిబ్బరంగా నిలబడ్డాడు ఈ అబ్బడు. ఇదే మనఊరి పిల్లకాయలు ఎవరైనా అయ్యుంటే ఈపాటికి నానాగోలా చేస్తూ ఉండేవాళ్ళు'. ఆ మనిషి చేతిని పట్టుకుని వెనక్కి లాగుతూ ఆచార్లుగారికి చెప్పాడు చెన్నకేశవులు.

'రామ్మా.. రా తల్లీ.. మనం మనఇంటికి వెళ్ళి పోదాం. మంచుకురిసే టైము. నీ తలకట్టు తడిసిందంటే జలుబు చేస్తుంది. లేనిపోని బాధలన్నీ వచ్చి నెత్తికి చుట్టుకుంటాయి' అంటూ ఆ అమ్మిని తన ఇంటి వైపు తీసుకుపోయాడు ఆచార్లుగారు.

నోరు తెరుచుకుని చూస్తున్న మనిషిని, తను కూడా తీసుకుపోయాడు చెన్నకేశవులు. అతను పడుకునే పాకవైపు కాదు. అవతలి వీధిలో ఉన్న గందరగోళం వైపు.

•••

రంగురంగుల బల్బులతో చిత్రవిచిత్రంగా అలంక రించబడి ఉన్నది నాగమ్మ గుడి. మట్టిప్రమిదల నిండా నూనెపోసి, రెండ్రెండు వత్తులు వేసి గుడిచుట్టూ దీపాలు పెట్టారు ఆడంగులు.

గుడికి అటూఇటూ ఉన్న చెట్లకొమ్మల మీదా, కిందిభాగంలో ఉన్న చెదపుట్టల దగ్గర చిందులు తొక్కుతూ ఆటలు ఆడుకుంటున్నారు పిల్లలు.

పద్దెనిమిది మూరల ఎత్తున్నది ధ్వజస్తంభం. పెద్దపెద్ద చెక్కబల్లలు వేసి వాటి మీద సుఖంగా కూర్చుని ఉన్నారు గ్రామంలోని పెద్దలు చాలామంది.

గొంతులు బొంగురుపోయినా వదిలిపెట్టకుండా భక్తిపాటలు పాడుతున్నారు ఆ ఊరి భజన సమాజ సభ్యులు కొంతమంది.

నాగమ్మ తల్లో.. నాగమ్మ తల్లో..

కరుణించి కాపాడు మముగన్నతల్లో...

చెక్కబల్లలమీద కూర్చుని ఉన్న వాళ్ళలో ఊరి ప్రెసిడెంటు కూడా ఉన్నాడు. నెమ్మదిగా నడుచు కుంటూ వస్తున్న చెన్నకేశవుల్ని చూడగానే, గబు క్కున లేచి అతని దగ్గరికి వచ్చాడు.

'ఇదుగో చెన్నకేశవులూ.. ఈ భజనోళ్ళ గోల చాలా




**ఆమె మాటతీరు నాగదేవతను తలపించింది. ఆమె కళ్ళను చూసి అతడికి భయం పుట్టింది! గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. గుండె చిక్కబట్టుకుని ముందుకు అడుగేయబోయాడు. ఒళ్ళు ఝల్లుమంది. ఎక్కడివాడక్కడే ఆగిపోయాడు. ఎనిమిది అడుగుల సర్పం..! చరచర మని వెళుతున్న శబ్దం! అంతలోనే చంపేస్తానురోయ్... నీ నెత్తురు తాగేస్తాను...అంటూ అరుపులు!! ఎవరివా అరుపులు? అసలు అక్కడేం జరుగుతోంది?**

ఎక్కువ అయిపోయింది. ఈ తాళాలు ఈ మేళాలు ఊళ్ళోకి గాని పెద్దగా ఇనిపిస్తుండయ్యా?' రహ స్యంగా అడిగాడు.

'ఇవాల్టికి ఆ గోల కూడా పూర్తి అయిపోయిం దయ్యా... ఇదుగో.. ఈ అబ్బయ్యని పట్టుకుని చర్ బద్దీ ఆడేయబోతుంటే, ఆచార్లుగారు, నేను వెళ్ళి ఆపేశాం' తాను కూడా రహస్యంగానే సమాధానం ఇచ్చాడు చెన్నకేశవులు.

'ఎప్పుడూ లేనిది ఈ మధ్యన మాకు ఈ తగ లాటం ఒకటి తలకు చుట్టుకుంది...' లాల్చీజేబులో నుంచి అంతకుముందే తయారుచేసుకుని సిద్ధంగా ఉంచుకున్న పొగచుట్టను బయటికి తీస్తూ బరు వుగా అన్నాడు ప్రెసిడెంటు.

శ్రద్ధగా వింటున్నట్లు తల ఊపటమైతే ఊపాడు గాని, ఆ మాటల్ని పట్టించుకోలేదు చెన్నకేశవులు పక్కన ఉన్న మనిషి. భజన సమాజం సభ్యులు పాడుతున్న పదాలనే ఆలకిస్తున్నాడు.

నాగమ్మ తల్లో... నాగమ్మ తల్లో...
కరుణించి కాపాడు మముగన్న తల్లో..
సందె పొద్దు ఛాయలోన చాటంత పడగవిప్పి
శివాలెత్తిపోతూ నువు తీగెలాగ సాగుతుంటె
కళ్ళు అప్పగించినా, గగ్గోలుగా అరిచినా
కోపమొద్దు తాపమొద్దు మా పైపైకి రావద్దు
పీకమెయ్య కల్లు తాగి పెద్దోళ్ళు తూలుకుంటూ
పుట్లవెంటా గట్లవెంటా గిరికీలు కొట్టుకుంటూ
ఇళ్ళు చేరే సమయంలో ఎప్పుడయినా నీ కంట పడితె
బుసలు వద్దు పగలు వద్దు కసితీరా కాటు వద్దు
గొర్రెలు బర్రెలు మా పెయ్యదూడలు
ఆంబోతులు చీంబోతులు కన్నబిడ్డలు
తామరతంపల ద్వారా, తీగెలు మొగ్గవెయ్యాల
వంశాలు నిలవాల, మా చేలన్ని పండాల
కోడిగుడ్లు బాతుగుడ్లు కడవలతో ఆవుపాలు
పులిహోర పెరుగన్నం మా ఆశలతో కలగలిపి
కోరికలే గంగమ్మగ విరబోసి వేడుకుంటం
నీ పేరు తలుచుకుంటం, నీ స్మరణే చేసుకుంటం
నాగమ్మ తల్లో నాగమ్మ తల్లో... కరుణించి కాపాడు మముగన్నతల్లో...

ముగ్ధులైపోయారు శ్రద్ధగా వింటున్న జనం. గుండెలు జలదరించే స్థాయిలో చప్పట్లు కొట్టారు. చెవులు చిల్లులు పడిపోయేటట్టు ఈలలు వేశారు.

'మా ఊరి నాగమ్మతల్లి మహామహిమగల దేవత - కనికరించిందంటే కళ్ళల్లో వత్తులు వేసుకుని కాపాడు తుంది. కోపగించిందంటే పట్టపగలే చుక్కలు చూపించేస్తుంది' తన్మయత్వంగా అన్నాడు చెన్నకేశవులు.

'అదిగో, మానవరూపంలో మళ్ళీ వచ్చేస్తోంది' నవ్వుతూ చెప్పాడు ఆ మనిషి.

అతను చేయిచూపించిన వైపు చూసి అదిరిపడ్డాడు చెన్నకేశవులు. పొడవాటి తలకట్టును భుజాల

మీదికి తీసుకుంటూ, పెద్దపెద్ద అడుగులు వేస్తూ వచ్చేస్తున్నది అంతకుముందే నడివీధిలో నానాగోల చేసిన అమ్మి.

'అయ్యబాబోయ్... నిద్రపోయే మందు పనిచేయటం మానుకుంది కాబోలు.. ఆచార్లుగారి కళ్ళుకప్పి మళ్ళీ బయటికి వచ్చేసింది' అంటూ ఆమెకు ఎదురు పరిగెత్తాడు చెన్నకేశవులు.

'ఆగు తల్లీ.... ఆగిపో... నువ్వు ఇటుకేసి రాకూడదు. ఇక్కడున్నాళ్ళందరూ వట్టి అమాయకులు. నీ అరుపుల్ని తట్టుకోలేరు' అంటూ చేతిని పట్టుకుని వెనక్కి తిప్పబోయాడు.

పెదవులు బిగించి బలంగా కొట్టింది ఆమె అతని చెంపమీద. అలా జరుగుతుందని అనుకోకపోవటం వల్ల, కాలు నిలదొక్కుకోవడం చేతకాక ఒకపక్కకు పడిపోయాడు చెన్నకేశవులు.

'సంబరాలు చేసుకుంటున్నారు. నా పేరుచెప్పి ప్రసాదాలు దిగమింగుతున్నారు. మీ చుట్టుపట్ల జరుగుతున్నదేమిటో తెలుసుకోలేకపోతున్నారు. బుద్ధిహీనులు మీరందరూ..' గొంతు చించుకుని అరుస్తూ గుడిముందున్న మండపం వైపు పరుగులు మొదలుపెట్టింది ఆమె.

'పట్టుకోండిరోయ్.. ఆ అమ్మిని గట్టిగా పట్టుకుని ఆచార్లుగారి దగ్గరికి తీసుకుపోండి' కిందినుంచి లేస్తూ బిగ్గరగా హెచ్చరించాడు చెన్నకేశవులు.

ఒకరి ముఖం ఒకరు చూసుకుంటూ ఎక్కడ ఉన్న వాళ్ళు అక్కడే బొమ్మల్లా ఆగిపోయారు అందరూ.

'చెయ్యి వాడితనం చాలా ఎక్కువ అబ్బయ్య. చాలా గట్టిగా కొట్టేస్తుంది. ఒక్క ఆచారిగారి మాట తప్ప ఇంకెవ్వరి మాటనూ లెక్కచెయ్యదు' పక్కనే నిలబడి చుట్టపొగను గుప్పుగుప్పున వదులుతున్న ప్రెసిడెంటు చిన్న కంఠంతో ఆ మనిషికి చెప్పాడు.

'అయితే ఆచారిగారికి కబురు పంపించండి. ఆలస్యం చేయకండి' అన్నాడు ఆ మనిషి.

అతను చెప్పవలసిన అవసరం లేకపోయింది. ఆ అమ్మిని ఆపగలిగినవారు అక్కడ ఎవరూ లేరని తెలుసు చెన్నకేశవులకి. కిందినించి లేవగానే వెనుతిరిగి ఊళ్ళోకి పరుగు తీశాడు.

"అయ్యయ్యో... అయ్యయ్యో..." అంటూ ఒక్కసారిగా అరుపులు మొదలయ్యేసరికి, అదిరిపడి నాగమ్మతల్లి గుడికేసి చూశాడు ఆ మనిషి.

పెద్ద తాటాకు బుట్టనిండా అమ్మవారి ప్రసాదాన్ని నింపుకుని గర్భగుడిలో నుంచి బయటికి వస్తున్న పూజారయ్యని నిలువరిస్తోంది ఆ అమ్మి.

ప్రసాదాల బుట్టని కిందికి వదిలేశాడు పూజారయ్య. పక్కకు పారిపోవటానికి ప్రయత్నిస్తున్నాడు.

చూస్తూ నిలబడలేకపోయాడు ఆ మనిషి. ఓపిక సరిపోదని తెలిసి కూడా వేగంగానే పరిగెత్తి గుడి మండపాన్ని చేరుకున్నాడు.

పూజారయ్య భుజాలమీది ఉత్తరీయాన్ని మెలిపెట్టి పట్టుకుంటున్న ఆ అమ్మి భుజాల్ని తను పట్టుకుని బలవంతంగా ఇవతలికి లాగాడు.

'నీ అంతు చూసేస్తానురోయ్... నీ ప్రాణాలు బలిపుచ్చుకుంటాను' కనులను బండిచక్రాల మాదిరి గిరగిరా తిప్పుతూ కచ్చగా అరిచింది ఆమె.

'నేను కూడా ఆచార్లుగారి ఇంటిపక్కన ఉన్న పాకలోనే మకాం పెట్టాను. నువ్వు ఏం చేయదలుచుకున్నా అక్కడ చేయవచ్చు. ఇక్కడ ఇంతమంది ఆనందంగా జరుపుకుంటున్న పండగను పాడుచేయద్దు. వచ్చేయ్ తల్లీ, వెనక్కి వచ్చేయ్..' చెన్నకేశవుల్ని కొట్టినట్టు తనను కూడా కొడితే తట్టుకోవడం కష్టమైపోతుందని తెలిసి కూడా, ఆమె భుజాల్ని వదిలి, చాలా అనునయంగా అన్నాడు ఆ మనిషి.

'నేను వెనక్కి వస్తే జరగరాని ఘోరం జరిగిపోతుందిరా. నా కళ్ళముందే ఒక నిండుప్రాణం గంట కొట్టేస్తుంది' అన్నది ఆమె.

'మరేం పరవాలేదు తల్లీ. ఊరి పెద్దలందరూ ఇక్కడే ఉన్నారు. వాళ్ళు చూసుకుంటారు. మనం ఆచార్లుగారి ఇంటికి వెళ్ళిపోదాం పద..' అంటూ ఆమె చేతిని సున్నితంగా పట్టుకుని మండపంలో నుంచి బయటికి తీసుకుపోయాడు ఆ మనిషి.

తను వదిలేసిన తాటాకుబుట్టలో నుంచి మండపమంతా పరుచుకున్న తీపి ప్రసాదాన్ని చిన్నచిన్నగా ఏరి తిరిగి బుట్టలో భద్రపరుస్తున్నాడు పూజారయ్య. నోరు మూసుకుని తన పనేదో తను చేసుకుని ఉంటే చాలా బాగుండి ఉండేది.

'రోజురోజుకీ దాని పిచ్చి ముదిరి పాకాన పడుతోంది. తట్టుకోవటం చాలా కష్టమైపోతోంది. ఊళ్ళో ఉండనీయటం మంచిది కాదు' కచ్చనిండిన కంఠంతో విసురుగా అన్నాడు.

ముఖం మీదికి పడిన తలకట్టును వెనక్కి నెట్టుకుంటూ ఆ మనిషితోపాటు ఊళ్లోకి బయలుదేరిన అమ్మి - తన వీపు మీద దెబ్బ పడినట్టు ఠక్కున ఆగిపోయింది.

'నా పిచ్చి ముదిరిపాకాన పడుతోందా నేను ఊళ్లో ఉండటం నీకు నచ్చటం లేదా?' భుజం మీదినించి వెనక్కి చూస్తూ బిగ్గరగా అరిచింది.

కింద పడిపోయిన ప్రసాదాన్ని తాటాకు బుట్టలోకి చేర్చే పనిని వదిలేశాడు పూజారయ్య. నిజమైన తాచుపాము ఒకటి తనఎదుట నిలబడినట్లు భయంతో వణికిపోతూ మండపం అవతలి పక్కకు దూకి దూరంగా పరుగు తీశాడు.

పరుగుతీసింది అతను ఒక్కడే కాదు. అతను మండపంలో నుంచి అవతలికి దూకిన మరుక్షణం తను కూడా కదిలింది ఆ అమ్మి.

'నన్ను గౌరవించని ప్రదేశంలో నిలబడి ఉండాల్సిన అవసరం నాకు లేదు. నేను వచ్చిన పని కూడా పూర్తి అయిపోబోతున్నది. నేను కూడా వెళ్ళిపోతా..' అంటూ ఇంకో పక్కకు పరుగు ప్రారంభించింది.

'పట్టుకోండి.. ఆ అమ్మిని ఎవరైనా ఆపేయండి' ఆందోళనగా అందరికీ చెప్పాడు ఆ మనిషి.

అడ్డువెళితే జరిగేది ఏమిటో తెలిసి ఉండడం వల్ల ఒక్క అడుగు కూడా అవతలికి వెయ్యలేదు ఎవరూ.

'ఆ పనేదో నువ్వే చెయ్యి అబ్బయ్యా! ఆచార్లుగారి తర్వాత నిబ్బరంగా నిలబడింది నువ్వు ఒక్కడివే..' చివరివరకూ కాలిపోయిన పొగచుట్టను అవతలికి విసురుతూ చెప్పాడు ప్రెసిడెంటు ఆ మనిషికి.

పాము మాదిరిగానే వేగంగాపోయి చీకట్లలో కలిసిపోతున్న ఆ అమ్మిని చూస్తూ గాఢంగా నిట్టూర్చాడు ఆ మనిషి.

'గాలిలో ఎగురుతున్నట్టు పోతున్నది ఆమె. అడుగు తీసి అడుగు వేయటానికి ఆరుక్షణాలు ఆగవలసిన పరిస్థితి తనది. అందుకోవటం తనకు సాధ్యపడుతుందా?'

కనులు చిట్లించి చూస్తున్న అతనికి - మిణుకు మిణుకుమంటూ కనిపించాయి రెండు దీపాలు.

'అటుపక్క ఇళ్ళు ఏమైనా ఉన్నాయా?' కదలమని తాను చెప్పిన తర్వాత కూడా పరుగు మొదలు పెట్టకుండా అలాగే నిలబడి ఉన్నాడని, విసుగ్గా చూస్తున్న ప్రెసిడెంటుని అడిగాడు అతను.

'ఇళ్ళా? అటు పక్కనా? ఏమి లేవబ్బయ్యా. కంకర రోడ్డుంది. సరాసరి చెన్నకేశవుల చిల్లరకొట్టు దగ్గరికి తీసుకుపోతుంది' అన్నాడు ప్రెసిడెంటు.

ఇళ్ళుగాని, వాకిళ్ళుగాని ఏవీ లేనప్పుడు మిణుకు మిణుకు మంటూ లైట్లు కనిపించటం ఏమిటి?

'నిజమే అబ్బయ్యా... నాకు కూడా అలాగే అనిపిస్తోంది' అన్నాడు చెన్నకేశవులు.

ఎప్పుడు వచ్చాడోగాని, ఆచార్లుగారిని వెంటబెట్టుకునివచ్చి ప్రెసిడెంటు మాటలన్నిటినీ విన్నాడు అతను. ఆ మనిషి మనస్సులోని ఆలోచనల్ని చాలా తేలికగా పసి కట్టేశాడు.

'నీకు తెలియని చోటు ఇది. పరిగెత్తే ఓపిక ఇంకా నీకు రాలేదు. నువ్వు పోయి పాకలో పండుకో. అమ్మిని మేము తీసుకు వస్తాము' అంటూ ఆచార్లుగారు వెంట వస్తుండగా అటుకేసి పరిగెత్తాడు.

'నాగమ్మతల్లి ప్రసాదం నువ్వు తీసుకోవచ్చు. నీకు ఏమీ కాదు. తీసుకో' అంటూ తనే స్వయంగా మండపంలోకి పోయి, పూజారయ్య కింద వదిలిపోయిన బుట్టలో నుంచి కొంచెం తీపిపదార్థాన్ని తెచ్చి ఆ మనిషికి ఇచ్చాడు ప్రెసిడెంటు.

కనులకు అద్దుకుని నోటిలో వేసుకుంటూ ఊళ్ళోకి బయలుదేరాడు ఆ మనిషి. వంద అడుగులు వేసినట్లే వేసి, ఉన్నట్లుండి తను కూడా ఆ అమ్మి పరిగెత్తిన దిశలో నడక మొదలు పెట్టాడు.

●●●

'ఏయ్.... ఎవరు? ఎవరు మీరు?' ఖంగుమంటున్న

## నా కెరీర్‌కి ఢోకా లేదు



*కరీనా గర్భవతని సైఫ్ బహిరంగంగా ప్రకటించినప్పటి నుంచీ ఆమె మీద రోజుకో కథనం బాలీవుడ్‌లో వస్తూనే ఉంది. ఆమె మెటర్నిటీ లీవ్ తీసుకోనుందనీ, కరీనా ఇక సినిమాలకు గుడ్‌బై చెప్పవచ్చనీ ఇలా రకరకాల కథనాలు వినిపిస్తున్నాయి. ముందు వీటిని కరీనా లైట్ తీసుకున్నా ఆ తరువాత మాత్రం ఆమెకి బాగానే కోపం వచ్చినట్టుంది. అందుకే తన కెరీర్ విషయంలో, సినిమాల విషయంలో ఓ క్లారిటీ ఇచ్చే ప్రయత్నం చేసింది. తన గర్భం తన కెరీర్‌కు ఏమాత్రం అడ్డు కాదని స్పష్టం చేసింది. ఓ బిడ్డకు జన్మనివ్వడం అనేది స్త్రీల విషయంలో సర్వసాధారణం. నా విషయంలో కూడా అంతే! ఇంత మాత్రందానికి ఇంత యాగీ ఎందుకు చేస్తున్నారంటూ మండి పడింది.*

కంఠం ఒకటి బిగ్గరగా ప్రశ్నించేసరికి ఎక్కడివా డక్కడ ఆగిపోయాడు చెన్నకేశవులు.

కంకరరోడ్డుకు ఒకపక్కగా ఆగి ఉంది జీపుకారు. దాని చాటునుంచి పెద్దపెద్ద అడుగులు వేస్తూ ముందుకు వచ్చారు ఇద్దరు వ్యక్తులు.

'అరెరే.... మీరా సాములూ.. మీరేనా? నన్ను గుర్తు పట్టలా? నేను రోడ్డు మీది చిల్లరకొట్టు ఓనర్ని. మధ్యాహ్నం మీరు ఫోన్ చెయ్యమని చీటీ ఇచ్చారు..' వారిని వెంటనే పోల్చుకున్నాడు కాబోలు.. పెద్దగా అన్నాడు చెన్నకేశవులు.

'ఈ పాటికి చాలా దూరం ముందుకు వెళ్ళిపోయి ఉంటారని అనుకున్నా.. వెనక్కి వచ్చేశారేంటి?' అని కూడా అడిగాడు.

వెనుక ఉన్న ఆచార్లుగారికి అతని మాటలు విన్న వెంటనే వివరంగా చెప్పవలసిన అవసరం లేకుం డానే విషయం మొత్తం అర్థమైంది.

'అట్టాంటి మనిషి కనిపిస్తే ఫోన్ చేయమని చెప్పారు కదా.. చేద్దాం... మనిషికి మనిషి సాయం చేసు కోవటంలో తప్పేమీలేదు' అన్నాడు తను కూడా.

అనటం అయితే అన్నాడు గాని, సమయం కాని సమయంలో వాళ్ళు తమ గ్రామ పొలిమేరల్లోకి వచ్చిన కారణం ఏమై ఉంటుందో అర్థం చేసుకోలేని మనిషి కాదు. తగలబడి పోయిన బస్సులో నుంచి నలభై మందిని వంటిచేత్తో బయటికి లాగిన మని షిని గురించి వినే ఉంటారు వాళ్ళు. అర్జెంటుగా వాళ్ళని అవతలికి పంపించటమో, గ్రామంలోనే ఉన్న ఆ అబ్బాయ్ని దూరంగా తరిమేయటమో ఏదో ఒకటి వెంటనే చేయాలి.

'ఇదిగో... చూడండి సాములూ... చాదస్తంగా మాట్లాడుతున్నానని అనుకోకపోతే ఒక మాట చెపుతా..' అన్నాడు తనంతట తనే మళ్ళీ.

'ఏమిటది?' కరుకుగా అడిగాడు ఒక వ్యక్తి.

'మా నాగమ్మ తల్లి తిరుగుతూ ఉండే నేల ఇది. ఈ కంకరరోడ్డంటే ఆ తల్లికి భలే ఇష్టం. చీకటివేళలో పొరపాటున మీకు ఎదురు పడిందంటే చాలా ప్రమాదం. వెనక్కితిరిగి మెయిన్‌రోడ్డు మీదికి వెళ్ళిపోండి' అన్నాడు వెరీ సీరియస్‌గా.

శ్రద్ధగా విని బుద్ధిగా తలలు ఊపలేదు వారిలో ఒక్కళ్ళు కూడా. 'పాములు గురించి, తేళ్ళ గురించి మాకు బాగా తెలుసు. నీ దారిన నువ్వు పోవయ్యా" అన్నాడు ఒకడు.

చర్రున తలెత్తి చూడబోయిన చెన్నకేశవులు చేయి పట్టుకుని అతి బలవంతంగా అవతలికి తీసుకు పోయాడు ఆచార్లుగారు.

'వాళ్ళు అయిదుగురు. మనం ఇద్దరమే. తేడా వస్తే దెబ్బతినేది మనమే.' చిన్నకంఠంతో అతన్ని అను నయిస్తూ ఉండగా, షార్ప్‌గా వినవచ్చింది ఆ కంఠం.

'వదలండిరా.. నన్ను వదలండి. నా సంగతి మీకు తెలియదు. చంపి రోడ్డుమీదే పాతిపెట్టేస్తాను. వదలండి'.

'ఆచార్లుగారూ, మన అమ్మిగొంతు. ఆ దొంగ నా బిడ్డలు మన అమ్మిని పట్టుకున్నట్టున్నారు..' తడబడు తున్న కంఠంతో అన్నాడు చెన్నకేశవులు.

'ఊళ్ళోకి పోదాం.. మన వాళ్ళందర్నీ వెంటబెట్టుకు వద్దాం..' క్షణం కూడా ఆలస్యం చేయకుండా రోడ్డు దిగి పక్కనే ఉన్న పొదల్లోకి పరిగెత్తుతూ చెప్పాడు ఆచార్లుగారు.

'ఈ లోపల... ఈ లోపల..' ఆపైన తాను తన నోటితో చెప్పలేకపోయాడు చెన్నకేశవులు.

'చేయగలిగింది ఏమీలేదు చెన్నకేశవులూ... గుడ్డిగా పోతే మనల్ని చావకొట్టి చెవులు మూసేస్తారు' అంటూ పరుగు వేగాన్ని పెంచాడు ఆచార్లుగారు.

•••

సాధ్యమైనంత వేగంగా అడుగులు వేస్తూ వస్తున్న ఆ మనిషికి కూడా వినవచ్చింది పిచ్చమ్మ అరిచిన అరుపు.

ప్రెసిడెంటు బలవంతంగా తినిపించిన తీపి ప్రసాదపు రుచి ఉన్నట్లుండి చేదుగా మారిపోయిన అనుభూతి కలిగింది అతనికి. అందరికీ స్పష్టంగా కనిపించేటట్లు కంకరరోడ్డు మీద నడవటం పద్ధ తిగా ఉండదని అనుకుంటూ, అవతలిపక్కన ఉన్న పొదల్లోకి పోయాడు.

పదే పది క్షణాల తరువాత నక్షత్రాల వెలుగులో స్పష్టంగా కనిపించనే కనిపించింది ఆ అమ్మి.

కనులు చెదిరిపోయేటట్లు కనిపించే ఆమె తలకట్టును మెలివేసి పట్టుకున్నాడు ఒక వ్యక్తి. పమిట చెంగును పట్టుకున్నాడు మరోవ్యక్తి. వెకిలిగా నవ్వుతూ ఒంటి మీద చేతులు వేస్తున్నాడు మరో ప్రబుద్ధుడు.

అప్పుడు కూడా ఏడ్చి రాగాలుతీయటం లేదామె. పళ్ళు కొరుకుతూ పాము మాదిరి రాబోతోంది.

వేగంగా కొట్టుకుంటున్న గుండెల్ని చిక్కబట్టుకుంటూ, ముందుకు అడుగు వేయబోయి... ఒళ్ళు ఝల్లుమనే సరికి ఎక్కడివాడక్కడ ఆగిపోయాడు అతను.

ఎండిపోయిన తాటాకును నేలమీద పడవేసి ఎవరో వేగంగా ఈడుస్తున్నట్టు గరగరమని శబ్దం ఒకటి విన రావటమే అందుకు కారణం.

చీకటి సమయాల్లో అటువంటి శబ్దం వినవస్తే దానికి అర్థం ఏమిటో చాలా బాగా తెలుసు అతనికి.

కనీసం ఏడు ఎనిమిది అడుగుల పొడవు ఉండే సర్పం వేగంగా పోయే సమయంలో ఉత్పన్నమవుతుంది అది.

రోడ్డుపక్కన పొదల్లో మొదలయిన ఆ గోలను గమనించి బాగా భయపడినట్లుంది ఏదో పాము.. దూరంగా పారిపోవటానికి చూస్తోంది.

గిలగిలలాడుతున్న పిచ్చమ్మని కింద పడవేశాడు ఆమె తలకట్టును పట్టుకున్న మనిషి. 'వెళ్ళండిరా... వెళ్ళి జీపు దగ్గర నిలబడండి' అంటూ మిగిలిన వారిని అవతలికి పంపించేశాడు.

'చంపేస్తానురోయ్... నీ నెత్తురు తాగేస్తాను' కీచుగా అరిచింది కింద పడవేయబడిన అమ్మి.

'చచ్చానురోయ్.. చచ్చిపోయాను..' అంతకంటే బిగ్గరగా అరిచాడు ఆమె దగ్గర ఆగిపోయిన వ్యక్తి.

ఊపిరి బిగపట్టి ముందుకు దూకేందుకు సిద్ధమై, పొదల్లోనే ఆగిపోయిన మనిషి. పది అడుగుల దూరంలో కనిపించిన దృశ్యాన్ని చూసి నిశ్చేష్టుడైపోయాడు.

ఆరుఅడుగుల పొడవు మాత్రమే ఉంది ఒక కోడె నాగు. పడగ ఎత్తి ఫెటీఫెటీమని ఆ వ్యక్తి పాదాల మీద కొట్టి, అవతలికి వెళ్ళిపోతోంది.

రోడ్డుమీదికి వెళ్ళిన వ్యక్తులు వేగంగా వెనక్కి వస్తూ ఉండటాన్ని చూశాడు ఆ మనిషి. గబుక్కున కిందికి వంగి నేలను తడిమాడు. పట్టెడు పట్టెడు లావున్న కొండరాళ్ళు తగిలేసరికి వాటిని చేతుల్లోకి తీసుకున్నాడు.

'ఏమయింది? ఏం జరిగింది?' బిగ్గరగా అడు గుతూ ముందుగా రోడ్డుదిగిన వ్యక్తి ముఖానికి తగి లింది మొదటి రాయి. జరుగుతున్నది ఏమిటో అర్థం అయ్యే లోపుగా ఒక దాని వెనుకగా ఒకటి దూసుకుపోయాయి మరో మూడు.

మూడుసార్లు కనులు మూసీ కనులు తెరిచేలోపుగా మొదళ్ళు నరికిన చెట్లమాదిరి నేలను కౌగలించుకున్నారు ఆ నలుగురు వ్యక్తులు.

'చంపేస్తాను. రక్తం తాగేస్తాను' పలవరిస్తున్నట్టు అదేపనిగా అరుస్తున్న ఆ అమ్మి చేతిని మృదువుగా స్పృశించాడు ఆ మనిషి.

'నీ జోలికి వచ్చినవాళ్ళు తలకిందులు అయిపో యారు. ఇంకా ఒక్కడు మాత్రం మిగిలి ఉన్నాడు. రా తల్లీ.. పోయి వాడిని కూడా పలకరిద్దాము' అంటూ ఆమెకు చెప్పి, పాముకాటు దెబ్బకు ఇంకా గిలగిల లాడుతున్న వ్యక్తి దుస్తుల్ని తడిమాడు.

ప్యాంటుజేబులో దొరికింది ఒక నాటు పిస్తోలు. వెనుక జేబులో కనిపించింది పదునైన పేష్కష్.

'పరిగెత్తి పరిగెత్తి నీకు కూడా విసుగు పుట్టేసింది తల్లీ. నువ్వు త్వరగా కదిలితే చాలా బాగుంటుంది' అని ఆమెకు చెపుతూ రోడ్డుమీదికి పోయాడు.

అతని ఊహ యదార్థమే అయింది. అప్పటివరకూ జీపు స్టీరింగ్ ముందు కూర్చుని కునికిపాట్లు పడు తున్నాడు డ్రైవర్. పలుకురాళ్ళ దెబ్బలకు తల్లకిందులై పోయిన వారి మూలుగులు అతన్ని ఎలర్ట్ చేసే శాయి. మూరెడు పొడుగున్న టార్చిలైటును సీటు కింది నించి తీసి, జీప్‌లో నుంచి దిగుతున్నాడు.

పేష్కష్‌ని పట్టుకుని తన ఎదుట ప్రత్యక్షం అయిన మనిషిని చూసేసరికి నిలువుగుడ్లు పడ్డాయి అతనికి.

'నువ్వా?' ఆశ్చర్యం, ఆందోళన కలగలిపిన కంఠంతో కీచుగా అరిచినంత పని చేశాడు.

'నేనే. నేనేరా! మీరు తరుముకుంటూ వచ్చిన వెట్టిని నేనే.." అంటూ పేష్కష్‌ని వెనక్కి తిప్పి, అతని నుదుటిమీద పొడిచాడు ఆ మనిషి.

బాధను భరించడం చేతకాక గొంతు చినిగిపోయే టట్లు అరవటానికి నోరు తెరిచాడు అతను. శబ్దం బయటికి రాకముందే తప్పిపోయింది తెలివి.

**(ఇంకావుంది)**








## తాడాటతో రికార్డు!

క్రికెట్, మారథాన్ వంటి ఆటల్లో రికార్డుల మోత సహజమే! కానీ తాడాటలో గిన్నిస్ రికార్డు సృష్టించింది అనికా స్టుహర్! తాడాటతో గిన్నిస్ రికార్డా? ఎలాగా? అనుకుంటున్నారు కదూ! అయితే చదవండి.

మామూలుగా ఎవరైనా గెంతుతూ తాడాట ఆడేస్తుంటారు. కానీ జర్మనీకి చెందిన అనికా మాత్రం అలా గెంతుతూ తాడాట ఆడదు. అందరూ నుంచుని ఎగురుతూ స్కిప్పింగ్ ఆడితే ఆమె కూర్చుని ఎగురుతూ ఆడింది. అదికూడా మామూలుగా కాదు, యమా స్పీడుగా, కేవలం ఒక్క నిమిషంలోనే 108 రౌండ్లు ఆడింది. అందువల్లే గిన్నిస్ రికార్డు ఆమె సొంతమైంది. భలే రికార్డు కదూ!



## క్లాక్స్ మ్యూజియం

ఇప్పుడైతే జనాలు కాలంతో పోటీపడి పరుగులు పెడుతున్నారు. ఒక్క సెకను వృథా అయినా ఏదో పోగొట్టుకున్నట్టు ఫీలయిపోతున్నారు. కానీ వందలు, వేల ఏళ్ళ క్రితం మనిషి సమయం తెలుసుకోవడానికి ఏం ఉపయోగించేవాడు? అసలు గడియారాన్ని ఎవరు కనిపెట్టారు? అప్పటినుంచి ఇప్పటివరకు గడియారాల్లో ఎన్నెన్ని మార్పులు జరిగాయి? ఇవన్నీ తెలుసుకోవాలంటే ఆస్ట్రియా వెళ్ళాల్సిందే! ఎందుకంటే అక్కడే ఉంది మరి 'వియన్నెస్ క్లాక్ మ్యూజియం'. దీన్నే యుహ్రేన్ మ్యూజియం అని కూడా పిలుస్తారు. వియన్నాలో ఉన్న వియన్నెస్ మ్యూజియంలోకి అడుగుపెట్టగానే తాతముత్తాతల నాటి రకరకాల గడియారాలు దర్శనమిస్తాయి. మూడంతస్తుల్లో ఉన్న ఈ మ్యూజియంలో ఎప్పుడో 15వ శతాబ్దం నాటి గడియారాల నుంచి ఇప్పటితరం వాచీలవరకు అన్నీ వరుసప్రకారం అమర్చిపెట్టారు. పాకెట్ వాచ్, టేబుల్ క్లాక్, గోడ గడియారం, టవర్ క్లాక్, సన్‌డయల్స్, పిల్లర్ క్లాక్, కుకూ క్లాక్ ఇలా ఎన్నో రకాల గడియారాల్ని ఇక్కడ చూడొచ్చు. వీటిలో కొన్ని రోజు, తేదీ, నెల, సంవత్సరం చూపించేవీ ఉన్నాయి. మరి వాచీల చరిత్ర తెలుసుకోవాలంటే ఈ మ్యూజియాన్ని దర్శిస్తే సరి!

## పాపవిముక్తికి సర్టిఫికెట్

ఇక్కడైతే నేరం చేసినవాళ్ళని శిక్షించడానికి కోర్టులు ఉన్నాయి. సాక్ష్యాలు పక్కాగా ఉంటే చాలు నేరస్తులకు శిక్ష పడినట్లే! చేసిన తప్పుని బట్టే శిక్షా ఉంటుంది. మరి బతికున్నప్పుడు చేసిన పాపాలకు చనిపోయాక నరకంలో విధించే శిక్షల మాటేమిటి? అక్కడ కూడా సాక్ష్యాలు అవసరమా! అక్కడ సాక్ష్యాలు అవసరమో కాదో తెలియదు కానీ ఇక్కడ మీకు పాపాలనుంచి విముక్తి కలిగించడానికి ఏకంగా సర్టిఫికెట్లు ఇచ్చేస్తారు. ఆశ్చర్యంగా ఉంది కదూ!

రాజస్థాన్, ప్రతాప్‌గఢ్‌లోని గౌతమేశ్వర మహాదేవ పాపవిమోచనతీర్థం ఎప్పుడూ భక్తులతో కిటకిటలాడుతూ ఉంటుంది. మహాదేవుడు కొలువై ఉన్న ఈ దేవాలయంలోని మందాకిని కుండంలో స్నానంచేసి 11 రూపాయలు సమర్పించుకుంటే చాలు, పాపాల నుంచి విముక్తి పొందినట్లు సర్టిఫికెట్టు ఇస్తారు. ఈ సంప్రదాయం ఎప్పటినుంచో ఉందట! అంతేకాదు ఇప్పటికి ఎన్ని లక్షల మంది పాపాల నుంచి విముక్తి పొందారో రికార్డులు కూడా ఉన్నాయట! దోషనివారణకు 10 రూపాయలు, పాపాల నుంచి విముక్తి లభించేలా చేసినందుకు పూజారుల సంఘానికి కమీషన్‌గా మరో రూపాయి అంతే! బహుశా పాపవిముక్తి సర్టిఫికెట్లు ఇస్తున్న ఏకైక పుణ్యస్థలి ప్రపంచంలోకెల్లా ఇదొక్కటేనేమో!




## పెంపుడు కుక్కతో విహారయాత్ర!

పెంపుడు జంతువులను ఎక్కడెక్కడి నుంచో తెచ్చి పెంచుకుంటారు. వాటికి కావలసినవన్నీ సమకూరుస్తారు. తిండికి, ముద్దు ముచ్చట్లకు కొదవే ఉండదు. కానీ అదే పెంపుడు జంతువు చనిపోతుందని తెలిస్తే ఏం చేస్తారు? మహా అయితే వాటికి నచ్చిన ఆహారం పెట్టి కొద్దిరోజులైనా ప్రేమగా చూసుకుంటారు. కానీ అమెరికాకు చెందిన రాబర్ట్ క్లగర్ మాత్రం అలా చేయలేదు. తన పెంపుడు కుక్క బెల్లాకు కేన్సర్ అనీ, ఆరునెలలు మించి బతకదని డాక్టర్లు తేల్చి చెప్పేయడంతో క్లగర్ భిన్నంగా ఆలోచించాడు. బెల్లాతో గడిపే ఆఖరి రోజులు ఎప్పటికీ గుర్తుండిపోవాలనుకున్నాడు. అనుకున్నదే తడవుగా వెంటనే బెల్లాతో విహారయాత్రకు బయలుదేరాడు. న్యూయార్క్, డెట్రాయిట్, కెంటకీ, ఓహియో వంటి అనేక ప్రాంతాలు తిరుగుతూ సరదాగా గడిపాడు. కానీ బెల్లా గడువు కంటే ముందే చనిపోవడంతో రాబర్ట్ తట్టుకోలేకపోయాడు. ఏమైతేనేం, కుక్కని విహారయాత్రకు తీసుకెళ్ళటం మాత్రం చెప్పుకోదగ్గ విషయమే కదా!



-నర్మద వాసిరెడ్డి



# గేమ్ ఆఫ్ లైఫ్

-కంఠంనేని రాధాకృష్ణమూర్తి 5



తాము చేసే విమర్శలు ప్రతివాళ్ళకూ తెలియాలనీ, ప్రతివాళ్ళూ అర్థం చేసుకోవాలనీ అనుకుంటారు. వీళ్ళు ఎక్కువగా తమలాంటి విమర్శక గ్యాంగ్‌లోనే తిరుగుతూ వాళ్ళ మధ్య సుఖకరంగా, సౌకర్యవంతంగా ఫీలవుతారు.

రోజువారీ జీవితంలో ఇట్లాంటి వాళ్ళు చాలా మంది కనిపిస్తుంటారు మనకు.

వాళ్ళ భాష ఎట్లా ఉంటుంది అంటే:

"నేను చేయను".

"ఎట్లా చేస్తాను? నాకు కుదరదు.."

"టైము లేదు నాకు"

"నన్ను మరీ ఇరకాటంలో పెడుతున్నావు".

"ఇంక ఆపు!"

వాళ్ళ ఆలోచనలు, అనుభూతులు ఎలా ఉంటాయంటే:

- తమకు అనుకూలం కాని ప్రతి సంఘటనలోనూ ఏదో తప్పు, తేడా ఉందనుకుంటారు.
- తాను కరెక్టుగానే ఉంటున్నాడుగాని, ఎప్పుడూ ఇతరులే సమస్యలు సృష్టిస్తున్నారను కుంటారు.
- 'మార్పు' (Change) కాలికి గుచ్చుకున్న ముల్లు లాంటిదనుకుంటారు.
- ఎప్పుడూ చిరచిరలాడుతుంటారు.

# నెగెటివా? పాజిటివా? ఎలా ఉంటారు మీరు?

**దృక్పథాల పరంగా చూసినప్పుడు మనుషులు మూడు రకాల కిందికి వస్తారు.**

### వీక్షకులు (Spectators)

జీవితంలో జరిగిపోతుండే సంఘటనలను చూస్తూ ఉండిపోతారు వాళ్ళు. ఏ మాత్రం ప్రతిఘటించరు. ఆయా సంఘటనలకనుగుణంగా తమను తాము సర్దుబాటు చేసుకుంటూ బుద్ధిమంతుల్లా జీవితాన్ని సాగిస్తుంటారు.

వాళ్ళ అనుభవాలు చాలా పరిమితంగా ఉంటాయి. జీవితంలో పెద్దగా రిస్కుల్ని తీసుకోరు. సేఫ్‌గేమ్ ఆడుతుంటారు. 'మధ్యస్థ దృక్పథం' వాళ్ళది.

వాళ్ళ భాష ఎట్లా ఉంటుందంటే.

"నాకు ఇష్టం లేదు"

"చూస్తాను... ఆలోచిస్తాను"

"టైముంటే చేస్తాను"

"బహుశా..."

"నాకు తెలియదు"

ఈ రకంగా వాళ్ళ ఆలోచనలు, అనుభూతులు ఉంటాయంటే:

- అవతలి వ్యక్తి వాళ్ళకంత ముఖ్యంగా కనిపించరు.
- సమస్య దానికదే పరిష్కారమవుతుంది. లేకపోతే ఎవరో ఒకరు ఎప్పుడో ఒకప్పుడు పరిష్కరిస్తారు.
- మార్పు (Change) అనవసరం.
- నేను ఉన్నా లేకపోయినా భవిష్యత్తు వస్తుంది, వెళ్ళిపోతుంది.
- జీవితాన్ని తన చెప్పుచేతల్లో ఉంచుకోవటానికి ప్రయత్నించటం అనవసరం. శుద్ధ వేస్టు.
- వాళ్ళలో అంతగా భావోద్వేగాలు ఉండవు. ఎక్కువ సందర్భాలలో అన్ ఎమోషనల్‌గా ఉంటారు.
- ఉన్నదానితో సంతృప్తి పడిపోతారు.
- వీళ్ళలో ఉదాసీనత, నిరాసక్తత అధికంగా ఉంటాయి.

సమాజానికి వాళ్ళ మూలంగా ఏ ప్రమాదమూ; ఏ అపకారమూ ఉండదు.

వాళ్ళది మధ్యస్థ దృక్పథం. న్యూట్రల్ యాటిట్యూడ్

### విమర్శకులు (Critics)

వాళ్ళు ప్రతిదానినీ విమర్శిస్తూ పోతారు. అందుకే వాళ్ళని 'క్రిటిక్స్' అంటారు.

జీవితపు గేమ్‌లో తమను తాము పెద్ద 'పుడింగు' లుగా 'ఎక్స్‌పర్ట్'లుగా భావిస్తారు వాళ్ళు. ప్రతి దానినీ విమర్శిస్తూ, ప్రతివాళ్ళనూ విమర్శిస్తూ అందులో ఆనందాన్ని, గర్వాన్ని పొందుతుంటారు.

- ఎవరినీ నమ్మరు.
- నిరాశా నిస్పృహలు ఎక్కువ.
- మనుషుల మీద అనవసర ద్వేషం ఉంటుంది అన్నింటా, అందరిపట్లా 'నెగెటివ్ దృక్పథం' వాళ్ళది.

### ఆటగాళ్ళు (ప్లేయర్స్)

జీవితపు గేమ్‌లో ఒక క్రీడాకారుడిలా స్పోర్టివ్‌గా పాల్గొంటారు వాళ్ళు. కొత్త విషయాల్ని నేర్చుకోవాలనీ తద్వారా కొత్త అవకాశాలను అన్వేషించాలనీ అనుకుంటారు.

రిస్కు తీసుకోవటానికి వెనుకాడరు వాళ్ళు. తప్పులు జరిగినప్పుడు, అపజయం ఎదురైనప్పుడు భీతిచెందరు వాళ్ళు. దాని నుంచి ఏమి పాఠం నేర్చుకోగలనా అని ఆలోచిస్తారు.

వాళ్ళ భాష ఇలా ఉంటుంది.

"దీనిని నేను చేయగలను. చేస్తాను".

"ఇలాంటి ఛాలెంజ్ కోసమే ఎదురుచూస్తున్నాను".

"టైములేక పోవటమేమిటి, తీరిక చేసుకుని చేస్తాను".

"చేయటమే మంచిది".

"ష్యూర్ ష్యూర్, తప్పకుండా చేస్తాను"

"పద, చేద్దాం.."

ఈ రకంగా

వాళ్ళ ఆలోచనలు, అనుభూతులు ఎలా ఉంటాయంటే:

- ప్రతి సంఘటనలోనూ, ప్రతి సిట్యుయేషన్ లోనూ ఎంతోకొంత మంచి ఉంటుంది.
- సమస్య అనేది డిఫరెంట్‌గా చేయటానికి వచ్చిన ఒక అవకాశం.
- 'మార్పు' (Change) అనేది ఎదుగుదలకు అవసరమయ్యే ఒక గుర్తు చిహ్నం.
- సక్సెస్‌కి చేరువకావటానికి వేసే విలువైన తప్పటడుగు 'అపజయం'.
- జీవితం మీద నాకు అన్ని విధాలుగానూ కంట్రోల్ ఉంది".

వాళ్ళు ఎక్కువగా:

- సంతోషంగా ఉంటారు.
- కాన్ఫిడెంట్‌గా ఉంటారు.
- ఆశావహంగా ఉంటారు.
- సంతృప్తిని ఫీలవుతుంటారు.
- ప్రేమను పంచటానికి సిద్ధంగా ఉంటారు.

జీవితం పట్ల 'పాజిటివ్ దృక్పథం' వాళ్ళది.

ఇక్కడ ఒక సంగతి గుర్తుంచుకోవాలి. ఏ మనిషిలో నయినా ఫలానా దృక్పథం శాశ్వతంగా ఉంటుందని అనుకోవటానికి వీలులేదు. సందర్భానుగుణంగా (Situation-Specific) ఉండి తాత్కాలికంగా మారి పోతుండవచ్చు.

ఉదాహరణకు ఒక పాజిటివ్ వ్యక్తి తనకు ఇష్టం లేని వ్యక్తి లేక సిట్యుయేషన్ విషయంలో నెగటివ్ దృక్పథాన్ని ప్రదర్శించవచ్చు.

అలాగే ఒక నెగెటివ్‌వ్యక్తి తనకు ఇష్టమైన వ్యక్తి లేక సిట్యుయేషన్ సందర్భంలో పాజిటివ్‌గా స్పందించ వచ్చు.

మొత్తంగా చూసినప్పుడు:
మూడు రకాల దృక్పథాలు
పాజిటివ్
నెగెటివ్
న్యూట్రల్

ఆలోచనలు, అనుభూతులు దృక్పథాల నేర్పరుస్తాయి.

దృక్పథం మీ ప్రవర్తనను పురికొల్పుతుంది.

ప్రవర్తన (మీరు చేసే పనులు లేక చర్యలు) మీ జీవితంలో ఏర్పడే ఫలితాలకు మూలకంగా ఉంటుంది.

ఏ రకమైన దృక్పథం వల్ల ఎలాంటి ఫలితాలు లభిస్తాయన్న విషయాన్ని చూసినప్పుడు:



**పాజిటివ్ దృక్పథం అందించే లాభాలు:**

- మంచి ఉద్యోగాన్ని సంపాదించ గలుగుతారు.
- ప్రమోషన్ త్వరగా పొందగలుగు తారు
- చేపట్టిన పనిని (లేక ప్రాజె క్టును) విజయవంతంగా పూర్తి చేయగలుగుతారు.
- వ్యక్తిగతంగాను, ప్రొఫెషనల్ గానూ మీరు ఏర్పరచుకున్న లక్ష్యాలు చేరుకోగలుగుతారు.
- కుటుంబ సభ్యులు, మిత్రులు, సాటి ఉద్యోగులతో మీ సంబంధ బాంధవ్యాలు సజా వుగా కొనసాగుతుంటాయి.

**నెగెటివ్ దృక్పథం మూలంగా...**

- ఉద్యోగంలో పెద్దగా రాణించ లేరు.
- మీ వితండ వాదనలు, విరుద్ధ ప్రవర్తనల మూలంగా ఒక్కోసారి ఉద్యోగం ఊడవచ్చు కూడా.
- వ్యక్తిగత, వృత్తి గత లక్ష్యాలను చేరుకోవటంలో విఫల మవుతారు.
- అంతా మిమ్మల్ని సందేహంగా చూస్తారు. 'వాడో పెద్ద డేంజర్ గాడు' అన్నట్టుగా పరిగ ణిస్తారు.
- ఇంట్లోవాళ్ళతో గాని, బయటివాళ్ళతో గాని సంబంధ బాంధవ్యాలు మాటిమాటికి బెడిసి కొడుతుంటాయి.

**న్యూట్రల్ మనస్తత్వం మూలంగా...**

- అవకాశాలు జారిపోవచ్చు.
- కొత్తనైపుణ్యాల్ని (New Skills) నేర్చుకోలేరు. అలవరుచుకోలేరు.
- వృత్తి వ్యాపారాలలో లేక జీవితంలో పైకి పోవ టానికి, ఎదగటానికి అవసరమయ్యే జ్ఞానాన్ని పెంపొందించుకోలేరు.
- స్నేహితులు, తెలిసినవాళ్ళు పరిమితంగా మాత్రమే ఉంటారు. కొత్త పరిచయాలు అంతగా ఏర్పడవు.

పై వాటినిబట్టి తెలిసేది ఏమిటంటే- అన్నింటిలోకీ ఉత్తమమైనది పాజిటివ్ దృక్పథం అని. జీవితంలో రాణించటానికి, జీవన పోరా టంలో గెలుపుబాట పట్టటానికి పాజిటివ్ దృక్పథం అన్ని విధాలా అవసరం!

జీవితం ఒక యుద్ధరంగం లాంటిది. ఎప్పుడు ఎలాంటి పోరాట సన్నివేశం తటస్థ పడు తుందో తెలియదు. అలాంటి సందర్భాలలో అతడిలోని దృక్పథం, ఆలోచనాధోరణి - మంచిగానో చెడుగానో అతడికి సహకరిస్తుంది.

ఒకవ్యక్తి అమీర్‌పేట చౌరస్తా వద్ద నిలబడి ఉన్నాడు. అతనికి ఎదురుగా ఉన్న రోడ్డు ఎడమ వేపునకు సనత్‌నగర్ వెళ్తుంది. కుడివేపు పంజాగుట్టకి.

అర్జెంటు పనిమీద అతనొక మిత్రుడి కోసం వెయిట్ చేస్తున్నాడు.

మిట్టమధ్యాహ్నం. ఎండ మండిపోతోంది.

అంతలో అటుగా వచ్చిన ఒకవ్యక్తి "ఇక్కడ బస్‌స్టాప్ ఎక్కడ ఉంది?" అని అడిగాడు. అత నికి 30 ఏళ్ళుంటాయి. అతని మొహంలో చికాకు



కనిపిస్తోంది. ఎటువెళ్ళే బస్సుకు చెందిన స్టాప్ అన్నది కూడా అతను చెప్పలేదు.

మొదటి వ్యక్తి ఆ ప్రాంతానికి కొత్తగా వచ్చిన వాడు. అతనికి సరిగ్గా తెలియదు. మొహమాటం ఎక్కువ.

"అవతల చర్మాస్‌కి దగ్గరలో ఎక్కడో ఉన్నట్లుంది. లేక ఇటు వెళ్తే సారథీ స్టూడియో వద్ద ఒకటి ఉన్న ట్లుంది.." అన్నాడు సందిగ్ధంగా.

ఆ మాటలు విన్నవెంటనే రెండో వ్యక్తి ఫైర్ అయిపోయాడు.

"ఏమనుకుంటున్నావు నన్ను చూసి? పిచ్చాడి ననుకుంటున్నావా? తెలిస్తే తెలుసని చెప్పాలి, లేకపోతే తెలియదని చెప్పాలి. అంతేగాని ఇటువెళ్తే ఉంది లేకపోతే అటు వెళ్తే ఉన్నట్లుంది. అంటే ఏమి టర్థం? ఎటువెళ్ళమని నన్ను? ఫూల్‌ని చేద్దామని చూస్తు న్నావా" అన్నాడు కోపంగా. దాదాపు కొట్టవచ్చినట్లుగా.

అది నిజంగా జరిగింది.

ఇక్కడ మొదటి వ్యక్తి ఎలా స్పందించాలి? ఎలా స్పందిస్తాడు??

అతను రఫ్‌గా ఉండేవాడు, నెగెటివ్‌గా స్పందించే వాడు అయితే-

"నా కొడక ఏమనుకుంటున్నావ్‌రా, నన్నడగమని చెప్పానా నీకు.." అంటూ గొడవ పెట్టుకోవచ్చు.

అదే పాజిటివ్ మనిషి అయితే.

"ఇతను ఏదో ఫ్రస్ట్రేషన్‌లో ఉన్నట్లున్నాడు. పైగా తిక్క మనిషిలాగా కూడా ఉన్నాడు. ఎండమూలంగా ఇంకా వేడెక్కినట్లున్నాడు.." అనుకుని జాలి పడ వచ్చు. పక్కనున్న షాపువాళ్ళను చూపించి, "నాకు నిజంగా తెలియదు, వాళ్ళ నడగండి. కరెక్టుగా చెబు తారు." అని సర్ది చెప్పవచ్చు. ఆ సిట్యుయేషన్ నుంచి బయట పడవచ్చు.

జీవితంలో ఎప్పుడు ఎలాంటి సిట్యుయేషన్ ఎదు రవుతుందో చెప్పలేం. పాజిటివ్‌గా ఆలోచించి, సిట్యు యేషన్ నుంచి పక్కకు తప్పుకోవచ్చు. పాజిటివ్‌గా ఉండటమే కాక మరింత తెలివిగా పోతే దానిని తనకు లాభదాయకంగానూ మార్చుకోవచ్చు.

ఒక అయిదేళ్ళ కుర్రవాడు హేళనతో కూడిన ఒక సిట్యుయేషన్‌ని తనకు లబ్ధిచేకూరే విధంగా తెలి విగా ఎలా మల్చుకున్నాడో వచ్చేవారం చూడండి....

**(ఇంకా వుంది)**

# బతుకు చిత్రం

## -పి.చంద్రశేఖర అజాద్

**సురేష్ నావరకు ఇప్పటిదాకా ఓ పజిల్! అతను అయిదు సంవత్సరాల నుంచి నాకు తెలుసు. మాదో ఎన్‌జీవో. మా ఆర్గనైజేషన్‌లో అతను డ్రైవర్‌గా పనిచేస్తున్నాడు. నేను ఇందులో చేరక ముందు మూడు సంవత్సరాల నుంచీ అతనున్నాడు.**

**సురేష్ నార్త్‌కి చెందినవాడు. అంతకుమించి వివరాలు నాకు తెలియవు. నేను వచ్చిన దగ్గర్నుండి ఇంతవరకు అతను సెలవులు తీసుకోలేదు. ఎవరయినా బతుకుతెరువు కోసం సొంత రాష్ట్రాల నుండి ఎక్కడికైనా వెళ్తుంటారు. అయితే సంవత్సరానికో, రెండు సంవత్సరాలకో తమ ప్రాంతం వెళ్ళి తమవారిని, తమఊరిని చూసి వస్తుంటారు.**

సురేష్ ఎందుకని తన ఊరు వెళ్ళడో నాకు అర్థం కాలేదు. ఓసారి అడిగాను, 'మీ ఊరు చూడాలనిపించదా? అక్కడ మీ బంధువులు లేరా?' అని. సమాధానం చెప్పటానికి అతను ఇబ్బందిపడ్డాడు.

'చెప్పటం ఇష్టం లేకపోతే వదిలెయ్' అన్నాను.

'నాకు ఎవరూ లేరు సర్' అన్నాడు.

సురేష్‌కి ఇప్పుడు ముప్పై సంవత్సరాలు. ఇంకా పెళ్ళి చేసుకోలేదు. తను ఓ గదిలో ఉంటాడు. తెలుగు బాగా నేర్చుకున్నాడు. ఎవరు ఏ పని అడిగినా కాదన కుండా చేస్తాడు. ఎవరి నుంచీ ఏమీ ఆశించడు. అతనికి ఇతరుల విషయాలు తెలుసుకోవాలనే ఆసక్తి లేదు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తుంటాడు. ఏదో కోల్పోయినట్లు కనిపిస్తాడు. అది ఏమయి ఉంటుందోనని అనిపిస్తుంటుంది.

ఈమధ్య మా అటెండర్ నరసింహం 'నాకు మీరో చిన్న సహాయం చేసి పెట్టాలి అని అడిగాడు. అతను అప్పుడప్పుడు అడ్వాన్స్ కావాలని అడుగుతుంటాడు. అలాంటిదే అనుకున్నాను.

నా చెల్లికి పెళ్ళి చేయాలి. మీరు చెబితే సురేష్ వింటాడు. మీరు ఎలా అయినా అతన్ని ఈ పెళ్ళికి ఒప్పించాలి' అన్నాడు.

'సురేష్ మన ప్రాంతం వాడు కాదు. అతనికి బంధువులు ఎవరూ లేరు. అతని గురించి మనకు తెలిసింది చాలా తక్కువ. అలాంటి మనిషికి నీ చెల్లిని ఇస్తావా?' అన్నాను.

'అతనికి ఎవరూ లేరు కాబట్టి ఇక్కడే ఉంటాడు. మా చెల్లిని ప్రేమగా చూసుకుంటాడు సార్' అన్నాడు.

'అలా ఎందుకనుకుంటున్నావు? సురేష్‌కి అయినవారు లేకపోవచ్చు. అతను పుట్టిన ఊరుంది. ఎప్పుడైనా సొంతూరి మీదకు గాలి తిరగ వచ్చు. అయినా ఇలాంటివారే డ్రైవర్ ఉద్యోగాలకు వస్తారు. వాళ్ళు శాశ్వతంగా ఓ ప్రాంతంలో ఉంటారని గ్యారెంటీ లేదు. అప్పుడేం చేస్తావు? అన్నాను.

చెల్లి అదృష్టం అలా రాసుంటే ఎవరు మాత్రం ఏం చేయగలరు? నిజానికి సురేష్‌ది మా కులం కాదు. మతం కాదు. ఇంట్లో ఈ పెళ్ళి అంటే భయపడతారు. అయినా అంతకంటే దారి లేదు నాకు. కట్నాలు ఇవ్వలేను. పెళ్ళి ఖర్చులు భరించలేను. నా చెల్లికి ఇప్పటికే ఇరవై ఏడు సంవత్సరాలు నిండాయి.' అతను బాధగా అంటుంటే నాకు జయ గుర్తొచ్చింది.

మా సంస్థలో జయ పనిచేస్తోంది. తనకి ఇరవై ఐదు సంవత్సరాలు. ఇంతవరకు పెళ్ళి చేసుకోలేదు. డైనమిక్‌గా ఉంటుంది.

'ఏ భాగ్యం ఉందని పెళ్ళి చేసుకోవాలి?' అందోసారి.

భాగ్యం కోసం కాకపోయినా తోడు అవసరం కదా అన్నాను.

తోడుకోసమైతే పెళ్ళే చేసుకోవలసిన అవసరం లేదు. లోకాన్ని చూస్తున్నాం కదా! ఎంత మంది తల్లులూ, తండ్రులూ ఆడపిల్లల్ని కని రోడ్డుమీద పారేయటం లేదు అంటుంటే...

ఎవరినైనా ప్రేమించావా జయా? అన్నాను.

'ప్రేమా! అది డిస్కవర్ చేయాలి. ముందు నేను లింగ వివక్షకి వ్యతిరేకంగా యుద్ధం చేయాలి. వాడిని ప్రేమించవచ్చు. కొంతకాలమైనా వాడికి తోడుగా ఉండవచ్చు అనే మగాడు నాకు కనిపించ లేదు. అయినా పెళ్ళి రద్దు కావాలి. కుటుంబం రద్దు కావాలి అనే రోజుల్లో బతుకుతున్నాం. అలాంటి వాటిని ఎందుకు కౌగలించుకోవాలి' అంది నవ్వుతూ.

నరసింహం విషయం జయతో అంటే...

ఏం బాబూ, నీ చెల్లికి పెళ్ళి జరగకపోతే ప్రపంచానికి ప్రమాదమేమీ లేదు. నీ చెల్లెల్ని ఇష్టం వచ్చినట్లు బతకమను' అంటుందేమో!

'ఏంటయ్యా ఆలోచిస్తున్నారు' అన్నాడు నరసింహం. నేను వాస్తవంలోకి వచ్చాను.

'నువ్వే సురేష్‌ని అడగవచ్చు కదా!' అన్నాను.

అప్పుడు అసలు విషయం చెప్పాడు. అతని చెల్లెలు బాగా బొద్దుగానూ, నల్లగానూ కూడా ఉంటుందట. తనని చేసుకోవాలంటే ఎక్కువ కట్నం ఇస్తే తప్ప ఎవరూ ముందుకు రారట. అయినా తన చెల్లి అనాకారి కాదు అన్నాడు. నేను అడిగి చూస్తానన్నాను.

జయ అంగీకరించదుగాని ఈ దేశంలో ఎంతో మందికి పెళ్ళి అనేది ఓ కల. నరసింహం చెల్లెలు ఎలా ఉంటుందో నేను చూడలేదు. సురేష్ కంటే పెద్ద పదవిలో ఉన్నాను. అతన్ని ప్రభావితం చేయటం ఏంటని అనిపించింది. వెయ్యి అబద్ధాలు ఆడైనా ఓ పెళ్ళి చేయమన్నారు పెద్దలు. నేను చెప్పినంతలోనే సురేష్ ఒప్పుకుంటాడనేముంది!

నరసింహం ఓ రోజు ఆఫీస్‌కి తన చెల్లెల్ని తీసుకొచ్చాడు. సురేష్ ఆ అమ్మాయిని చూసేలా చేయగలిగాడు. ఆ తర్వాత నేనూ, సురేష్ కారులో వెళ్తున్నప్పుడు అడిగాను.

'నువ్వు పెళ్ళి చేసుకుంటే బాగుంటుంది సురేష్.'

అతను మాట్లాడలేదు. నేను సూటిగా విషయంలోకి వచ్చాను. 'మన నరసింహం చెల్లెల్ని చూశావుగా. ఆ అమ్మాయిని నీకు ఇచ్చి పెళ్ళి చేయాలని అతనికుంది' అన్నాను.

'నాకు పెళ్ళిచేసుకునే ఉద్దేశం లేదు సర్' అన్నాడు.

'ఆ అమ్మాయి లావుగా, నల్లగా ఉందనా?'

'అలాంటివాళ్ళూ మనుషులే కదా సర్' అన్నాడు.

'మీ ఊర్లో ఎవరైనా ఉన్నారా? నీకు బంధువులు లేకపోవచ్చు. మీ ప్రాంతం అమ్మాయినే చేసుకోవాలనుకుంటున్నావా?' అన్నాను.

'పెళ్ళి విషయం గురించి నేను ఆలోచించే స్థితిలో లేను. నరసింహం గారికి సారీ చెబుతున్నాను' అన్నాడు.



ఈ విషయం నరసింహానికి చెబితే నీరస పడిపోయాడు.

సురేష్ గురించి తెలుసుకోవాలనే పట్టుదల నాలో మొదలైంది.

●●●

మా సంస్థలో అనేక విభాగాలున్నాయి. గిరిజనులు, మహిళలు, రైతుకూలీల నుండి సాహితీ, కళారంగాల వరకు. జయకు కొన్ని రంగాలపట్ల ప్రత్యేకమైన ఆసక్తి ఉంది. అందుకే తనని ఓ విభాగానికి పరిమితం చేయకుండా ఎక్కడ అవసరం అయితే అక్కడకు పంపిస్తుంటాం.

ముఖ్యంగా చరిత్రకు అందని, మరుగునపడిన అంశాల గురించి శోధించటం జయకు ఇష్టం. ఆ నివేదికల ఆధారంగా ఫండ్స్ రిలీజ్ అవుతుంటాయి. మేం పుస్తకాలు ప్రచురిస్తుంటాం. సమాజంలో వివిధ పౌరలమధ్య ఉన్న అంతరాల నుండి, ప్రకృతికి మనుషులు చేస్తున్న హాని, వివిధ తెగలు, రకరకాల మనుషుల జీవన విధానాల గురించి మా పరిశీలన, అంచనాలు ఉంటాయి.

నేను జయతో...'మన ఎదురుగా ఓ స్పెసిమన్ ఉన్నాడు. అతను సురేష్. తన గురించి తెలుసుకోవాల్సి ఉంది' అన్నాను.

అతని గురించేనా, నన్ను గురించి కూడ తెలుసుకోవాలనుకుంటున్నారా? అంది నవ్వుతూ.

'ఇంకొకరు నీ గురించి తెలుసుకోవాల్సిన అవసరం లేదు. నిన్ను నువ్వే వ్యక్తపరుచుకుంటావు.' అన్నాను నేనూ నవ్వుతూ. నరసింహం చెల్లి విషయం చెప్పాను.

'ఆడవారే కాదు, మగవారు కూడా పెళ్ళి వద్దనుకుంటున్నారన్నమాట' అంది.

'అది ఎప్పటినుంచో ఉంది' అన్నాను.

ఇటీవల ఓ గ్రామంలో ఆడపిల్లల్ని పుట్టక ముందూ, పుట్టాక చంపేయటం ఎక్కువగా ఉంది. ఆ గ్రామాన్ని మేం పరిశీలించాలనుకున్నాం.

ఆ రోజు నేనూ, జయా ఆ గ్రామానికి ప్రయాణంలో ఉన్నాం. అంతకుముందే నేను ఓ వార్త చదివి ఉన్నాను. అప్పుడే పుట్టిన అబ్బాయిల్ని పొదల్లో వదిలేయటం జరిగింది. ఇదేదో కొత్తమార్పుకి ప్రారంభమా అనిపించింది. జయతో దారిలో ఆ విషయం గురించి మాట్లాడుతుంటే సురేష్ గంభీరంగా డ్రైవ్ చేస్తున్నాడు.

'ఏం సురేష్, నువ్వు కూడా ఈ విషయం మీద మాట్లాడవచ్చు' అన్నాను.

'డ్రైవింగ్ మీద కాన్‌సన్‌ట్రేట్ చేస్తున్నాను' అన్నాడు.

'పాటలు వింటూ డ్రైవ్ చేస్తున్నప్పుడు మాట్లాడటానికి ఏముంది' అంది జయ. సురేష్ మాట్లాడ లేదు.

ఆ తర్వాత సెక్స్ వర్కర్ల మీద మా సంభాషణ మొదలైంది. జయ 'అలాంటివారి జీవితానుభవాల మీద రెండు పుస్తకాలు తీసుకురావాలనుంది' అంది. అలాగే మూడో ప్రకృతికి చెందిన వారి గురించి కూడా. అలాంటివి వస్తున్నాయి కదా అన్నాను. అందరి అనుభవాలూ ఒకటి కాదు అంది.

స్త్రీలమీదే కాదు. ఇలాంటివారి మీద పురుష ప్రపంచం జరిపే దాడులు గురించి వెలుగులోకి తీసుకురావలసిన అవసరం ఉంది అని జయ వాదన.

అక్కడ కూడా ఓ మాఫియా ఉంది. ఈ మధ్య



డబ్బులు ఇవ్వలేదని రైల్లోనుండి బయటకు తోసేసిన ఓ యువకుడు చనిపోవడం గురించి చెప్పాను. మనం ఎప్పుడూ ఓ కోణం గురించి చెప్పటం కాదు సాధ్యమైనంత వరకూ అన్నింటినీ చర్చకు పెట్టాలి అన్నాను.

సురేష్ మాత్రం అలానే డ్రైవ్ చేస్తున్నాడు.

మనం ఓ అంశాన్ని వెలుగులోకి తేవాలనుకున్నపుడు నెగెటివ్ అంశాలను చెప్పాలా? అంది జయ.

ఈరోజు కాకపోతే రేపయినా చెప్పాలి. అసలు విషయం వారి బతుకుల్లో మార్పులు ఎలా వస్తాయి? ముందు ఆ విషయాలనుండి వారు బయటకు రావటానికి అడ్డుగా ఉన్న అన్నింటిమీదా యుద్ధం చేయాలి కదా' అన్నాను.

జయ మాట్లాడలేదు.

•••

ఆరోజు రాత్రి సురేష్ మా ఇంటికి వచ్చాడు.

నేను పదిరోజుల పాటు సెలవు తీసుకుంటాను.' అన్నాడు.

'మీ ఊరు వెళ్తున్నావా?' అన్నాను ఆశ్చర్యంగా.

సహజంగానే అతను మాట్లాడలేదు. 'తీసుకుందువు గాని' అన్నాను.

ఈరోజు ప్రయాణం పెట్టుకున్నాను' అన్నాడు. సరే అన్నాను.

అలా వెళ్ళిన సురేష్ పదిహేను రోజులైనా తిరిగి రాలేదు. అతనికి ఫోన్‌చేస్తే పనిచేయటం లేదు. ఏమై ఉంటాడో తెలియదు. అసలు వస్తాడో రాడో తెలియదు. టెంపరరీగా ఇంకో డ్రైవర్‌ని పెట్టుకున్నాం.

నాకు సురేష్ పూరించని పజిల్‌లా అనిపిస్తున్నాడు. ఎందుకో నాకు అతన్ని వెతకాలనిపించింది. ఎక్కడని వెతకటం? అతని రికార్డుల్లో ఆ ఊరిగురించి లేదు. ఇంతకుముందు మహారాష్ట్రలో ఉన్నట్లు ఉంది. ఆలోచిస్తుంటే ఇదేదో సినిమాకథలా అనిపించింది. ఇంతకీ అతను ఓ మాఫియా లీడర్ కాదు గదా. ఇక్కడ ఉంటూ అన్ని వ్యవహారాలూ రహస్యంగా జరుపుతున్నాడేమో. అజ్ఞాతంలో ఉంటూ ఇలాంటి పనులు చేసినవారి గురించి నేను విన్నాను.

దొంగనోట్లు, డ్రగ్స్, బంగారం స్మగ్లింగ్ వెనక, అటునుంచి రాజకీయనాయకులుగా ఎదిగినవారు ఉన్నారు. సురేష్ కూడా అంతేనేమో. దాదాపు రెండు నెలలు గడిచిపోయాయి. నరసింహం నాతో అన్నాడు 'మా చెల్లిని సురేష్ చేసుకోకపోవటమే మంచిదైంది సార్' అని.

అదేమోగాని సురేష్ ఏదో సంచలనం కలిగిస్తాడని నా అంతరంగం చెబుతోంది.

•••

సురేష్‌ని దాదాపు మరిచిపోయేంతగా పనిలో మునిగిపోయాం. అతనికి చెందిన మా సంస్థ పెండింగ్ శాలరీ అలానే ఉంది. అలాగే ప్రావిడెంట్ ఫండ్ ఉంది. అవయినా తీసుకోవటానికి రావచ్చు. కనీసం ఓ ఉత్తరం రాయవచ్చు. ఇలాంటివేం చేయలేదంటే సురేష్‌కి వచ్చే మొత్తం సొమ్ము అతనికి అవసరం ఉండకపోవచ్చు. సురేష్‌కి ఏదన్నా ప్రమాదం జరిగి చనిపోయాడేమోనని ఇంకో ఆలోచన వచ్చింది. ఏదీ అసంభవం కాదు కదా!

అలా మాత్రం జరగకూడదనుకున్నాను.

జయ కూడా సురేష్ ఏమైపోయి ఉంటాడు' అని రెండుసార్లు అడిగింది. తర్వాత ఎవరి పనిలో వారున్నాం.

అలాంటిది ఉదయం నేను పేపర్ చూస్తుంటే సర్ అని వినిపిస్తే చూశాను. ఎదురుగా సురేష్ కనిపించాడు.

'నువ్వా!... ఇన్ని రోజులు ఏమైపోయావు?' అన్నాను ఆశ్చర్యంగా.

చిన్న నవ్వు. మౌనంగా తలూపాడు.

'మళ్ళీ ఉద్యోగానికి వచ్చావా? మేం కొత్త డ్రైవర్‌ని అపాయింట్ చేసుకున్నాం. అయినా పర్వాలేదు. నేను కారు కొందామనుకుంటున్నాను. అంతగా అయితే నా దగ్గర పని చేద్దువు గాని' అన్నాను.

'మీతో మాట్లాడాలి' అన్నాడు.

•••

జయ, నేనూ ఉన్నాం.

మా ఎదురుగా సురేష్ ఉన్నాడు. అతను మాట్లాడేముందు తనని తాను సమాయత్తం చేసుకుంటున్నట్లు ఉన్నాడు.

**కర్ర ఉన్నవాడిదే గొర్రె, భూమి ఉన్నవాడిదే రాజ్యం. భూమికోసం, నాలుగు మెతుకుల కోసమే మనిషి నిత్య పోరాటం. ప్రత్యర్థి చేతికి దొరక్కుండా బంతిని పరుగెత్తించే క్రీడా పోటీలా భూమికోసం నిరంతరం పోరాటం సాగుతూనే ఉంది. భూమికోసం జరుగుతున్న ఈ ఆటలో ఆటవిక న్యాయం పాటించే అనాగరిక బలవంతులదే అనాదిగా పైచేయి. బతుకుచిత్రం బాగుపడాలంటే వారిని ఎదిరించే ఒక యోధుడు కావాలి. ఎవరతను?**

'పెళ్ళి చేసుకున్నావా సురేష్' అన్నాను నేను మొదలుపెట్టటానికి.

అతను తలెత్తి చూసి 'పెళ్ళి అనేది మాకు ఓ కల. అది మాకు అందుబాటులోకి రావటానికి ఎన్ని సంవత్సరాలు పడుతుందో' అన్నాడు.

జయ అతన్ని చిత్రంగా చూసింది.

'మీకు అంటే...' అని ఆగిపోయాను.

'మాకు అంటే మా గ్రామంలో ఉండే ఆడవారికి, మగవారికి కూడా' అన్నాడు. మేం ఆశ్చర్యంలో ఉండగా అన్నాడు.

'మాది ఉత్తరప్రదేశ్. లక్నోకి డెబ్బయ్ కిలోమీటర్ల దూరంలో మా ఊరు ఉంటుంది. అక్కడివారికి తండ్రి ఎవరో తెలియదు' అన్నాడు మెల్లగా. "మీరు ఇద్దరు మగపిల్లల్ని పొదల్లో పారేశారు అని చిత్రంగా అనుకున్నారు. అవి అక్రమసంబంధాల వల్ల పుట్టిన పిల్లల విషయం కావచ్చు. మా దగ్గర ఎప్పటినుంచో అలాంటివి ఉన్నాయి. మాకు ఆడపిల్ల పుడితేనే క్షేమంగా ఉంటుంది.' అన్నాడు.

నేనూ, జయా ఆశ్చర్యంతోనూ, ఆసక్తిగానూ వింటున్నాం.

'మీకు కొంతవరకు అర్థం అయి ఉంటుంది. మా ఊరిలో ప్రధానవృత్తి వ్యభిచారం. ఇది నాలుగు వందల సంవత్సరాలుగా సాగుతోంది. చివరికి అది కుటుంబ సంప్రదాయంగా మారింది.

'మీ ఊర్లో మగవాళ్ళు ఏం చేస్తుంటారు?'

'స్త్రీలు వ్యభిచరిస్తారు. మగవాళ్ళు వారిని తారుస్తారు. అందుకు వారు సిగ్గుపడరు. ఆడపిల్లకు పెళ్ళి చేయాలంటే అక్కడి కుటుంబంనుండి తీవ్రంగా వ్యతిరేకత వస్తుంది.'

'అంటే మీకు ఆస్తులంటూ ఉండవా!' అన్నాను.

అతను విరక్తిగా నవ్వాడు.

'మా స్త్రీల దేహాలే మా ఆస్తులు' అని తల దించుకున్నాడు. అతనికి తల దించుకోవటం అనే క్రియని ఆ గ్రామం నుండి బయటకు రావటంతో ఆధునిక సమాజం నేర్పినట్లుంది.

'అక్కడ భూమి ఉంటుంది కదా!' అంది జయ.

'ఉంటుంది. మేం అందరిలానే భూమి మీదే ఉన్నాం. అక్కడ భూములన్నీ జమీందార్లవి. మొత్తం డెబ్బయిశాతం మంది సెక్స్‌వర్కర్స్‌గా ఉన్నారు. భూస్వాములు బయటనుంచి కూలీలను పిలుచుకుంటారు. అక్కడ ఎవరికీ భూమి లేదంటే మీరు నమ్మగలరా' అన్నాడు.

"ఇన్ని సంవత్సరాల తర్వాత కూడానా!' అన్నాను.



అతను తలూపి,

'మా గ్రామం నుంచి కొంతమంది ముంబై వెళ్తారు. అక్కడనుంచి డబ్బుతోపాటు రోగాల్ని తీసుకొస్తారు. అసలు అలాంటిచోట్ల ఆ వాతావరణాన్ని భరించలేరు. రెడ్‌లైట్ ఏరియాల్లో దారుణ పరిస్థితులుంటాయి. అక్కడ బూతులు, శారీరకంగా పెట్టే హింసలను మా ఆడవాళ్ళు భరించలేరు. ఎప్పుడయితే వారికి రోగాలున్నాయని తెలిసిందో వారిని మా ఇళ్ళకు రానివ్వరు.' అని ఆగాడు కొద్ది క్షణాలు.

'మా చెల్లిని అలానే పంపించారు. తనకు ఎయిడ్స్ వచ్చింది. ఊరు నుండి తరిమేస్తే మా పొలి మేరల్లో ఆత్మహత్య చేసుకుంది. కనీసం దహన సంస్కారం చేయటానికి కూడా ఎవరూ ముందుకు రాలేదు. నేనే ఈ చేతుల్తో... అని దుఃఖం ముంచుకు రాగా భోరున ఏడుస్తుండిపోయాడు. సురేష్‌ని అలా ఏడవనిచ్చాం. కొంతసేపటికి తేరుకున్నాడు.

"పెళ్ళి గురించి మీ ఇద్దరూ మాట్లాడుకుంటుంటే వినేవాణ్ణి. ఏం మాట్లాడాలో అర్థం అయ్యేది కాదు. మా గ్రామ కథంతా మీకు చెప్పుకోవాలని అనిపించేది. కానీ గర్వంగా చెప్పుకోవడానికి ఏం కారణం ఉందని మా దగ్గర? ఇలాంటి కథల్ని ఇతరులనుంచి జాలి ఆశించటానికి చెప్పుకోవాలా? అది నాకు ఇష్టం లేదు. నరసింహంగారి చెల్లెల్ని పెళ్ళి చేసుకో అన్నారు. మా ఊళ్ళో మగవారు పెళ్ళి చేసుకోరు. మా ఆడపిల్లలకి పెళ్ళి జరగదు. ఇవన్నీ భరించలేని కొంతమంది మగవాళ్ళు బయటి గ్రామాలకు వెళ్తారు. అక్కడ అతికష్టం మీద చేసుకుంటారు. ఆ తర్వాత మా ఊరు చూడటానికి కూడా రారు.' అన్నాడు.

మేం నిట్టూర్చాం.

"సార్, మీరు అడిగారు, నరసింహంగారి చెల్లి లావుగా, నల్లగా ఉందని నువ్వు చేసుకోవటం లేదా అని. మా ఊరు వచ్చి ఆడపిల్లల్ని చూడండి. సహజమైన అందాలన్నీ వికృతం అయిపోయాయి. కొంతమందిని చూస్తే మీరు భయపడతారు. అయినా అలాంటివారు కూడా ఆడతనం వల్లనే నాలుగు ముద్దలు తినగలుగుతున్నారు.

కొన్ని వాస్తవాల గురించి వింటేనే శరీరం జలదరిస్తుంది. ఇంక దగ్గరనుండి చూస్తే అస్సలు తట్టుకోలేం.

"మా చెల్లి చనిపోయాక నేను ముంబై వెళ్ళిపోయాను. అక్కడ డ్రైవింగ్ నేర్చుకున్నాను. తర్వాత ఎవరో లైసెన్స్ ఇప్పించారు. అలా నేను ఇక్కడికి కొట్టుకొచ్చాను. మీరు బంధువులు ఎవరూ లేరా? అన్నప్పుడు, నరసింహంగారి చెల్లెల్ని చేసుకుంటావా! అన్నప్పుడు కదిలిపోయాను. నాకూ పెళ్ళి అవసరం అనిపించింది. ఆ అమ్మాయిని చేసుకోవటం నా అదృష్టం అనుకున్నాను. నిన్నటి జ్ఞాపకాలన్నీ మరిచిపోవటానికి ప్రయత్నం చేస్తుంటాను. నాకంటూ కొత్త బతుకు ఇక్కడ ఉంది. అయినా నా ఊరు గుర్తు వచ్చినప్పుడు, అక్కడి ఆడపిల్లలు గుర్తు వచ్చినప్పుడు నాకు పెళ్ళి చేసుకోవాలనిపించలేదు.' అని ఆగాడు.

అప్పుడే నరసింహం మా అందరికీ టీ తీసుకు వచ్చాడు. సురేష్‌ని కళ్ళతోనే పలకరించాడు.

# అక్షర దారి ఎటు?

ప్రస్తుతం విశ్వనటుడి రెండో కూతురు అక్షర డైలమాలో ఉందని కోలీవుడ్ జనాలు అంటున్నారు. బాలీవుడ్‌లో చేసిన మొదటి సినిమా అట్టర్‌ఫ్లాప్ కావడంతో సినిమాలకు అక్షర కొద్దిగా దూరంగానే ఉంటోంది. ప్రస్తుతం తండ్రి సినిమా 'శభాష్ నాయుడు'కి అసిస్టెంట్ డైరెక్టర్‌గా పనిచేస్తోంది. అక్షర ఇక నటననుంచి దర్శకత్వం వైపు మళ్ళుతుందేమో అని అందరూ అనుకున్నారు. అందరూ అనుకునే పని చేస్తే కమల్ కూతుర్ని ఎందుకవుతాను? అనుకుందేమో అజిత్ హీరోగా చేస్తున్న సినిమాలో ఓ రోల్ చేస్తోంది. హీరోయిన్‌గా కాకపోయినా మంచి ప్రాముఖ్యం ఉన్న పాత్రేనట! దాంతో అక్షర దారి ఎటు? అన్న అనుమానం చాలామందిలో కలుగుతోంది. ఈ విషయంలో అక్షర నోరు విప్పితే తప్ప నిజాలు బయట వారికి తెలియవు అంటున్నారు కొందరు.

అతని కళ్ళల్లో మళ్ళీ ఏదో ఆశ చిగురిస్తున్నట్లు అనిపించింది. తర్వాత సురేష్ చెప్పటం మొదలు పెట్టాడు.

'మా ఊరు వెళ్దాం అనుకున్నాను. ఓసారి చూసి రావాలనుకున్నాను. అక్కడకు వెళ్ళాక మాత్రం రాలేకపోయాను. అక్కడ మా అక్క లాంటి సూర్యలేఖ ఉంది. తను మా ఊర్లో స్కూల్ తెరిచింది. అక్కడ పిల్లలు చదువుకుంటున్నారు. ఇన్ని సంవత్సరాలుగా ఏ ప్రభుత్వం చేయని పని మా అక్క చేసింది. ఇప్పుడు కాలేజీ తెరవాలి. అదీ కేవలం ఆడపిల్లల కోసం. నేను ఇక్కడ ఉండటం కంటే అక్కడ అవసరం అనిపించింది. ఎప్పటి కప్పుడు మీ దగ్గరకు వచ్చి చెప్పాలనుకున్నాను. ఇప్పటికి కుదిరింది. నేను ఇక్కడ సంపాదించింది కొంత మొత్తమే అయినా అది మా గ్రామం కోసం కావాలి. నేను మా ఊరిని దత్తత తీసుకోవటం లేదు. నేను చాలా చిన్నవాడిని. నా కష్టంతో సంపాదించిన ఒక్క రూపాయి అయినా నా ఊరికి ఉపయోగపడాలి.' అన్నాడు.

అతన్లో ఎవరి మీదా కోపం లేదు. తనకు ద్వేషం లేదా అంటే ఉంది. అతని బాధ, దుఃఖం, ఆవేశం లాంటివి ఓ మౌనపోరాటంగా రూపుదిద్దుకుంటున్నాయి అనుకున్నాను.

"నువ్వు పెళ్ళి చేసుకోదలుచుకోలేదా? అన్నాను.

"చేసుకుంటాను. మా ఊరి అమ్మాయిని చేసుకుంటాను. ఆ అమ్మాయిని ఎన్నుకుంటాను. నాకు తోడూనీడగా ఉండటానికి కాదు. ఇద్దరమూ మాకు జన్మనిచ్చిన గడ్డ రుణం తీర్చుకోవాలి. మాలాంటి బతుకులు రేపటి తరానికి వద్దు. అందుకు మేం చేయగలిగింది చేయాలి. పెళ్ళి అందుకోసం అనుకుంటాను" అన్నాడు.

జయ సీరియస్‌గా ఆలోచిస్తోంది. తనకి ఏదో మార్గం దొరుకుతున్నట్లు, ప్రేమ అంటే ఏమిటో అర్థం అవుతున్నట్లు అనిపించింది. నా ఆలోచన ఎంతవరకు సరైందో నాకు తెలియదు.

నరసింహం అక్కడే ఉన్నాడు. అతనిలోనూ ఏదో మార్పు, ఏం చేయాలో అర్థం అవుతున్నట్లుగా!

సురేష్ నాలుగు రోజులున్నాడు. అతని పనులన్నీ పూర్తి అయ్యాయి. "మేం మీ గ్రామానికి వస్తాం సురేష్. మన ఆర్గనైజేషన్‌కి మా రిపోర్ట్ పంపిస్తాం. వీలయితే అక్కడ మన సంస్థ బ్రాంచ్ తెరవటానికి ప్రయత్నం చేద్దాం" అన్నాను.

అతను చిన్నగా నవ్వాడు.

"మంచిదే సర్! అయినా ఇలాంటి సంస్థలు కొంతమంది వ్యక్తులు బతకటానికి ఉపయోగపడతాయి. ఓ గ్రామాన్ని బాగు చేసుకోవాలంటే అది లోపలనుండి ప్రారంభం కావాలి. మీరు చాలా సమస్యల గురించి మాట్లాడుకుంటారు. నేను అలాంటివి ఉంటాయా? అవి సమస్యలా? అనుకునేవాణ్ణి. రేపు మేం కూడా ఇలాంటివి అనుభవించాల్సి రావచ్చు. ముందు మా అందరి ఆస్తులు, ముఖ్యంగా మా ఆడవారి శరీరాలు కాకుండా భూమి అని అర్థం చేసుకోవాలి. చదువు, భూమి...వీటికోసం ఓ మహా యుద్ధం చేయాలని నాకు తెలుసు. మూలాలు అవి. అవన్నీ సాధించుకునే క్రమంలో కొత్త సమస్యలు వస్తాయి. అప్పుడు మీలాంటి వారి సలహాలు తీసుకుంటాం. వస్తాను." అని చేతులు జోడించాడు.

సురేష్ ఇప్పుడు పజిల్‌లా అనిపించటం లేదు. క్లిష్టమైన తమ పజిల్‌ని పూరించే యోధుడిలా ఉన్నాడు.

**సెల్: 92465 73575**



# నీటితో ఆకలికి అడ్డుకట్ట

నీళ్ళు తాగడం వలన ఆకలికి అడ్డుకట్ట వేయవచ్చు అంటున్నారు నెదర్లాండ్ పరిశోధకులు. బాగా ఆకలి వేసినప్పుడు అదే పనిగా ఆహారం తీసుకోవడం కన్నా ఒకటి లేదా రెండు గ్లాసుల నీరు తాగితే ఆకలి ఆపుకోవచ్చన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది. నీరు తాగడం వలన కడుపు నిండుగా అనిపించి ఆహారం తీసుకోవాలన్న కోరిక నశిస్తుందని వీరు అంటున్నారు. భోజనం చేసే సమయంలో ఎక్కువ నీరు తాగడం వలన కడుపు నిండిందన్న సంకేతాలు మెదడుకు చేరి ఆకలికి అడ్డుకట్ట పడుతుందని వీరు చెబుతున్నారు. ఈ విధంగా నీరు ఎక్కువగా తాగడం వలన ఊబకాయ సమస్య నుంచి కూడా కొంతవరకు తప్పించుకోవచ్చని వారు అంటున్నారు. నీరు తాగడం వలన ఊబకాయ సమస్యను అధిగమించవచ్చు అన్న విషయాన్ని మాత్రం వీరు నిర్ధారించలేదు. నీరు ఎక్కువగా తాగడం వలన మెదడు క్రియాశీలత పెరుగుతుందన్నది నిజమని వీరు స్పష్టం చేస్తున్నారు. భోజనం మధ్యలో నీరు తాగడం కన్నా, భోజనానికి ముందూ, తరువాత ఒకటి రెండు గ్లాసుల నీళ్ళు తాగడం మంచిదని వీరు సూచిస్తున్నారు.




# సెల్ఫీతో మోచేతికి ముప్పు?



సెల్ఫీ తీసుకునే వారి మోచేతి ఆరోగ్యానికి ముప్పు ఎక్కువగా ఉంటుంది అంటు న్నారు అమెరికాలోని ఆరోగ్య నిపుణులు. సెల్ఫీ తీసుకునే సమయంలో మోచేతిని అటూ ఇటూ బాగా తిప్పడం వలన దానిపై అధిక భారం పడుతుం దని వారు చెబుతున్నారు. సెల్ఫీ తీసు కునే సమయంలో మోచేతి కండరాల మీద బరువు పడి ఆ ప్రాంతంలో వాపు కనిపిస్తుం దనీ దీన్ని నిర్లక్ష్యం చేస్తే తీవ్రమైన నొప్పి, ఇతర సమస్యలు తలెత్తే అవకాశం ఉందని వారు హెచ్చరిస్తున్నారు. ఫోన్లలో ఆటలు, ట్వీట్లు, మెసేజీలు పోస్ట్ చేయడం, సెల్ఫీలు తీసుకోవడం ఇవన్నీ కూడా మోచేతి ఆరోగ్యం మీద తీవ్ర ప్రభావాన్ని చూపిస్తా యని వారు చెబుతున్నారు. మోచేతి సమస్య నుంచి తప్పించుకోవ డానికి ఇటీవల కొందరు సెల్ఫీ స్టిక్‌తో సెల్ఫీలు తీసుకుంటున్నారు. ఇది ఎంతమాత్రం ఆమోదయోగ్యం కాదన్నది వారి వాదన. సెల్ఫీ ఎలా తీసుకున్నా దాని ప్రభావం తప్పకుండా మోచేతి మీద పడుతుందని హెచ్చరిస్తున్నారు. సెల్ఫీలు ఎక్కువగా తీసుకునే వారిలో మోచేతి దగ్గర కొద్దిగా వాపు కనిపించినా నిర్లక్ష్యం చేయకుండా వైద్యులను సంప్రదించాలనీ లేకపోతే తీవ్రమైన ఆరోగ్య సమస్యలను ఎదుర్కోవలసి వస్తుందనీ వారు హెచ్చరిస్తు న్నారు.

# సైక్లింగ్‌తో టైప్-2 డయాబెటిస్‌కు చెక్



సైక్లింగ్‌తో టైప్-2 డయాబెటిస్‌కు చెక్ పెట్టవచ్చు అంటున్నారు దక్షిణ డెన్మార్క్‌కు చెందిన పరిశోధకులు. ప్రతిరోజూ సైక్లింగ్ చేసే వారిలో టైప్-2 డయాబెటిస్ వచ్చే అవకాశాలు చాలావరకూ తగ్గుతాయన్న విషయం వీరి పరిశోధనల్లో వెల్లడైంది. 50 నుంచి 65 సంవత్సరాల వయస్సు కలిగిన యాభైవేల మంది స్త్రీ పురుషుల మీద వీరు సుదీర్ఘకాలం పరిశోధనలు నిర్వహించారు. వీరందరూ టైప్2 డయాబెటిస్ బాధితులే! వీరిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపుచేత క్రమం తప్పకుండా సైకిల్ తొక్కించారు. మరొక గ్రూపువారితో వారంలో ఒకటి రెండు సార్లు మాత్రమే సైకిల్ తొక్కించారు. కొన్ని నెలల అనంతరం వీరి ఆరోగ్య స్థితిని పరిశీలించగా క్రమం తప్పకుండా సైక్లింగ్ చేసిన వారిలో టైప్-2 డయాబెటిస్ తగ్గుముఖం పట్టగా, రెండవ గ్రూపు వారిలో ఎలాంటి మార్పు కనపడలేదు. అంతేకాకుండా మొదటి గ్రూపు వారి ఆరోగ్యం గతం కన్నా మెరుగుపడిన విషయాన్ని వీరు గమనించారు. కేవలం సైక్లింగ్ వలనే వీరిలో టైప్-2 డయాబెటిస్ తగ్గుముఖం పట్టిందా? అన్న విషయం మీద వీరు ఇంకా పరిశోధనలు నిర్వహిస్తున్నారు.

# నెట్ ఉపయోగిస్తే వ్యాధులు గ్యారంటీ

ఎప్పుడో ఒకసారి నెట్ ఉపయోగించేవారికి ఎలాంటి ఆరోగ్య నష్టం ఉండదనీ, తరచూ ఉపయో గించేవారిలో వ్యాధులు తలెత్తే ప్రమాదం ఎక్కు వగా ఉందనీ అంటున్నారు శాన్వి యూనివర్సిటీ పరిశోధకులు. నెట్‌ను ఎక్కువగా ఉపయోగించే వారిలో రోగనిరోధక శక్తి తగ్గుతుందనీ, దీని కారణంగా జలుబు, దగ్గు, జ్వరం వంటివి పట్టి పీడిస్తా యని వీరు చెబుతున్నారు. ఇలా వ్యాధుల బారిన పడుతున్న వారిలో పెద్దల కన్నా పిల్లల సంఖ్యే



అధికంగా ఉందని అంటున్నారు. అంతే కాకుండా స్త్రీలు, పురుషులనే తేడా లేకుండా వ్యాధుల బారిన పడుతున్న వారి సంఖ్య రోజురోజుకీ ఎక్కువ అవుతోందన్న సంగతి వీరి అధ్యయనంలో వెల్ల డైంది. నెట్ చూసేవారిలో ఒత్తిడి ఎక్కువగా ఉండడం వీరి దృష్టికి వచ్చింది. ప్రతిరోజూ కాకుండా వారంలో రెండు లేదా మూడు రోజులు మాత్రమే నెట్ ఉపయోగించేవారిలో వ్యాధుల సంఖ్య తక్కువగా ఉందన్న విషయాన్ని వీరు గమనించారు.

-అవినాష్

# మదరిండియా 7



-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**మీ నాన్నగారి ఆత్మ ఆనందిస్తుందో, క్షోభిస్తుందో నాకు తెలీదు. కనీసం సాకేత్, సంకేత్, నువ్వు - మీరు ముగ్గురైనా మన కుటుంబానికి తగిన సంబంధాలు చేసుకోవాలని ఆశపడుతున్నాను నిశితా! అంటూ గదిలో చెల్లాయితో అంటూంటే తను చెవులారా విన్నాడు.**

**'నీకు నచ్చని సంబంధం నేను చచ్చినా చేసుకోనమ్మా!' అంది నిశిత. సంకేత్ కూడా చేసుకోడు. సాకేత్ అన్నయ్య కూడా పెళ్ళి విషయంలో నిన్ను బాధపెట్టడు. పెద్దన్నయ్య పెళ్ళి విషయంలో నిన్ను ఎంత కష్టపెట్టాడో సాకేతన్నయ్యకు బాగా తెలుసు.." నిశిత అమ్మకు ధైర్యం చెప్పింది.**

"సాకేత్ చిన్నప్పట్నుంచీ... ఒక రకంగా మెతకే. నవ్వులాటకు కూడా నా మాట కాదనలేడు వాడు!" అమ్మ తృప్తిగా అంది.

తాను అమెరికా అమ్మాయిని ప్రేమిస్తున్నాననీ, పెళ్ళి చేసుకుంటానన్నాననీ తెలిస్తే అమ్మ ఏమంటుంది. అమ్మ ఏమైపోతుంది?

సాకేత్ ఆలోచనలను చెల్లాచెదురుచేస్తూ, డోర్‌బెల్ మోగింది. నోనా వచ్చిందా? - తనను ప్రశ్నించుకుంటూ వెళ్ళి తలుపు తెరిచాడు సాకేత్. తన ఊహ నిజమే. గుమ్మంలో నిలుచుని చిరునవ్వు నవ్వుతోంది నోనా.

"హై హనీ!"

"డార్లింగ్..." అంటూ నోనా లోపలికి వచ్చింది.

సాకేత్ తలుపు మూసి, నోనా వైపు తిరిగాడు. "మన ట్యూషన్‌కి ఇంకా అరగంట టైముంది! నేనే

వచ్చేవాణ్ణిగా!"

"ఇవాళ ట్యూషన్‌కి సెలవ్!" నోనా నవ్వుతూ ఇంగ్లీషులో అంది. సాకేత్ చిరునవ్వుతో చూశాడు.

"ఇవాళ తెలుగుపాఠం వద్దు.." సాకేత్ చూపుల్ని అర్థం చేసుకున్న నోనా నవ్వుతూ తెలుగులో అంది.

"స్టూడెంటంటే అలా ఉండాలి!" సాకేత్ మెచ్చుకున్నాడు.

నోనా చేతిని పట్టుకుని నడిపించుకు వెళ్ళి సోఫాలో కూచోబెట్టి, ఎదురుగా కూచున్నాడు.

నోనా ప్రశ్నార్థకంగా చూసింది. ఆ చూపులు వేస్తున్న ప్రశ్న సాకేత్‌కి అర్థమైంది.

"ఎదురుగా కూచుని, నిన్నుచూడ్డం నాకిష్టం!" అన్నాడు చిరునవ్వుతో.

"చూశావుగా... రా... ఇక్కడ... ఇక్కడకూర్చో!" తన పక్కన సోఫామీద చేత్తో, తడుతూ అంది నోనా.

సాకేత్ లేచి, ఆమె పక్కన కూచున్నాడు. నోనా తలని అతని భుజం మీదకి వాల్చింది. ఆమె పెదవులు అతని చెవి దగ్గరగా కదిలాయి.

"సాకేత్.. మన ప్రేమను... నేను మోస్తున్నాను.." నోనా కంఠం గుసగుసగా అంది.

సాకేత్ అర్థం కానట్టు చూశాడు. "ప్రేమను మోయడమేంటి నోనా?"

"ఇక్కడ..." అంటూ నోనా తన కడుపు మీద అతని అరచేతిని ఉంచుతూ అంది.

"నోనా!" సాకేత్ ఆశ్చర్యంగా అరిచాడు.

"యస్ డార్లింగ్... మన శాన్‌ఫ్రాన్సిస్కో ప్రణయం ఫలించింది! ఇందాకే డాక్టర్ కన్‌ఫర్మ్ చేసింది!"

ఏదో అర్థం కాని ఆనందం సాకేత్ శరీరాన్ని ఆవరించింది. నోనాని తన చేతుల్లో బంధించి ఆమె బుగ్గమీద చుంబిస్తూ ఉండిపోయాడు.

"డార్లింగ్... నేనూ నువ్వూ తల్లీ, తండ్రీ కాబోతున్నాం... ముందుగా భార్యాభర్తలుగా అయిపోవాలి! వెంటనే పెళ్ళి చేసుకుందాం. హిందూ స్టయిల్ వెడ్డింగ్! ఓకే?" నోనా కొంచెం దూరంగా జరిగి సాకేత్ మొహంలోకి చూసింది.

సాకేత్ మౌనంగా చూశాడు. అతని గుండె ఒక్కసారి లయతప్పి వేగంపెంచి కొట్టుకో సాగింది. పెళ్ళి. నోనాతో పెళ్ళి. విదేశీ యువతితో పెళ్ళి. అమ్మ అంగీకారం.. సాకేత్‌లో ఆలోచనలు తారాజువ్వల్లా దూసుకెళ్తున్నాయి. ఏంచేయాలి? అమ్మకి ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి?

"డార్లింగ్.. ఏమిటి ఆలోచిస్తున్నావ్?" నోనా అతన్ని చూస్తూ అంది. ఈజ్ సమ్‌థింగ్ రాంగ్?"

సాకేత్ నోనావైపు వెర్రివాడిలా చూశాడు. మెల్లిగా అతని పెదవులు కదిలాయి.. "నో.."

"అయితే నాన్నతో మాట్లాడుతాను.." నోనా అంది.

సాకేత్ నిట్టూర్చాడు. నోనా తండ్రితో మాట్లాడ గలదు. అనుకున్నది చెప్పగలదు! కావాల్సింది తీసుకోగలదు! చెప్పి చేయించుకో గలదు! తనకి ఆ అవకాశం లేదు! తను అమ్మకి చెప్పలేడు. అమ్మని అడగలేడు! చెప్పి చేయించుకోలేడు. సాకేత్ ఆలోచిస్తూ అద్దం ముందుకు నడిచాడు. నిస్సహాయంగా చూస్తున్న ప్రతిబింబాన్ని జాలిగా చూశాడు. ప్రతిబింబం పక్కన క్యాలెండర్ అస్తవ్యస్తంగా కనిపిస్తోంది. క్యాలెండర్! సాకేత్ మెదడులో ఏదో మెరిసింది.

"డార్లింగ్..."

సాకేత్ నోనా వైపు తిరిగాడు.

"యూఆర్ డిస్టర్బ్‌డ్!" నోనా అయోమయంగా చూస్తూ అంది.

"యస్.. నోనా.. డిస్టర్బ్ అయ్యాను" సాకేత్ సాలోచనగా అన్నాడు. "మా సంప్రదాయం ప్రకారం పెళ్ళి జరగాలంటే ముహూర్తం ముఖ్యం. ఈ నెలలో పెళ్ళిళ్ళు జరగవు, ఇండియాలో. వచ్చేనెల దాకా ఆగాలి..." ఆపద మనిషికి అబద్ధాలు నేర్పుతుంది!

"అలాగా..." నోనా నీరసంగా అంది.

"యస్ నోనా.. ముహూర్తం లేకపోతే పెళ్ళి జరగదు. అమ్మ ఒప్పుకోదు.. అమ్మగురించి నీకు చెప్పానుగా. షీ ఈజ్ రిమార్కబుల్ లేడీ.."

"అయితే ఒక నెల ఆగాలా?" నోనా అడిగింది.

"అంతే... ఓన్లీ ఫోర్‌వీక్స్!" సాకేత్ తేలిగ్గా అన్నాడు. "నోనా.. ఈ డెవలప్‌మెంట్ మీ నాన్నకి తెలుసా?"

"ముందు నీకు చెప్పాలనుకున్నాను. నాన్నకు చెప్తే... రేపే పెళ్ళి జరిగిపోవాలంటాడు.. ఎలా?" నోనా ఆలోచిస్తూ అంది.

"ఒక్క నాలుగు వారాలు ఆయనకి తెలీకుండా ఉంచుదాం.. ఏం?" సాకేత్ అన్నాడు.

"సాకేత్ ఇలారా. నా దగ్గరగా కూర్చో!" నోనా అంది. సాకేత్ ఆమె పక్కనే కూచున్నాడు.

"నోనా... మీ నాన్నకు ఇప్పుడే చెప్పేయాలా?"

"అవసరం లేదు. పెళ్ళి ఫిక్సయ్యాక చెప్తాను. నాన్న నన్ను అర్థం చేసుకుంటాడు. నాన్న నన్ను మనసుతో గానీ, మాటతో గానీ బాధపెట్టడు!"

సాకేత్ తేలిగ్గా నిట్టూర్చాడు. నాలుగు వారాలు.. ఆ వ్యవధిలో తాను ఏదో చేయాలి... ఏం చేయాలో, ఎలా చేయాలో ఆలోచించాలి.

'సాకేత్, ఇవాళ ఇక్కడే నీతో ఉంటాను.. ఓకే?" నోనా అతని ఒళ్ళో తలపెట్టి పడుకుంటూ అంది.

"ఇంతవరకూ నువ్వు ఇక్కడ నైట్‌హాల్ట్ చేయలేదు. మీ నాన్న ఏమైనా అనుకుంటారు. హోటల్ కెళ్దాం. భోం చేద్దాం. నిన్ను మీ బంగళాలో డ్రాప్ చేస్తాను!" అన్నాడు సాకేత్ ఆమె తల నిమురుతూ.

●●●

నాలుగు వారాలు ఇట్టే గడిచిపోయాయి. నోనా పెళ్ళి ప్రస్తావన తెచ్చింది.

"డార్లింగ్... పెళ్ళి ప్లాన్ చేశావా?"

తనని ఆనుకుని కూర్చున్న నోనా నుండీ కొద్దిగా దూరం జరిగి, సోఫాలోంచి లేచాడు సాకేత్. అడుగులో అడుగు వేసుకుంటూ కిటికీ ముందుకు నడిచాడు.

"సాకేత్..."

సాకేత్ మెల్లగా వెనుదిరిగి, నోనా వైపు చూశాడు. తను నిర్ణయం తీసుకోడానికి నెల సమయం పట్టింది. ఆ నిర్ణయాన్ని మూడు ముక్కల్లో నోనాకి చెప్పాలి. ఆమె రియాక్షన్‌ని తట్టుకోవాలి. అయినా తప్పదు. తన పెళ్ళి విషయంలో తాను పూర్తిగా నిస్సహాయుడై పోయాడు.

"సాకేత్..." నోనా మళ్ళీ హెచ్చరించింది.

"నోనా.. నెల నుంచీ ఆలోచిస్తున్నాను. నీకు ఎలా చెప్పాలా అన్న ఆలోచనతో నాలో నేను నరకయాతన పడుతున్నాను.." సాకేత్ మెల్లిగా అడుగులు వేస్తూ, నోనా ముందు ఆగాడు. క్షణకాలం ఆమె కళ్ళల్లోకి చూసి, వీపు ఆమె వైపు తిప్పాడు.

"అయాం సారీ నోనా! మన పెళ్ళి జరగదు"

"వ్వాట్?" నోనా కంఠం పిస్టల్ షాట్‌లా ధ్వనించింది.

మరుక్షణం నోనా చేతులు అతని భుజం మీద వాలాయి. విసురుగా అతన్ని తనవైపు తిప్పుకుందామె. ఆశ్చర్యం నిండిన గిన్నెల్లా ఉన్న కళ్ళతో అతని ముఖంలోకి చూసింది.

"ఆర్‌యూ జోకింగ్?"

సాకేత్ గుటకలు మింగాడు. "నో... నోనా.. మన పెళ్ళి... నేను నిన్ను పెళ్ళి చేసుకోలేను.."

"ఆర్ యూ క్రేజీ?!" నోనా అరిచింది. "ఎందుకు?"



"సారీ నోనా కారణం చెప్పలేను.."

"సాకేత్.. దిసీజ్ మ్యాడ్‌నెస్! నా గర్భంలో ఉన్న నీ ప్రతిరూపానికి సమాధానం ఏంచెప్తావ్?" కమాన్ ఆన్సర్ మీ!" నోనా అరిచింది.

"ఆ విషయం గురించి చాలా ఆలోచించాను... నీకు యించు సేఫెస్ట్ సలహా ఇస్తాను. అబార్షన్ చేయించుకో. నన్ను మరిచిపో.."

నోనా కళ్ళు అగ్నిగోళాల్లా అయ్యాయి. రెప్పలు వేయకుండా చూస్తున్న ఆ కళ్ళు క్షణంలో తడిగా మెరిశాయి. నోనా నీరసంగా సోఫాలో కూచుంది..

"నోనా... అయాం రియల్లీ సారీ... నన్ను క్షమించు. జరిగిన దాన్నంతటనీ అబార్షన్ చెరిపేస్తుంది..."

నోనా పెదవులు అదిరాయి. "యూ బ్రూట్..."

"యస్, ఈ బ్రూట్‌ని రెచ్చగొట్టింది నువ్వే!" సాకేత్ ఆమెవైపు వెటకారంగా చిరునవ్వు రువ్వి గుమ్మం వైపు నడిచాడు.

"సాకేత్!" నోనా బిగ్గరగా అరిచింది.

సాకేత్ ఆగలేదు. ఆమెవైపు తిరిగి చూడలేదు. అతన్ని దూరం చేస్తూ, తెరుచుకున్న తలుపు మూసుకుంది.

నోనా కన్నార్పకుండా పిచ్చిదానిలా, చలనం లేకుండా అలాగే కూచుండి పోయింది. ఇండియన్ కల్చర్ మీద వ్యామోహం తనను ఇలా బలి తీసుకుందా? నిజమే... సాకేత్ అనే బ్రూట్‌ని రెచ్చగొట్టింది తనే! అర్హత లేనివాణ్ణి సెలెక్ట్ చేయించి ఉద్యోగం ఇప్పించింది తనే! అర్హత లేనివాడిని ప్రేమించి, తనని తాను అర్పించుకున్నదీ తనే! ఆ ఫలితాన్ని గర్భంలో మోస్తోందీ తనే!

●●●

సాకేత్ భయపడుతూ, భయపడుతూ ఆఫీసులో అడుగు పెట్టాడు. అందరూ మామూలుగానే విష్‌చేశారు. ఉద్యోగం ఊడగొట్టి ఉద్వాసన చెబుతారేమో అన్న ఆందోళన రాత్రంతా అతనికి నిద్రలేకుండా చేసింది. అయితే ఆఫీసు వాతావరణం రోజూ ఉన్నట్టే ఉంది. బహుశా ఎం.డి. క్రేమర్ స్వయంగా....

సీట్లో కూచున్న పావుగంటలో సాకేత్‌కి క్రేమర్ నుంచీ పిలుపు వచ్చింది. 'గుడ్‌బై టు ఇండమెరికా ఇన్‌వెస్టర్స్!' అనుకుంటూ క్రేమర్ చాంబర్‌లోకి వెళ్ళాడతను. క్రేమర్ మామూలుగానే ఉన్నాడు. ముఖం ప్రశాంతంగానే ఉంది. అరగంట పాటు ఆఫీసు విషయాలు మాట్లాడి, వెళ్ళమన్నాడు క్రేమర్.

నోనా.. తండ్రికి ఏమీ చెప్పినట్టులేదు. చెబితే ఒకేసారి ఆయనకి రెండు షాకింగ్ వార్తలు చెప్పాలి. మొదటిది తాను గర్భవతి అనే వార్త. రెండోది గర్భాన్నిచ్చిన సాకేత్ పెళ్ళి చేసుకోనంటున్నాడన్న వార్త. నోనా దృష్టిలో తండ్రికి తెలియజేయడం సాహసం కావచ్చు. నోనా ఏం చేస్తుంది. తనిచ్చిన ఉచిత సలహా పాటిస్తుందా?

సాకేత్ తన కుర్చీలో కూచున్నాడు. ఆలోచనలతో తలబద్దలయ్యేలా ఉంది. పని చేయాలనిపించడం లేదు. నోనా ఎలా రియాక్టవుతుంది? తన మీద పగ తీర్చుకోదా? మన్నించి, మరిచిపోతుందా? అతన్ని ఆలోచనల నుండి దూరంగా లాగుతూ ఇంటర్‌కమ్ మోగింది. సాకేత్ రిసీవరందుకున్నాడు. లైన్లో క్రేమర్.

"సాకేత్ లేటెస్ట్ డెవలప్‌మెంట్. అర్జెంటుగా నువ్వు గోవా వెళ్ళాలి. అమెరికన్ డెలిగేట్స్ వస్తున్నారు. రాత్రికే వాళ్ళు నిన్ను మన గెస్ట్‌హౌస్‌లో కలుసుకుంటారు. నువ్వు గోవా చేరేసరికి సబ్జెక్టు డీటెయిల్డ్‌గా నీ మెయిల్లో ఉంటుంది. స్టడీచేసి, వాళ్ళతో డిస్కస్ చెయ్. నాతో టచ్‌లో ఉండు. వెంటనే బయల్దేరు!"

"అలాగే సర్!" అంటూ సాకేత్ పైకి లేచాడు.

●●●

సాకేత్ వారం రోజుల తర్వాత గోవా నుండి తిరిగొచ్చాడు. తిన్నగా ఆఫీసుకి వెళ్ళి, గోవా కాన్ఫరెన్స్ విషయాలు వివరించాడు. చక్కగా డీల్‌చేశావంటూ క్రేమర్ అతన్ని మెచ్చుకున్నాడు. ఇంటికెళ్ళి విశ్రాంతి తీసుకోమన్నాడు.

**పెళ్ళి ఏర్పాట్లు చేయమని ఒత్తిడి చేయడం ప్రారంభించిందామె. కానీ కుంటిసాకులతో తప్పించుకోవడానికి అలవాటుపడ్డాడతను. మన ప్రణయం ఫలించి ఆకారం రూపుదిద్దుకుంటోందని ఆమె చెప్పిన మాట అతడికి భయం పుట్టించింది. పెళ్ళి సాధ్యం కాదు, అబార్షన్ చేయించుకో అని స్పష్టంగా చెప్పేశాడామెకు. అప్పుడామె ఎలా రియాక్ట్ అయింది? పోలీసులకు ఫిర్యాదు చేసిందా? అతడి జీవితం రోడ్డున పడిందా?**

సాకేత్ విశ్రాంతిగా సోఫాలో కూచుని, టీవీ ఆన్ చేశాడు. కోటులో దాక్కున్న అమ్మాయి తెలుగులో వార్తలు చదువుతోంది. ప్రేమాయణం సాగించి, గర్భవతిని చేసిన ప్రియుడు పెళ్ళి నిరాకరించడంతో ప్రియురాలు ఆత్మహత్య. విశాఖపట్నంలో జరిగిన సంఘటన గురించి - న్యూస్‌రీడర్ చెప్పుకుపోతోంది. వార్త సాకేత్‌కి వెంటనే నోనాను గుర్తుకు తెచ్చింది. యువతి మరణానికి కారకుడైన యువకుడిని, అమ్మాయి ఆత్మహత్య లేఖ ఆధారంతో పోలీసులు అరెస్టు చేశారు. డిస్టర్బింగ్ న్యూస్...

డోర్‌బెల్ మోగింది. సాకేత్ గుండె దడదడమంది. ఎవరై ఉంటారు? నోనా ఏదైనా అఘాయిత్యం చేసిందా? పోలీసులా? టీవీని బంద్‌చేసి సాకేత్ లేచి వెళ్ళి తలుపు తెరిచాడు. గుమ్మంలో నిలుచున్న వ్యక్తిని నిర్ఘాంతపోతూ చూశాడు.

గుమ్మంలో నిగమ!

"అమ్మా..."

నిగమ మాట్లాడకుండా లోపలికి వచ్చింది. సాకేత్ తలుపు మూసి అమ్మ వైపు తిరిగాడు. నిగమ హాలు మధ్యకెళ్ళి నిలుచుంది.

"అమ్మా... సడన్‌గా... వచ్చావ్? ఎలావచ్చావ్? ఎందుకు?"

"సాకేత్..." అతని ప్రశ్న పూర్తికాకుండా నిగమ అడ్డు తగిలింది.

'నీకు బైబిల్‌లోని ప్రాడిగల్ సన్ కథ గుర్తుందా? ఆ కథలో చెడిపోయిన కొడుకు లోకంలో తిరిగి తిరిగి, చివరికి తండ్రి వద్దకే తిరిగొస్తాడు. అది ఆనాటి ప్రాడిగల్ సన్ కథ. ఇది ఈనాటి కథ. ఇందులో ప్రాడిగల్ సన్‌ని వెతుక్కుంటూ తల్లి వస్తుంది! వచ్చాను; నిన్ను వెతుక్కుంటూ!

"అమ్మా..."

"యూ ఆర్ లవ్-ప్రాడిగల్. ప్రేమను దుబారా చేశావు.



## ఆమెకూ ఓ బాయ్‌ఫ్రెండ్ దొరికాడు

శ్వేతాబసు... గుర్తుందా... మొదటి సినిమాతో ఎక్కడికో వెళ్ళిపోతుందని సినీ పండితులు లెక్కలు కట్టి మరీ జోస్యం చెప్పారు. వారి జోస్యం తల క్రిందులుచేస్తూ శ్వేతా సెక్స్ రాకెట్ కేసులో ఇరుక్కుని నానా తిప్పలు పడి బయటపడింది. ఆమె కేసు నుంచి బయటపడిన సమయంలో చాలామంది ఆమెతో సినిమా చేస్తామని చెప్పారు. అవేవీ నిజం కాలేదు. ముంబాయిలోని ఓ ఫిల్మ్ మేకర్ ఆఫీసులో స్క్రిప్ట్ రైటర్‌గా నిలదొక్కుకున్న శ్వేతాకు తాజాగా ఓ బాయ్‌ఫ్రెండ్ దొరికాడట! అతడు షార్ట్ ఫిలిమ్ మేకర్ అట! ఇద్దరి అభిప్రాయాలూ, అభిరుచులూ కలవడంతో ఇద్దరూ డేటింగ్‌లో ఉన్నారన్న వార్త బాలీవుడ్‌లో తెగ షికారు చేస్తోంది. మొత్తానికి చాలా రోజుల తరువాత శ్వేతాకు సంబంధించిన వార్త బయటకు రావడం అందరినీ తెగ ఆకర్షించిందట! అయితే ఈ విషయంలో శ్వేతా ఇంత వరకూ నోరు విప్పలేదు.

# అప్పుడేమో అలా... ఇప్పుడేమో ఇలా...



కొందరు చాలా తేలికగా మాటలు మార్చేస్తుంటారు. సరిగ్గా ఈ కోవకే చెందుతుంది తాప్సీ. దక్షిణాదిన గ్లామర్ రోల్స్ చేసినంత కాలం నోరు మెదపని తాప్సీ బాలీవుడ్‌కి వెళ్ళిన తరువాత దక్షిణాది మీద విమర్శనాస్త్రాలు సంధిస్తోంది. ఒక్కోసారి ఒక్కొక్క సరికొత్త ఆరోపణలు చేస్తున్న తాప్సీ ఈ సారి దక్షిణాది సినీ పరిశ్రమ తనలోని టాలెంట్‌ను గుర్తించకుండా కేవలం గ్లామర్ పాత్రలకే పరిమితం చేసిందంటూ ఆరోపించింది. ఉత్తరాదివారు మాత్రమే తనలోని గ్లామరును కాకుండా టాలెంట్‌ని గుర్తించారని చెబుతోంది. గ్లామర్ పాత్రలు చేసినంత కాలం నోరుమెదపని తాప్సీ ఇప్పుడు ఇలా మాట్లాడడం విడ్డూరంగా ఉంది అంటున్నారు సినీ జనాలు.

ప్రేమను చవగ్గా చూశావు!"

సాకేత్ కొద్దిగా తలదించుకున్నాడు. "అమ్మా... కూచోమ్మా... మంచినీళ్ళు..."

"నీ ఆతిథ్యం కోసం నేను రాలేదు!" నిగమ నిష్కర్షగా అంది. "దాపరికానికి తావులేకుండా, దాపరికాన్ని దరిదాపులకు రానీకుండా జీవిస్తూ, మిమ్మల్ని అలాగే పెంచాను. దాపరికం అనేది తెలీని తల్లి నుండి నువ్వు చాలా దాచావు?"

"అమ్మా... అది..."

"ఆగు!" నిగమ గద్దించింది. "ముందు నీకు ఉద్యోగం ఎలా వచ్చిందో చెప్పు! నీ ప్రతిభ నీకు పట్టం కట్టిందా? నిజం చెప్పు! నీ అర్హత నీకు ఉద్యోగాన్ని సంపాదించి పెట్టిందా?"

"అమ్మా... అది..."

"నాన్చొద్దు. నాకు కావాల్సింది నిజం!"

"నా టాలెంట్‌మీద నాకు... ఉద్యోగం రాలేదు.." సాకేత్ తల దించుకుని అన్నాడు.

"నీకు ఒక మైనస్ మార్కు వేస్తున్నా!"

సాకేత్ తలఎత్తి ఆశ్చర్యంగా చూశాడు.

"సాకేత్, నీ ప్రతిభనూ, స్థితినీ, కుటుంబ నేపథ్యాన్నీ, తల్లినీ, తండ్రినీ, నీ జాతీయతనూ విస్మరించి, నీకు ఉద్యోగం ఇప్పించిన విదేశీ యువతికి నీ ప్రేమను లంచంగా ఇచ్చావు!"

"అమ్మా!"

"ముందు వెనుకలు ఆలోచించకుండా ఆ పిల్లను ప్రేమిస్తున్నట్టు నటించావు..."

"అది... అది.. నటన అని అప్పట్లో..."

"నీకు రెండో మైనస్ మార్కు వేస్తున్నాను!" నిగమ కంఠం ఖంగుమంది.

"నిజం చెప్పాలంటే నువ్వు ప్రేమను నటించావు. నోనాను నమ్మించావు. నమ్మకద్రోహం చేశావు! నీకు మూడో మైనస్ మార్కు వేస్తున్నాను!"

"అమ్మా... ప్లీజ్... నేను అంతా నీకు వివరంగా చెప్తాను... ఎందుకు జరిగిందో.."

"షటప్!" నిగమ అరిచింది. "ఇది కోర్టు విచారణ కాదు. నీ వాదన వినడానికి. ఇది కోర్ట్ మార్షల్! కొంగుచాటున రక్షిస్తూ పెంచిన తల్లి చేస్తున్న కోర్ట్‌మార్షల్‌రా ఇది! వ్యక్తిగత ధర్మానికీ, సామాజిక ధర్మానికీ, వైవాహిక ధర్మానికీ, చట్టానికీ సమాధికట్టి, ఆత్మసాక్షిని ఆవలకు నెట్టి మనసిచ్చిన పిల్ల శరీరాన్ని వివాహ పూర్వ సంబంధంతో మలినం చేశావు.."

"అది... అది... నా ఒక్కడి... తప్పుకాదు.." సాకేత్ తలవాల్చుకుంటూ అన్నాడు.

"నోనా అమెరికా పిల్ల. నీ జాతీయధర్మం తనకి తెలీదు. నువ్వు ఆమెకి తెలియజెప్పలేదు. బలహీనత నీది. ఆ నేరం నీదే! వివాహ పూర్వసంబంధంతో ఆ పిల్లను గర్భవతిని చేశావు. ఈ పాపానికి ఎన్నిమైనస్ మార్కులు వేయమంటావు?" నిగమ హుంకరించింది. "అందుకున్నావు. ఆకలితీర్చుకున్నావు. ఆకలి తీరాక అన్నం పాత్రను తన్నేశావు".

తన కళ్ళల్లోకి నిప్పులు కక్కుతున్న తల్లి కళ్ళల్లోకి చూడలేక సాకేత్ నేల చూపులు చూశాడు.

"ప్రేమను తీసుకున్నావు. కామం తీర్చుకున్నావు. పెళ్ళి అనగానే వెళ్ళమన్నావ్. మైనస్ మార్కులెన్ని?" నిగమ హూంకరించింది. "అన్నింటి కన్నా దారుణంగా అబార్షన్ సలహా ఇచ్చావు! నీ సలహా గురించి తెలియగానే నాకు ఏమనిపించిందో తెలుసా?"

సాకేత్ మౌనంగా చూశాడు.

"నువ్వు నా గర్భవాసాన పడినప్పుడు నేను ఎందుకు అబార్షన్ చేయించుకోలేకపోయానా?" అనిపించింది.

"అమ్మా.."

"ఇలా దగ్గరగా రా!" నిగమ ఆజ్ఞాపించింది.

సాకేత్ తల్లి ముందుకు నడిచి, తలవాల్చి నిలబడ్డాడు.

"తల ఎత్తు! నా మొహంలోకి చూడు!" నిగమ గర్జించింది.

సాకేత్ తలెత్తి తల్లి ముఖంలోకి చూశాడు. నిగమ కుడిచెయ్యి పాము పడగలా చివాల్న కదిలింది. సాకేత్ చెంపమీద ఛెళ్ళుమంటూ చప్పుడు చేసింది. సాకేత్ అసంకల్పితంగా చెంపను తడుముకుంటూ, కళ్ళు దించుకున్నాడు.

"వెళ్ళి తలుపు తెరు!" నిగమ హూంకరించింది.

సాకేత్ మెల్లగా వెళ్ళి తలుపు తెరిచాడు. ఎదురుగా నోనా. ఆమె పక్కనే నిశిత...

నిశిత అతని చూపుల్ని నిర్లక్ష్యం చేస్తూ నోనా చెయ్యి పట్టుకుని లోపలికి నడిచింది. సాకేత్ తలుపు మూసి, బలహీనంగా తలుపుకి వీపు ఆన్చి నిలుచున్నాడు. నిగమ కొడుకు వైపు హీనంగా చూసింది.

"సాకేత్! అమెరికా అమ్మాయి అయి ఉండి కూడా నోనా ఏమీ చేయలేదు తెలుసా? నువ్వు చేసిన ద్రోహం గురించి తండ్రికి చెప్పి, నిన్ను హత్యచేయించలేదు! కనీసం నీ ఉద్యోగం పీకించలేదు! చట్టాన్ని ఆశ్రయించి నిన్ను జైల్లో పెట్టించలేదు! ప్రెస్‌మీట్ పెట్టి, మీడియా ముందు నీ పరువు తీసివేయలేదు! నీ ప్రతాపం వివరిస్తూ ఉత్తరం రాసిపెట్టి ఆత్మహత్య చేసుకోలేదు!

"ఏం చేసిందో తెలుసా? నీలాంటి కొడుకును కని లోకం మీదికి వదిలేసిన కన్నతల్లిని - నిన్ను కన్నతల్లిని కలుసుకుంది. నీ నిర్వాకాన్ని ప్రశ్నగా మార్చి నా ఒళ్ళోకి విసిరింది! సమాధానం చెప్పమంది! 'నీ కడుపున పుట్టినవాడు నన్నిలా చేశాడు. నా కడుపున పుట్టబోయే వాణ్ణి నేనేం

చేయాలి?' అని నన్నడిగింది!"

సాకేత్ మళ్ళీ కళ్ళు దించుకున్నాడు.

"నువ్వు తప్పు చేశావు. కన్నతల్లికూడా క్షమించలేని తప్పు అది! జన్మించకుండానే, నోనా గర్భంలో నువ్వు పొదిగిన బిడ్డకు - మరణశాసనం లిఖించావు! పుట్టకకు ముందే చావు విధించావు! తప్పు నీది. శిక్ష గర్భస్థ శిశువుది!"

"అమ్మా..."

"నీకు తగిన శిక్ష విధించే శక్తి నాకుంది. అయితే అవకాశం లేదు! నేను నీ వీపు మీద కాల్చితే వాతలు నోనా మీద పడతాయి. నోనా గర్భంలోని శిశువు మీద పడతాయి! నీ ద్వారా బాధనూ, క్షోభనూ, అవమానాన్నీ అనుభవించిన వ్యక్తే శిక్ష విధించే విధానాన్ని అమలు చేస్తున్నాను.." అంటూ నిగమ నోనా వైపు తిరిగింది.

"నోనా... నా కొడుక్కి తగిన శిక్ష విధించే అధికారం నీది. నువ్వు వాడి మీద చట్టపరంగా చర్య తీసుకోవచ్చు. మీడియా ముందుకు వెళ్ళొచ్చు. సత్యాగ్రహం చేయొచ్చు. యు.ఎస్. ఎంబసీ ద్వారా, నీ ప్రభుత్వాన్ని ఆశ్రయించి సాకేత్‌ని అమెరికన్ కోర్టులో నిలబెట్టవచ్చు! నువ్వు ఏంచేసినా - నేను సహకరిస్తాను!!"

"థాంక్యూ మామ్... " నోనా మెల్లిగా అంది.

సాకేత్ తల్లి దగ్గరగా నడిచి, దీనంగా చూశాడు. "అమ్మా... తప్పు చేశాను. నువ్వు ఏ శిక్ష విధించినా స్వీకరిస్తాను.."

"సాకేత్, నేను నీకు శిక్ష విధిస్తే, నోనాకు భర్త లేకుండా పోతాడు. నోనా మోస్తున్న బిడ్డకు తండ్రి లేకుండా పోతాడు. శిక్ష నేను వేయను. ఎందుకో తెలుసా? భర్తను పోగొట్టుకుని బ్రతకడం ఎంత దుర్భరమో, భర్తలేకుండా సంతానాన్ని పోషించడం ఎంత కష్టమో నాకు తెలుసు!" అంటూ నిగమ నోనా వైపు చూసింది.

"నోనా, శిక్ష వేసే అధికారం నీది. అమలు జరిపే బాధ్యత నాది!" అంది.

"సాకేత్ నా భర్త కావాలి. నా బిడ్డకు తండ్రి కావాలి! అంతే!" నోనా కన్నీళ్ళు తుడుచుకుంటూ అంది.

నిగమ ప్రశ్నార్థకంగా సాకేత్ వైపు చూసింది.

"అమ్మా... నువ్వు... అనుమతిస్తే... నోనాను... పెళ్ళి చేసుకుంటాను". సాకేత్ గాద్గదికంగా అన్నాడు. "నన్ను... క్షమిస్తావా అమ్మా?"

నిగమ విరక్తిగా నవ్వింది. "భారతీయ తాత్వికత, ధర్మపథం ఒక నిత్యసత్యాన్ని చెప్పింది. పెద్ద ఎత్తుకి ఎక్కి అక్కణ్ణించీ కింద పడినప్పుడూ భూమి నిన్ను భరిస్తుంది. తన మీదే నిలబడి, కాలుజారి పడినప్పుడూ భూమి నిన్ను భరిస్తుంది! భూమాత ధర్మం అది. క్షమించి, భరించడం. 'మాత' ధర్మం కూడా అంతే!"

"సారీ... అమ్మా... థాంక్యూ అమ్మా.."

"నోనా, నువ్వు కోరిన దాన్ని నా చేతులమీదుగా జరిపిస్తాను. జరిగినదాన్నీ, జరగబోయేదాన్నీ మీ నాన్నగారికి చెప్పు" నిగమ అంది.

నోనా ఆనందబాష్పాలతో చూసింది. "కెన్ ఐ టచ్ యువర్ ఫీట్, యాజ్ ఇండియన్ గర్ల్స్ డూ మదర్?'

"యూ ఆర్ వెల్‌కమ్, నోనా!"

నోనా నిగమ పాదాల్ని ముట్టుకుంది.

"శీఘ్రమేవ కల్యాణప్రాప్తిరస్తు!" నిగమ నోనా తలను స్పృశిస్తూ అంది.

నోనా అర్థం కానట్టు చూసింది. నిగమ అర్థమైనట్టు చిన్నగా నవ్వి నిశిత వైపు చూసింది.

"మదర్ బ్లెస్డ్ యూ ఫర్ యాన్ ఎర్లీ మ్యారేజ్!" నిశిత ఆంగ్లంలో అంది.

నోనా హాయిగా నవ్వింది.

"కెన్నై కాల్ యూ 'మదర్?"

"కాల్ మీ 'మదరిన్లా!" నిగమ నవ్వింది.

"అంటే 'అత్తయ్య' సాకేత్ నోనాకు వివరించాడు.




•••

నిగమ ఆశీస్సులతో నోనా, సాకేత్ భార్యాభర్తలై నెల దాటింది. సాకేత్ ఆఫీసు నుండి ఇంటికి వచ్చాడు. హాల్లో నిలుచున్న నోనాను చూస్తూ ఆశ్చర్యంతో నోరు వెళ్ళబెట్టాడు. పెళ్ళి సందర్భంలో పట్టుచీరలతో బాటు అమ్మ కొనిచ్చిన డిజైనర్ చీరలో కళ్ళు చెదిరేలా తన ముందు ప్రత్యక్షమైంది నోనా. వయసొచ్చినప్పట్నుంచీ కేవలం చీరలే ధరిస్తున్న యువతి కట్టుకున్నట్టు చక్కగా, ఒద్దికగా ఉంది నోనా చీరకట్టు! ఎక్కడ నేర్చుకుంది.

"ఎలావుంది చీర! చీరలో నేనెలా వున్నాను?" నోనా నవ్వుతూ అంది.

"నీ కోసం చీర, చీరకోసం నువ్వు అన్నట్టుగా, కళ్ళు చెదిరేలా! దిష్టితాకేలా!" సాకేత్ నవ్వుతూ అన్నాడు. "ఎవరు కట్టారు?"

"నేనే!"

"నిజంగా?! ఎవరు నేర్పారు?"

"అత్తయ్య అండ్ నిశిత... పెళ్ళప్పుడు!" నోనా అంది.

"ఒక్కసారికే నేర్చేసుకున్నావా?"

"ఇద్దరూ వారం రోజులున్నారు. మనం వెళ్ళి అక్కడ మూడు రోజులున్నాం. ఆ పది రోజులూ ట్రెయినింగ్ పీరియడ్!" నోనా నవ్వింది. "డ్రెస్ ఛేంజ్ చేసుకుంటావా? టైమవుతోంది మూవీకి.."

సాకేత్ పడగ్గదిలోకి వెళ్ళాడు మాట్లాడకుండా. నోనా అతన్ని వెంబడించింది. సాకేత్ మంచం మీద వాలాడు. నోనా అతన్ని ప్రశ్నార్థకంగా చూసింది.

"కమాన్ హనీ... ఇలా నా దగ్గరగా కూచో!"

"టైటిల్స్ మిస్సవుతాం, సాకేత్!"

"ఇవాళ... సినిమా వద్దు..."

"ఏం?" నోనా కళ్ళు చిట్లిస్తూ అంది.

"సినిమా వద్దు; నోనా ముద్దు! చీరకట్టులో నిన్ను చూస్తుంటే నీతో ఏకాంతంగా హాయిగా, ఆనందంగా గడపాలనిపిస్తోంది!" సాకేత్ పారవశ్యంగా అన్నాడు.

నోనా సాకేత్ వైపు కాసేపు తదేకంగా చూస్తూ ఉండిపోయింది. తన పట్ల ప్రేమతో అతని కళ్ళు వెలిగిపోతున్నాయి. 'పెళ్ళి చేసుకోలేను, నన్ను మరిచిపో, అబార్షన్ చేయించుకో!' అన్న సాకేత్ ఇతనేనా? ఎంత మార్పు! తల్లికి భయపడి లేదా గొడవవుతుందనీ, పరువు పోతుందనీ భయపడి చేసుకుంటున్నాడేమో, ముందు ముందు తనను బాధ పెట్టి కసి తీర్చుకుంటాడేమో అని తను అనుమానించింది. భయపడింది కూడా. అయితే తన అంచనాలనూ, ఆలోచనలనూ పటాపంచలు చేస్తూ పెళ్ళయిన క్షణం నుంచీ సాకేత్ ప్రేమకు ప్రతిరూపంలా మారిపోయాడు. గతంలో అతనిలో కనిపించిన ప్రియుడు ఆ రోజునుండీ అనుక్షణం కనిపిస్తున్నాడు తనకు!

"ఏమిటి నోనా, నన్ను...అలా చూస్తూ, చూస్తూ, చూస్తూ ఉండిపోయావ్?" సాకేత్ చిరునవ్వుతో అడిగాడు.

"నీ ప్రేమ నన్ను ఆశ్చర్యంలో ముంచేస్తోంది, సాకేత్..." నోనా అతని దగ్గరగా కూచుంటూ అంది. "ప్రారంభం, పరిచయమైన కొత్తల్లోనూ, శాన్‌ఫ్రాన్సిస్కోలోనూ నీలో రియల్ లవ్ చూశాను, నీ కళ్ళల్లో నా పట్ల ఆరాధన చూశాను. పెళ్ళి అనగానే నీ ప్రేమ మాయమైంది..." అంటూ నోనా సాకేత్ చేతిని తీసుకుని ఉబ్బెత్తుగా ఉన్న పొట్ట మీద పెట్టుకుంది. "పెళ్ళి చేసుకుందాం అనగానే... అబార్షన్ చేయించుకో అన్నావ్. నీలో రాక్షసుడిని చూడగలిగాను .పెళ్ళవగానే...మళ్ళీ ట్రూ లవరైపోయావు! అలా ఎలా మారగలిగావు సాకేత్. ఎందుకు మారావు?"

"అదంతా గతం నోనా...మరిచిపోదాం..." సాకేత్ నిట్టూర్చి అన్నాడు.

"ఒక నిజం చెప్పనా సాకేత్? నీలో నేనుచూసిన నీ ప్రవర్తనలో మార్పులు...ఆ చేంజ్ ఓవర్స్-నన్ను భయపెడుతూనే ఉన్నాయి. భయపెడుతూనే ఉంటాయి. సాకేత్ సైకో కాదు కదా! అని కూడా నేను అనుకోవాల్సిన స్థితి అది! అలా ఎందుకు మారావో, ఎలా మారగలిగావో నాకు చెప్పాలి నువ్వు. ఇంకెప్పుడూ అలా మారనని ప్రామిస్ చేయాలి.."

**(ఇంకా వుంది)**

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## గర్భాశయ కణితుల సమస్యకు సరైన పరిష్కారం
(యుటెరైన్ ఫైబ్రాయిడ్స్)

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్





గర్భాశయంలో ఏర్పడే కణితులను యుటెరైన్ ఫైబ్రాయిడ్స్ అని అంటారు. ఈ సమస్య ఎక్కువ మంది స్త్రీలలో తరచుగా కనిపిస్తుంది. ఒక అంచనా మేరకు ప్రతి నలుగురు స్త్రీలలో ముగ్గురు ఈ సమస్య బారిన పడటం జరుగుతోంది. తద్వారా తీవ్ర ఇబ్బందులను ఎదుర్కోవడంతో - చాలా మంది స్త్రీలలో ఈ సమస్య గర్భాశయ తొలగింపు శస్త్రచికిత్సకు దారి తీస్తోంది. 30 నుండి 50 సంవత్సరాల వయస్సు గల స్త్రీలలో ఇవి ఎక్కువగా ఏర్పడతాయి. సంతానోత్పత్తి వయస్సు గల స్త్రీలలో ఇవి ఎక్కువగా ఏర్పడుతున్నందున దాదాపు 5–10% వరకు 'సంతానలేమి'కి ఇవి ప్రధాన కారణవుతున్నాయి.సాధారణంగా ఈ కణితులు గర్భాశయపు కండర కణజాలంలో ఏర్పడతాయి.

ఇవి గర్భాశయంలో ఒకటిగా లేదా చిన్న చిన్న కణితులు - గుంపులుగా ఏర్పడతాయి. పరిమాణం రీత్యా ఇవి మిల్లీమీటరు మొదలుకొని కొన్ని సెంటీమీటర్ల వరకు పెరిగే అవకాశం ఉంటుంది. వీటి ఎదుగుదల కొందరిలో వేగంగా - ఇంకొందరిలో నిదానంగా ఉంటుంది. మరికొందరిలో ఇవి నిలకడ తక్కువగా, స్వల్ప పరిమాణంలో మాత్రమే ఉండటం వలన, వారిలో ఎలాంటి లక్షణాలనూ కనబరచకపోవచ్చు. గర్భాశయంలో వీటి ఉనికి-పరిమాణం రీత్యా ఈ 'యుటెరైన్ ఫైబ్రాయిడ్స్'ను 3 రకాలుగా విభజించటం జరిగింది.



(1) సబ్ సీరోసల్ ఫైబ్రాయిడ్స్: ఇవి గర్భాశయపు వెలుపలి గోడలపై ఏర్పడతాయి.

(2) ఇన్‌ట్రామ్యూరల్ ఫైబ్రాయిడ్స్: ఇవి గర్భాశయపు మధ్యగోడలలో ఏర్పడతాయి. వీటిని సాధారణంగా ఎక్కువ మందిలో గమనించవచ్చు.

(3) సబ్‌మ్యూకోసల్ ఫైబ్రాయిడ్స్: ఇవి గర్భాశయపు లోపలి పొరలో ఏర్పడతాయి. ఇవి చాలా అరుదుగా కనిపిస్తాయి.

**కారణాలు:** ఫైబ్రాయిడ్స్ ఉత్పన్నమయ్యే అంశానికి సంబంధించి ఖచ్చితమైన కారణాలు తెలియరాలేదు. కానీ హార్మోన్‌లు - ముఖ్యంగా ఈస్ట్రోజన్, ప్రొజెస్టిరాన్ హార్మోన్‌ల ప్రభావం చేత ఫైబ్రాయిడ్స్ ఏర్పడే అవకాశం ఎక్కువగా ఉంది. కాబట్టి వీటి స్థాయిలు అధికంగా ఉండే ఋతుచక్ర సమయంలో మరియు గర్భధారణ సమయంలో ఇవి ఎక్కువగా ఏర్పడతాయి. నెలసరి ఆగిపోయిన స్త్రీలలో ఈ హార్మోన్‌ల ఉత్పాదన చాలా వరకు తగ్గడంతో ఫైబ్రాయిడ్స్ ఏర్పడే అవకాశం తక్కువగా ఉంటుంది. స్థూలకాయం మరియు వంశపారంపర్యత మొదలైన కారణాల వలన గర్భాశయ కణితులు ఏర్పడతాయి.

**లక్షణాలు:** గర్భాశయ కణితుల లక్షణాలు అవి ఏర్పడిన స్థలము, పరిమాణము మరియు వాటి యొక్క సంఖ్యను బట్టి ఉంటాయి.
- ఋతుచక్రములో అధిక రక్తస్రావము, రెండు ఋతుచక్రముల మధ్యలో రక్తస్రావము, ఋతుస్రావము ఎక్కువ రోజులు కొనసాగటం.
- పొత్తి కడుపులో నొప్పి, నడుము నొప్పి.
- ఫైబ్రాయిడ్స్ వలన మూత్రాశయంపై ఒత్తిడి పడితే, తరచూ 'మూత్రానికి వెళ్ళాలి' అనిపించడం.
- ప్రేగులపై ఒత్తిడి పడటం వలన మలబద్ధకం, కడుపుబ్బరం వంటి లక్షణాలను గమనించవచ్చు.
- అధిక రక్తస్రావము వలన రక్తహీనతకు గురయ్యే అవకాశం ఉంటుంది.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** వ్యాధి లక్షణాలను బట్టి ఒక అంచనాకు రావటం మరియు పెల్విక్ ఎగ్జామినేషన్, అల్ట్రాసౌండ్ స్కాన్, ట్రాన్స్ వెజైనల్ స్కాన్, రక్తపరీక్ష, యమ్.ఆర్.ఐ., బయాప్సీ, హిస్టిరోస్కోపీ, హిస్టిరో సాల్పింగోగ్రఫీ, లాప్రోస్కోపీ వంటి పరీక్షల ద్వారా వ్యాధి నిర్ధారణ చేయవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో అందించబడే జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ చికిత్సా విధానంలో ఈ యుటెరైన్ ఫైబ్రాయిడ్స్ సమస్యను సంపూర్ణంగా నయం చేయవచ్చును. ఈ చికిత్స ద్వారా గర్భాశయ కణితులను పూర్తిగా కరిగించడమే కాకుండా, శరీరంలోని హార్మోన్‌ల అసమతుల్యతను సరిచేయటంతో పాటు ఋతుచక్ర సమస్యలన్నిటినీ పరిష్కరించటం జరుగుతుంది. ఇంతే కాకుండా శస్త్రచికిత్స ద్వారా గర్భాశయాన్ని తొలగించే అవసరం లేకుండా, కేవలం హోమియోమందులతోనే ఈ వ్యాధిని నయం చేయవచ్చు.



# సినీ నారాయణీయం

## (ఎమ్మెస్ నారాయణ జీవితచిత్రం) 28

# బ్రేక్ ఇచ్చిన బాంధవుడు ఈవీవీ

**సోంబాబు మంచి తిండిప్రియుడు. "బఫే" కాబట్టి ఎంతయినా తినొచ్చు. రెండు ప్లేట్లు పట్టుకెళ్ళి నిండా బిర్యాని గనులు తవ్వినట్టు తవ్వుకొచ్చి తినేశాడు. తర్వాత మేం బయటికి వెళుతుంటే, "ఎక్స్‌క్యూజ్‌మీ సార్" అని మేనేజర్ చాలా వినమ్రంగా నా దగ్గరకొచ్చాడు. "ఎప్పుడూ ఈయన్ని తీసుకురాకండి సార్! నేను ఇలా అనకూడదుగానీ ఇది రిక్వెస్ట్ సార్" అన్నాడు. ఈ ఆశ్చర్యం నుంచి తేరుకోవడానికి నాకు చాలాసేపు పట్టింది.**

అప్పుడప్పుడూ రకరకాల సాహసాలు చేయటం నాకు అలవాటు. ఓసారి మా ఫ్రెండ్ సుబ్బరాజు, నేను, మూర్తిరాజు అని మరో ఫ్రెండ్ కారులో ఓ గ్రామం దాటుతున్నాం. ఆ ఊరి సెంటర్ గుడి చప్టా మీద ఓ ఇరవైమంది పేకాట ఆడుతున్నారు. దూరం నుంచి చూసి వీళ్ళను ఆటపట్టిద్దాం అనుకున్నాం. కారు స్పీడుగా పోనిచ్చి చప్టా దగ్గరగా బ్రేకేశాం. విపరీతంగా దుమ్ము లేచింది. పోలీసులు అనుకొని బెంబేలుపడి వాళ్ళు అన్నివైపులకీ పరుగులు తీశారు. కొందరు పడిపోయారు. పేకముక్కలు, డబ్బులు అక్కడే చెల్లాచెదురుగా పడివున్నాయి. కాసేపు అక్కడే హడావిడి చేసి నవ్వుకుంటూ బయలుదేరాం. ఒకతను నన్ను చూసి ఎమ్మెస్‌రా! అని అరిచాడు. అప్పుడు అందరూ నెమ్మదిగా దగ్గరకొచ్చి నవ్వుకున్నారు. ఒకసారి పేపర్లో 'పేకాటరాయుళ్ళపై, పోలీసుల దాడి, కాలవలో పడి ఒకరు మృతి అనేవార్త చూశాను. అప్పటి నుంచి ఇలాంటి సాహసాలు మానేశా.

### ఈవీవీతో తొలి చిత్రం

రుక్మిణి సినిమా విషయానికొస్తే ఆ సినిమాలో నాగేంద్రబాబుగారిది దాదాపు హీరో పాత్ర. అంతకు ముందు ఈవీవీగారు ఆయన్ని హీరోగా పెట్టి 420 అనే సినిమా తీశారు. అందుకని ఈవీవీగారి కోసం హైదరాబాద్‌లో ప్రివ్యూ వేశారు. ఈ సినిమాలో నా పాత్రచూసి వీడెవడో చిత్రంగా చేస్తున్నాడే అనుకున్నారాయన. ఆయనకి నా క్యారెక్టర్ బాగా నచ్చింది. నామీద ఆసక్తి కనబరిచారు. ఎందుకంటే ఈవీవీ గారు 'మా నాన్నకి పెళ్ళి' అనే సినిమా తీస్తున్నాడు. అదే సమయంలో రాఘవేంద్రరావుగారు 'పరదేశి' అనే సినిమా కోసం కమెడియన్స్‌ని అమెరికా తీసుకుపోయారు. ఒక్కళ్ళు కూడా లేరిక్కడ. ఈవీవీగారికి ఒక తాగుబోతు క్యారెక్టర్ కావాలి. నన్ను చూడగానే సరిగ్గా సరిపోతానని అనిపించింది. అప్పుడు నా దగ్గర పేజర్ ఉండేది. ఈ పేజర్ నెంబర్ ఏవీయస్ దగ్గర ఉంది. అప్పుడు ఏవీయస్ గారు ఆయన దగ్గరే 'ఆవిడా మా ఆవిడే' షూటింగ్‌లో ఉన్నారు. 'రుక్మిణి'లో ఎమ్మెస్ నారాయణ అట ఎక్కడ దొరుకుతాడు వాడు? అని ఏవీఎస్‌ని అడిగారు ఈవీవీగారు. నా దగ్గర నెంబరు ఉందండి అని పేజర్ నెంబరు ఇచ్చారు ఏవీయస్ గారు ఆయనకి. నాకు ఫోన్ చేశారాయన. నేనప్పుడు సింగిల్ రూం తీసుకొని దాంట్లో బట్టలు అవీ సర్దుకుంటున్నాను. సర్దుకుంటుంటే పేజర్ వచ్చింది. కిందకి వెళ్ళి ఫోన్ చేశా. ఫోన్ చేసి బ్రహ్మానందంగారేమో అనుకున్నా. ఏమండీ బ్రహ్మానందం గారు నమస్కారం అన్నా. అంటే ఇండస్ట్రీలో బ్రహ్మానందం తప్ప, ఎవడూ లేడట్రా అన్నారాయన. అంటే ఈవీవీ గారి కంఠంలాగా ఉందన్నా. నేనేనయ్యా ఇలాగా హాలీడే ఇన్ హోటల్లో ఉన్నాను. నువ్వురా నీతో మాట్లాడాలి అన్నారు. వెళ్ళాను.



### మా నాన్నకి పెళ్ళి

'రుక్మిణి' సినిమాలో బాగా చేశావయ్యా. 'మా నాన్నకి పెళ్ళి' అనే సినిమా తీస్తున్నాను. దాంట్లో ఒక క్యారెక్టరు ఉంది. అది నీకు ఇస్తాను అన్నారు ఈవీవీ. అనేటప్పటికి ఏవీయస్‌గారన్నారు ఏమండీ కొంపతీసి ఆ తాగుబోతు క్యారెక్టరు కాదు కదా, అది మాత్రం నాకు రిజర్వ్ చేయా లన్నారు. అది నీదేలేగానీ, ఇది వేరే అనేప్పటికే సరే అని ఏవీయస్‌గారు వెళ్ళిపోయారు. ఆయన వెళ్ళిపోయిన తరువాత నాకు కథ చెప్పారు. అదే తాగుబోతు క్యారెక్టరు. ఏవీయస్‌కో, బ్రహ్మానందం గారికో ఇవ్వాలనుకున్నాను. కానీ వారిద్దరూ ఆ డేట్స్‌లో ఉండటం లేదు. అంచేత నువ్వు చేద్దువుగానీ అన్నారు. 1997 మార్చిలో ఆ సినిమా షూటింగ్ మొదలైంది. మమ్మల్ని తీసుకెళ్ళి, తారా హోటల్లో పెట్టేశారు. రామోజీ ఫిలిం సిటీలో ఫస్ట్ తీసిన తెలుగు పిక్చర్ అది. అందుకనే అంత రిచ్‌గా ఉంటుంది సినిమా. అన్ని లోకేషన్లూ వాడేశారు. రోజా మూవీస్ అర్జున్‌రావుగారు ప్రొడ్యూసరు.

రామోజీ ఫిలిం సిటీలో ఉన్నాను. నన్నూ వర్మ అనే ఓ కవినీ మా ఇద్దరినీ ఒక రూంలో పెట్టే శారు. నాకు స్క్రిప్టు ఇచ్చి చదవమన్నారు. చదవ మంటే, నేను చదివాను. నావి మూడు సీను లున్నాయి. సార్ మూడు సీనులే ఉన్నాయి అన్నా. నేనేమో నెలరోజులు సెలవు పెట్టాను. కాదురా నీ క్యారెక్టరు నా బ్రెయిన్‌లో ఉంది. చాలా సీన్లుం టాయి, కంగారుపడకు. మంచి క్యారెక్టరు అని ఆయన సముదాయించారు.

### స్క్రిప్టు మార్పించి భీష్ముడి కథ పెట్టించా

స్క్రిప్టు చదివా. దాంట్లో నా కూతురు నర్సు. ఆ పాత్రలో అంబిక నటించింది. కృష్ణంరాజుగారు పేషంట్. నా కూతుర్ని ఇష్టపడతాడు. ఈమె కూడా అతనంటే ఇష్టపడుతుంది. అంతకుముందే ఆయ నకు ఒక కొడుకు ఉంటాడు, శ్రీకాంత్. కొడుకును పిలిచి చెబుతుంది ఆమె. నేను షాక్ అయ్యాను ఆ కథ చదివి. ఒక ఐదారుగురు కవులు, డైరెక్టరు గారు కలిసి చేశారు ఆ కథని. మెయిన్ జనార్దన్ మాస్టరుగారు కూడా చేశారు ఆ కథని. చేస్తే నాకని పించింది ఏంటంటే బాగుంది కథ. కానీ ఇష్టపడిన స్త్రీ వెళ్ళి ఆయన కొడుక్కి ఆ విషయం చెబితే ఆమె కొంచెం 'ఫాస్ట్‌లేడీ' అనిపిస్తుంది. అందుకని డైరెక్టరుగారి దగ్గరి కెళ్ళా. సార్ మనకి ఇదెందుకండీ. ఇట్లా అక్కర్లేదు. మహాభారతంలో భీష్ముడి కథ మోస్ట్ సక్సెస్‌ఫుల్ స్టోరీ ఉంది. తండ్రి కోసం భీష్ముడే వెళ్ళి ఆ స్త్రీని అడుగుతాడు నా తండ్రిని పెళ్ళాడమని, అది పెడదాం సార్ అన్నా. చాలా బాగుందిరా నీ ఐడియా. శ్రీకాంత్ కూడా పెరుగుతాడు. మనోళ్ళందరినీ కూర్చోబెట్టి చెబుదాం రా అన్నారు. వద్దండీ నేను చెప్పాననుకోండి ఇన్‌ఫీరి యర్‌గా అనిపిస్తుంది వాళ్ళకి. అతను పెద్ద పుడింగా ఏంటీ? మనం కాదేంటి? అనే భావం రావచ్చు వాళ్ళకి. అదే మీరు చెప్పారనుకోండి, తప్పనిసరిగా వాళ్ళకి నచ్చుతుంది. అది సైకాలజీ అని చెప్పాను.

సరే అందర్నీ పిలవరా అన్నారు ఈవీవీ. నేనే వెళ్ళి అందర్నీ పిలిచాను. రామోజీ ఫిలింసిటీలోనే ఎండలోనే మీటింగ్ పెట్టేసి ఇలా అనుకుంటు న్నాను అన్నారు. బాగుందన్నారు అందరూ. అనేటప్పటికి అలాగే తీశారు. ఆ క్యారెక్టరు నేను చెప్పినట్టుగా సక్సెస్ అయింది. అది నా కథ కాదు, భారతంలో భీష్ముడి స్టోరీ. సక్సెస్ అవకుండా ఎలా ఉంటుంది? అది ఎప్పుడూ సక్సెస్ స్టోరీయే.

### సీను పండింది

ప్రెజెన్స్ ఆఫ్ మైండ్‌తో చేసిన ఆ సీను సిని మాలో బాగా పండింది. తల్లి చీరల్లో అంబిక ఫోటో దాచి ఉంచుతుంది కృష్ణంరాజు పాత్ర. తల్లి చీరలు తీసేటప్పటికి శ్రీకాంత్‌కి ఆ ఫోటో కనబడుతుంది. ఓ! మా నాన్న మనసులో ఈమె ఉందన్నమాట అని, ఏమండీ ఒకసారి మీరు టెంపుల్‌కి రండి, నేను మీతో మాట్లాడాలి అని అంబికని పిలిచి, మా తండ్రిని మీరు చేసుకోవాలండీ, చేదోడు వాదోడుగా ఉండాలి. స్నేహితురాలిగా ఉండాలి. అంటే ఆ అమ్మాయి అంగీకరించింది కానీ నేను తాగుబోతు తండ్రిని, అడ్డుకుంటాను. ఆ అమ్మాయికి రంకులు




**రవిరాజా పినిశెట్టి గారు ఎమ్మెస్‌ను వీడు సరైనోడు అని గుర్తించి వెండితెరకు నటుడుగా పరిచయం చేస్తే, ఆ టాలెంట్‌ను గుర్తించి ఒక బ్రేక్ ఇచ్చారు ఈవీవీ. ఆ విధంగా ఎమ్మెస్ 1997 నుండి ఇక వెనుతిరిగి చూడకుండా 500 పైచిలుకు సినిమాల్లో నటించారు. ఏదో ఒకటీ రెండు రోజులు తప్ప కడవరకు ఆయన నటుడుగా నటిస్తూనే ఉన్నారు. ఈవీవీ బ్రేక్ ఇవ్వటం, ఎమ్మెస్ ఆయన్ను మెప్పించడం ఇవన్నీ ఎలా జరిగాయి?**

అవీ అంటకట్టేసి డబ్బులు తీసేసుకునే బ్లాక్‌మెయి లర్‌ని నేను. ఆ అమ్మాయికి శత్రువునన్నమాట. ఒక తాగుబోతు తండ్రి ఎలా ఉంటాడనేది కథ. అప్పుడు నాకు డబ్బులు, బాటిల్స్ అవీ తెచ్చి నన్ను లొంగ తీసుకుంటారు.

### పాతికరోజుల్లో నా సినిమాలు 17 రిలీజయ్యాయి

ఆ విధంగా ఆ కథ బాగా సక్సెస్ అయింది. అది 1997 డిసెంబర్ 5వ తేదీన రిలీజ్ అయింది. అలా 1998 జనవరి మొదటితేదీనాటికి 17 సినిమాలు వచ్చాయి నావి. అప్పటికింకా నేను జాబ్ చేస్తూనే ఉన్నా. అంటే ఆ క్యారెక్టర్ అలా ప్రజల్లోకి వెళ్ళి పోయింది. మామూలుగా వెళ్ళలా. ఎప్పుడైతే 17 సినిమాలు వచ్చేశాయో, నాకసలే ఈ డేట్స్ అవీ కంగారు, టెన్షన్. అందుకని ఏం చెయ్యాలిరా అని ఆలో చించి, 'ఆవిడా మా ఆవిడే' సినిమా షూటింగ్ జరుగు తోంది ఓ పక్కన. ఇంకో పక్కన 'మా నాన్నకు పెళ్ళి' సినిమా జరుగుతుంటే అమ్మిరాజు అని ఒకా యన ఉన్నారు. ఈ సినిమాకి మేనేజర్‌గా వర్క్ చేశారు. నన్ను తెల్లవారుజామున తీసుకెళ్ళటం, ఆ వేషం వేయించటం, చేయండి సార్ అనడం...నా క్యారెక్టరు ఎంత చేశారంటే డైరెక్టరుగారు నా క్యారె క్టర్‌ని మూడు సీన్లు నుంచి 18 సీన్లకి పెంచారు. చివర్న సోడా ఫ్రీజ్ అంటాను. ఫ్రీజ్ అయిపోతాను. ఆ ఫ్రీజ్ మీద రోలింగ్ టైటిల్స్ వెళతాయి. అంత ప్రాధాన్యం ఇచ్చారు ఆ క్యారెక్టర్‌కి.

### ఒక రోజు రెమ్యునరేషన్ పాతికవేలకి పెంచేశా

1997 డిసెంబర్ 5 నుంచి 31వ తేదీనాటికి నావి 17 సినిమాలు వచ్చాయి. నాకు పిచ్చెక్కే సింది. మా అమ్మిరాజును తీసుకొని ఏమయ్యా నువ్వు నా డేట్‌లు చూడు. ఇప్పుడు నీకు ఎంత పర్సం టేజ్ ఇస్తున్నారు? అని అడిగా. ఇలా డేట్‌లు చూసే సెక్రటరీకి ఫైవ్ పర్సంట్ ఇస్తున్నారండి అన్నాడు. నా దగ్గర సిన్సియర్‌గా వర్క్ చెయ్యి. నేను 10 పర్సంట్ ఇస్తానన్నాను. వర్క్ తెచ్చి పెట్టు. నీకు లక్షకి పదివేలు అన్నా. ఎప్పుడైతే 17 సినిమాలు వచ్చాయో, టక్ అని రెమ్యునరేషన్ రోజుకి 25 వేల రూపా యలు చేశా. అట్లా ఒక స్టార్‌కి ఇమ్మీడియట్‌గా అన్ని సినిమాలకి 25 వేలు చెయ్యటం, అలా రావడం ఒక చారిత్రాత్మకమైన ఘట్టం. ఆ అభివృద్ధికి నేను చాలా హ్యాపీ ఫీలయ్యాను. ఈవీవీ గారి కాళ్ళకి దండం పెట్టుకుని, డైరీ తీసుకెళ్ళి ఇతన్ని సెక్ర టరీగా పెట్టుకుంటున్నానండీ అన్నా. సరే అని ఆశీర్వ దించి, సంతకం పెట్టి నీ డైరీ ఫిలప్ అయిపోవు గాక అని ఆశీర్వదించారు.

ఆనాటి నుంచి ఈనాటి వరకూ అతనే నా డేట్‌లు చూస్తున్నాడు. ఆ డైరీ అలాగే ఉంది. దురదృష్టం ఏంటంటే ఈవీవీ గారు లేరు. అదొక బాధాకరమైన సన్నివేశం. మహానుభావుడు. ఆయన పోయినప్పుడు ఎంతో బాధ పడ్డాను. అంత లైఫ్ నాకు ఎవ్వరూ ఇవ్వరు. ఒక కొత్తవాడి మీద ఆధారపడి ఎవ్వరూ తీయరు. కానీ ఈవీవీ గారికి తెలుసు. ఆ క్యారెక్టర్ సక్సెస్ అవుతుందని. ఆ దార్శనికత, ఆ ముందస్తు అవగాహన ఆయనకు ఉంది. రవిరాజా గారు కూడా మొదట్లో అలాగే నాలోని నటుణ్ణి చూసి, వీడు కరెక్టు అని నన్ను ఇంట్రొడ్యూస్ చేస్తే, ఈవీవీ గారు కూడా అదేవిధంగా నాకో బ్రేక్ ఇచ్చారు. అంతే ఆనాటి నుంచి ఈనాటి వరకూ 500 పైచిలుకు సినిమాలు చేశాను. వెనక్కి తిరిగి చూడలేదు. ఇంతవరకూ ఒక వారం గ్యాప్ రాలేదు. ఒకరోజు, రెండు రోజులు వచ్చిందే తప్పా.

*(ఇంకావుంది)*

*-కూనపరాజు కుమార్*
*సెల్: 99899 99599*

**“ఏంటి బావా మరీనూ”.**

**మల్లెలు పరచిన పందిరిమంచం మీద ఒకవైపు ఒత్తిగిల్లి పడుకొని అగరొత్తుల పొగను ఆఘ్రాణిస్తూ తనవైపే చూస్తున్న ఈశ్వర్‌ని చూస్తూ అంది సుచరిత.**

**అప్పటికే ఆమెకు కోపం నషాళానికి అంటుతోంది. ‘ఎన్ని ఆశలతో, ఎంత ఆవేశంగా తను ఈ గదిలోకి అడుగుపెట్టింది. తెల్లచీర కట్టి, తలలో మల్లెపూలు పెట్టి, రాని సిగ్గును నటిస్తూ లోపలికి వస్తే, కనీసం భుజాలచుట్టూ చేతులేసి బెడ్‌వైపు నడిపించలేదు. కట్టిన చీరపరదా బరువుని తగ్గించి, బంధించిన జోడు మదనాశ్వాలకు కట్లు తెంచి, తనువనే రథమెక్కి, తపనల తీరం దాటి, సుఖసాగరంలో ఈదులాడి అలసిసొలసి సంతృప్తి ఒడ్డున ఆదమరచి నిద్రపోదామంటే ‘నా బావ ఇలా చేశాడేంటి?’**

‘పోనీ తనే చీరగీర పక్కనపెట్టేసి ‘బావా! నేనిక ఆగలేను...’ అంటూ అతడి మీదకు చేరిపోయి ఆవేశపడిపోదామంటే, మరీ మొదటిరాత్రే అలా చేయటం బాగోదు కదా అని ఆగిపోతోంది’.

మొదటిరాత్రి కోటి ఆశలతో శోభనం గదిలోకి అడుగుపెట్టే పెళ్ళికూతురుని మొగుడు పట్టించుకోకపోతే ఏ ఆడపిల్లకైనా కోపమే కాదు రకరకాల అనుమానాలు కలిగి తీరుతాయి.

అప్పుడే అతడు ఆమెవైపు తిరిగాడు. అదోలా నవ్వుతూనే ‘ఏమైందిప్పుడు?... అసలు నేనింకా ఏమీచేయకుండానే అలా అంటున్నావేంటి?” అడిగాడు.

“నేనూ అనేది అదే బావా! శోభనం గదిలోకి ఐదున్నర అడుగుల అందం అడుగుపెట్టి ఐదు నిమిషాలవుతున్నా ఇంకా అలా శేషపాన్పు మీద శ్రీమహావిష్ణువులా పడుకుండి పోయారేం?! కొంపదీసి సరసాలు, గిరసాలు, పాలగ్లాసు పక్కనపెట్టి నన్ను కాళ్ళు పట్టమంటావా ఏంటి?” అంది ఆమె కాస్త గారంగా, మరికాస్త నిష్ఠూరంగా.



# ప్రకృతి ఒడిలో పరవశాల జల్లు



-జంధ్యం వెంకటేష్‌బాబు

"కాళ్ళు పట్టమననుగానీ..." ఈశ్వర్ మంచం మీదనుండి లేచి, ఆమె ముందు వంగి నిలబడి భుజాల మీద చేతులేసి చెప్పాడు. "ఈ రాత్రంతా మనం కబుర్లు చెప్పుకుందాం".

సుచరిత తన చెవులను తనే నమ్మలేక పోయింది. 'ఏ పెళ్ళికొడుకైనా ఈ గడియ రాగానే, మొదట తలుపు గడియపెట్టి అరక్షణం ఆలస్యం చేయకుండా అమాంతం దగ్గరకు తీసుకుని ఊపిరి ఆడనివ్వకుండా ఉక్కిరిబిక్కిరి చేసేస్తూ శోభనం గదిని స్వర్గలోకంగా మార్చేస్తాడు. మరి నా బావ ఇలా అంటున్నారంటే.."

ఆమె మనసులోని ఆలోచన గ్రహించినట్టు అతడు కంగారుగా అన్నాడు "అమ్మా...తల్లీ.. అంతకుమించి ఆలోచించకు. శోభనం గదిలో మొగుడు ముద్దుమురిపాలను వాయిదావేస్తే అనుమానం రావడం సహజమే గానీ, నా వాయిదా వెనుక అలాంటి అనుమానాలకు తావు లేదు.."

"మరి మన వాయిదా వెనుక కారణమేంటో?" అతడి ముఖంలోకి ఆరాగా చూస్తూ అడిగింది సుచరిత.

"మన శృంగార అనుభూతి ఎక్కడైతే ప్రారంభమై ఆగిందో, అక్కడే పునఃప్రారంభించాలని నా కోరిక".

తామిద్దరి శృంగార అనుభూతి అసలెక్కడ మొదలైంది? అతడి మాటలతో ఆమెకు 'గతం' గుర్తుకొచ్చింది.

●●●

"ఈ ప్లాన్ కరక్టేనంటావా?" అనుమానంగా అడిగింది సుచరిత.

"ఇంతకుమించి మరేప్లానూ వర్కవుట్ అయ్యేలా కనిపించడం లేదు" అన్నాడు అవినాష్.

"నాకెందుకో భయంగా ఉంది. ఇది కరెక్ట్ కాదేమోనని కూడా అనిపిస్తోంది".

"ఇలా భయపడుతూ ఉంటే మన పెళ్ళి అయినట్టే.." గాఢంగా నిశ్వసించాడు అతడు.

సుచరిత మనస్ఫూర్తిగా ఆ ప్లాన్‌కి అంగీకరించలేకపోతోంది. 'ఒక అమ్మాయి, ఒక అబ్బాయితో కలిసి సరసమాడుతూ కనపడకూడని స్థితిలో జనం కంటపడడం.. అంటే.. పైట జరిగి, బట్ట నలిగి, జుట్టు చెదిరి... ఆ స్థితిలో ఎవరైనా తమను అలాచూస్తే ఏమనుకుంటారు? ఆ క్షణం అమ్మానాన్నల మనసులో ఎలాంటి భావాలు కదలాడుతాయి? వాళ్ళు కలలో కూడా తననలా ఊహించుకోలేరేమో! వాళ్ళేకాదు అటు జనం కూడా 'అమ్మో! రామచంద్రరావుగారి అమ్మాయి ఏమో అనుకున్నాం గానీ, బాగా ముదురే' అనుకోరూ?' అది ప్లాన్ అయినా సరే, జనం మాత్రం నిజమే అనుకుంటారుగా! నిజానికి జనం అలా నిజమని నమ్మితేనే కదా, అసలు తమ ప్లాన్ వర్కవుట్ అయ్యేది'.

తనకు ఇష్టమో, అయిష్టమో అర్థం కావడం లేదు. కాని అతడిమీద ఉన్న ఇష్టం కష్టంగానైనా ఒప్పుకోమంటోంది. "సరే! అలాగే చేద్దాం.."

అవినాష్ వెంటనే ఆమెను దగ్గరకు తీసుకోబోయాడు.

"వద్దు. పెళ్ళయ్యేవరకూ నాకిష్టం లేదని చెప్పాగా" సుచరిత దూరంగా జరిగే ప్రయత్నం చేసింది.

అప్పటికే అతడు, ఆమె నడుముచుట్టూ చేతులు వేశాడు. దగ్గరకు లాక్కుంటూనే అన్నాడు. "ఇదే నీ దగ్గర నాకు నచ్చనిది. మనిద్దరం మాంచి రసపట్టులో ఉండగా, ఊరంతా చూడడానికి ఒప్పుకుంటావ్‌గానీ, ఈ నాలుగుగోడల మధ్య ఏం చేయడానికీ ఒప్పుకోవు".

అప్పటికే అతడి చేయి నడుమువంపును ఆబగా తడుముతోంది. ఎత్తుపల్లాల మధ్య అధిరోహణ, అవరోహణలతో ఆడుకోవాలని ఆశపడుతోంది. నిజానికి ఆమెకు కూడా ఆ స్థితి, పరిస్థితి అపరిమిత ఆనందం కలుగచేస్తున్నాయి. విచక్షణ వదిలేస్తే మరోలోకంలోకి వెళ్ళిపోవచ్చని అర్థమవుతోంది. కాని చిన్ననాటి నుండి పెద్దలు నేర్పిన నీతిసూత్రాలు ప్రతిస్పందించనివ్వడం లేదు. లేకపోతే ఆస్థితిలో రెచ్చిపోయి వలువలు జార్చి అతడిలో తను కలిసిపోతూ, తనలో అతడిని కలిపేసుకుని ఉండేది.

ఆ స్థితిలో మరికాసేపు ఉంటే మనసు అదుపు తప్పుతుందని తెలియడంతో, ఆ చేతిని బలవంతంగా పక్కకు తప్పించింది. "నేనిక వెళ్తాను" అంది సుచరిత. ఆ సమయంలో అతడి ముఖంలో అసహనం కొట్టొచ్చినట్టు కనిపించింది.

"సర్లే వెళ్ళు" అన్నాడు.

సుచరిత ఇంటికొచ్చిందన్నమాటే గానీ మనసు మనసులో లేదు. అవినాష్ చెప్పిన విషయమే ఆలోచించసాగింది.

●●●

అవినాష్ సంవత్సరం క్రితమే ఆ ఊరు వచ్చాడు. ఊళ్ళో కొత్తగా పెట్టిన కార్పొరేట్ స్కూల్లో ఉద్యోగం. ఎదురింట్లోనే అద్దెకు దిగడంతో అప్పుడప్పుడూ పలకరింపు నవ్వులు... ఆ తర్వాత చేతులు ఊపుకోవడం వరకూ వచ్చాయి.

అప్పటికే ఇంట్లో తనకు పెళ్ళి సంబంధాల ప్రస్తావన జరుగుతోంది. ఊళ్ళోనే ఉండే మేనమామ కొడుకు ఈశ్వర్‌కి తననిచ్చి పెళ్ళి చేయాలనుకుంటున్నారు. ఈశ్వర్ మంచివాడే! కాని ఎందుకో అతడంటే తనకంతగా ఇష్టం లేదు. బహుశా చిన్నప్పటి నుండి చూస్తూ ఉండడం వల్ల కాబోలు అతడితో పెళ్ళంటే ఎలాంటి ఫీలింగ్ కలగడం లేదు. అదిగో అదే సమయంలో అవినాష్ పరిచయం కొత్తగా, గమ్మత్తుగా అనిపించింది.

అందుకే ఒక అడుగు ముందుకేసి ఎవరూ చూడకుండా అతడి ఇంటికి రాకపోకలు సాగించింది. అతడితో కబుర్లు చెప్పేది. ఇంట్లో వంటలు తీసుకెళ్ళి అతడికి పెట్టేది. అయితే అంతకుమించి హద్దులు దాటనివ్వలేదు. ఒక్కొక్కసారి అతడు తనకు దగ్గర కావాలని ప్రయత్నాలు చేసేవాడు. ఏదోమిషతో చేతులు తాకడం, మాటల్ని రొమాంటిక్ దిశగా తీసుకెళ్ళి తనమూడ్‌ని డైవర్ట్ చేయాలని చూడడం... ఇలాంటి ప్రయత్నాలు చాలానే చేశాడు. అవేవీ వర్కవుట్ కాలేదు. దాంతో తన క్యారెక్టర్ మీద గౌరవం పెరిగిందో ఏమో పెళ్ళి ప్రపోజల్ తీసుకువచ్చాడు. బావ అంటే ఇష్టం లేదు కాబట్టి అవినాష్‌తో పెళ్ళి తనకు కూడా ఇష్టమే. కాని సమస్యల్లా పెళ్ళి ఎలా జరుగుతుందన్న దానిమీదే!

కారణాలు ఏమైనా అవినాష్‌తో పెళ్ళికి ఇంట్లో వాళ్ళు అంగీకరించరు. అమ్మానాన్నల అంగీకారం లేకుండా పెళ్ళి చేసుకోవడం తనకు ఇష్టం లేదు. పారిపోయి పెళ్ళి చేసుకోవడానికి అతడికి కూడా కొన్ని సమస్యలున్నాయి. తన ఎడ్యుకేషనల్ సర్టి

ఫికెట్స్ స్కూల్ యాజమాన్యం దగ్గర ఇరుక్కు పోయాయి. సర్టిఫికెట్స్ లేకుండా భవిష్యత్తు అగమ్య గోచరం. పోనీ అగ్రిమెంట్ పీరియడ్ అయిపోయాక నింపాదిగా పారిపోయే ప్లాన్ అమలు చేద్దామంటే, ఆ లోపే బావతో తన పెళ్ళి జరిగిపోయే అవకాశం ఉంది. అందుకే అర్జంట్‌గా నిర్ణయం తీసుకోవాల్సిన పరిస్థితి వచ్చేసింది. ఏంచేయాలా అని ఆలోచిస్తుంటే అవినాష్ ఒక ప్లాన్ చెప్పాడు. ఆ ప్లాన్ గురించి వినగానే తనకు కంగారేసింది. ఒక ఆడపిల్ల అలాంటి పనికి అంగీక రించగలదా? కానీ అంతకుమించి మరోదారి కని పించడం లేదు అంటున్నాడు అవినాష్.

ఇంతకూ అతడు చెపుతున్న ప్లాన్ ఏమిటంటే...

"అవినాష్‌తో కలిసి తను ఓ గదిలో 'రొమా న్స్'లో ఉండగా ఆ విషయం పదిమందికీ తెలిసి అక్కడకు రావాలి. ఆ విషయం పదిమందికీ తెలిసి వచ్చేలా చేసే బాధ్యత అతడే తీసు కుంటాడు. అందరితోపాటు అక్కడికివచ్చి చూడ కూడని ఆ దృశ్యం చూసిన తల్లిదండ్రులు ఇక తప్పనిసరి పరిస్థితులలో అతడినే అల్లుడిగా అంగీకరించి తీరుతారు'.

వినడానికి ప్లాన్ బాగానే ఉంది. కాని... మనసులో అనేక అనుమానాలు!

అమ్మానాన్నలు ఆ సమయంలో అలా తలదించుకుంటే తను తట్టుకోగలదా? ఒకవేళ ఆ పరిస్థితి దృష్ట్యా అప్పటి కప్పుడు పెళ్ళికి అంగీకరించినా ఆ తర్వాత తన ముఖం చూస్తారా?

పెళ్ళంటూ జరిగిపోతే అవన్నీ ఆటో మేటిక్‌గా సర్దుకుపోతాయని అవినాష్ అంటున్నాడుగానీ తనే తన మనసుకు సర్దిచెప్పు కోలేక పోతోంది.

ఇలాంటి సమయంలోనే ఎవరికైనా సరైన సలహా కావలసింది.

అందరికీ ఆ సమయంలో సరైన సలహా దొర కదు. కాని తన అదృష్టం కొద్దీ అప్పుడే మేనత్త సంధ్య ఆ ఇంటికొచ్చింది. సంధ్య లెక్చరర్‌గా పని చేస్తోంది.

కోడలిని తేరిపార చూసి "ఏంటే! నీ మొహంలో పెళ్ళికళ అస్సలు కనపడడం లేదు" అంది సంధ్య.

మేనత్తదగ్గర తనకు చాలా చనువుంది. ఆమెకు కొడుకులు లేరు గాని, ఉండి ఉంటే అమ్మవైపు నుండి కాదు, నాన్నవైపు నుండి కూడా మరోరక మైన ఒత్తిడి వచ్చిఉండేది. అయితే ఒక్కటి మాత్రం నిజం. తన మేనత్త చాలా మంచిది. ఆదర్శభావా లున్న వ్యక్తి. తన సమస్యను ఆమెతో నిర్భయంగా చర్చించొచ్చు. తనకున్న లోకజ్ఞానం ఎక్కువే!

"ఏం చెప్పనత్తా! అమ్మ నన్ను తన అన్న కొడుకుకి ఇచ్చి పెళ్ళి చేయాలనుకుంటోంది. నాన్న కూడా అమ్మకు సపోర్ట్ చేస్తున్నాడు..

"మా అన్నయ్యేంటి, నేను కూడా ఆ సంబం ధాన్ని మనస్ఫూర్తిగా ఒప్పుకుంటున్నాను" అంది ఆమె.

"కాని నాకు ఆ సంబంధం ఇష్టం లేదు" వెంటనే అనేసింది సుచరిత.

సంధ్య ఊహాతీతమైన విషయమేదో విన్నట్టు ఆశ్చర్యంగా చూసింది. అర నిమిషం తర్వాత తేరుకుని అడిగింది. "ఈ సంబంధం నీకెందుకు ఇష్టం లేదే? మీ బావకేం! ఆరడుగుల అంద గాడు. అగ్రికల్చరల్ బీఎస్సీ చేసి, ఉన్న పదెక రాల పొలంలో వ్యవసాయం చేసుకుంటూ హాయిగా బ్రతికేస్తున్నాడు. ఇంతకుమిం చిన సంబంధం మరోటి దొరుకుతుం దటే నీకు?"

"మీరన్నవన్నీ కరెక్టే! కానీ... ఎందుకో తెలియదు. బావంటే నాకు ఇష్టం కలగడం లేదు".

సుచరిత ముఖంలోకి కాసేపు పరిశీలనగా చూసి, ఆ తర్వాత అడి గింది సంధ్య. "నీ బావంటే ఇష్టం లేదం టున్నావంటే... నీ మనసులో మరె వరైనా ఉన్నారా?"

సుచరిత మనసులోని మాట చెప్పడా నికి మొదట సంకోచించింది. కాని ఆ పరిస్థి తిలో తనకు సరైన సలహా ఇవ్వగలిగింది అత్త మాత్రమేనని మరోసారి గుర్తుకు రావడంతో మనసు విప్పడానికే నిర్ణయించుకుంది. 'ఎదురింట్లో అద్దెకు దిగిన అవినాష్‌తో పరిచయం, ప్రేమ, చివరగా తామిద్దరూ 'పెళ్ళికి పెద్దల్ని ఒప్పించడా నికి అనుకున్న ప్లాన్'తో సహా అంతా చెప్పేసింది.

ఆమె చెప్పినదంతా ప్రశాంతంగా విన్న సంధ్య కొద్దిక్షణాలు మాట్లాడలేదు. భావరహితంగా అలా ఉండిపోయింది.

జీవితంలో మునుపెన్నడూ అంత టెన్షన్

ఒక్క అంగలో అతణ్ణి చేరి కౌగిలిలో బంధించిందామె. ఒళ్ళంతా తడిమేయసాగింది. ఆ తనువుల రాపిడిలో అతడి చేతులు ఆమె జఘనాలపై వాలాయి. అక్కడి నుండి పైకి ఎగబాకుతూ ఎదపొంగులమీదకు చేరాయి.





## అబ్బే.. వారిద్దరి మధ్య ఏం లేదట!

సినీ పరిశ్రమలో గాసిప్స్ గాలి కన్నా వేగంగా ప్రయాణిస్తుం టాయి. రెండు సినిమాల్లో హీరో హీరోయిన్లు కలిసి నటిస్తే ఇక వారిద్దరి మధ్యా ఏదో ఉందనే పుకారు బాగానే షికారు చేస్తూంటుంది. నిఖిల్, కలర్స్ స్వాతి విషయంలో కూడా ఇదే జరిగింది. వీరిద్దరూ కలిసి నటించిన రెండు సినిమాలూ మంచి విజయాన్ని సాధించాయి. ఆ సినిమాల్లో వీరిద్దరి కెమిస్ట్రీ అదుర్స్ అన్న టాక్ కూడా వినిపించింది. దాంతో అప్పటి నుంచీ వీరిద్దరి మధ్యా ఏదో నడుస్తోందన్న పుకారు బాగానే వినిపిస్తోంది. అయితే మా ఇద్దరి మధ్యా స్నేహ సంబంధం తప్ప మరెలాంటి సంబంధం లేదంటూ నిఖిల్ తాజాగా స్పష్టం చేశాడు ఏమీ లేకుండా ఏదో ఉందంటూ ఎందుకు ప్రచారం చేస్తున్నారంటూ ఆగ్రహం కూడా వ్యక్తం చేశాడు. వస్తున్నవన్నీ పుకార్లని తెలిసినప్పుడు ఇంత బిల్డప్ ఎందుకు? అంటూ కొందరు నిఖిల్ మీద సెటైర్లు వేస్తున్నారు.

ఫీల్‌కాలేదు సుచరిత. అత్తముఖంలోకే చూస్తూ తను ఏం చెపుతుందా అని ఎదురుచూడ సాగింది. తను ఎంతకీ మాట్లాడకపోయేసరికి అడిగేసింది. "మాట్లాడవేంటత్తా?"

సంధ్య దీర్ఘంగా నిట్టూర్చింది. ఆ తర్వాత పెదవి విప్పింది. "ప్రేమలో అడుగు ముందుకు పడితే వెనక్కు తీసుకోవచ్చు. ఎందుకంటే ప్రేమంటే వ్యక్తిగతం కాబట్టి. కాని పెళ్ళి జరిగాక అడుగు వెనక్కు తీసుకోలేమే! ఎందుకంటే అది కుటుంబానికి, సమాజానికి సంబంధించిన విషయం కాబట్టి. నువ్వు చెప్పినదాన్ని బట్టి ఆ కుర్రాడి క్యారెక్టర్ ఏంటన్నది ఆలోచిస్తున్నానే! నువ్వు చెప్పింది యథాతథంగా కరెక్టే అయితే అతడి విషయంలో నువ్వు మరోసారి ఆలోచించుకోమనే నా సలహా".

"అదేంటత్తా అలా అంటున్నావ్! అవినాష్ చాలా మంచివాడు".

"ఏ ప్రేమికురాలైనా తన ప్రియుడు మంచి వాడనే అనుకుంటుంది. అలా అనుకోకపోతే అసలు ప్రేమించలేదు. మంచివాడు అనుకున్న ప్రతి ఒక్కడూ మంచివాడు కాకపోవచ్చు. అందువల్లే ఎన్నోవిడాకులు, మౌన పోరాటాలు జరుగుతున్నాయి".

అప్పుడే సుచరితకు ఓ అనుమానం కలిగింది. అవినాష్‌తో పెళ్ళి చెడగొట్టడం కోసం అత్త ఇలా మాట్లాడడం లేదు కదా? తన మనసుని డైవర్ట్ చేసే ప్రయత్నం చేస్తోందా?

తన మనసులోని మాట గ్రహించినట్టుగా ఆమె అంది. "...నేనిలా అంటున్నానంటే నీ మనసు మార్చడానికో, మరోటో అనుకోకు. కనీసం తల్లి ముందు కూడా విప్పని మనసు నా ముందు విప్పిన నీ నమ్మకాన్ని గౌరవిస్తూనే ఇలా అంటున్నా. మరోసారి ఆలోచించు".

"మరి నన్నిప్పుడు ఏం చేయమంటావత్తా?"

"ఒక పనిచేయ్! అసలు వ్యక్తిత్వం అంటే ఏంటో తెలుసుకో. ఆ తర్వాత నిర్ణయించుకో.." అంటూ చెప్పసాగింది.

●●●

"హాయ్ బావా!"

మోటార్‌పంపు దగ్గర నిలబడి పొలం వైపు చూస్తున్న ఈశ్వర్, మరదలి గొంతు వినగానే తలతిప్పి చూశాడు. ఆమెను చూడగానే అతడి ముఖంలో మెరుపు మెరిసింది.

"హాయ్ సుచీ! ఏమిటీ హఠాత్‌దర్శనం" అంటూ ఒక అడుగు ముందుకేసి ఆమె దగ్గరగా వచ్చాడు.

అప్పుడే సుచరిత బావకేసి పరిశీలనగా చూసింది.

ఈశ్వర్ ఆరడుగుల ఎత్తుంటాడు. రోజూ వ్యాయామం చేస్తాడని తను వింటోంది. అందువల్లే కాబోలు కండలు తిరిగిన శరీరంతో అచ్చు సినిమా హీరోలానే ఉంటాడు. మరి ఇంత అందగాడిని కాదని ఆ అవినాష్‌ని ఎందుకు ఇష్టపడుతోంది?!

తను చూసిన చాలా సినిమాల్లో హీరోయిన్స్ కూడా తల్లిదండ్రులు చూసిన గొప్ప సంబంధాలు వద్దనుకుని ఏ పనికిమాలినవాడినో ప్రేమించేసి, తల్లిదండ్రులకి తలనొప్పులు తెస్తుంటారు. అలా ఎందుకంటే అదే ప్రేమ అంటారు.

## రెజీనా వదిలించుకున్నదెవరినీ?

**టా**లీవుడ్‌లో రెజీనా ఓ హీరోతో డేటింగ్‌లో ఉందన్న వార్తలు బాగా హల్‌చల్ చేస్తున్న తరుణంలో రెజీనా ఇటీవల ఓ ఇంటర్వ్యూలో 'ప్రస్తుతానికి తాను సింగిల్‌గా ఉన్నాననీ, గతంలో ఉన్న బాయ్ ఫ్రెండ్స్‌ను వదిలించుకున్నాననీ' చెప్పుకొచ్చింది. అయితే రెజీనా వదిలించుకుంది టాలీవుడ్ హీరోనా? లేక చదువుకునే రోజుల్లో ఉన్న ఫ్రెండ్సా? అన్న అనుమానాన్ని చాలామంది వ్యక్తం చేస్తున్నారు. ఈ సందేహాలు తీర్చకపోతే రెజీనా మీద మరిన్ని పుకార్లు వచ్చే అవకాశాలు ఉన్నాయంటున్నారు టాలీవుడ్ జనాలు.



తను కూడా అలా ప్రేమిస్తున్నా, తన ప్రేమికుడిని మరొకరితో పోల్చి ఒకసారి చూసుకోమంటోంది అత్త. ప్రేమలో పడిన వాళ్ళకు ఇలాంటి సలహా ఇచ్చే వాళ్ళుండకపోవచ్చు. ఒకవేళ ఉన్నా ప్రేమమత్తులో వాళ్ళూ ఒప్పుకోకపోవచ్చు. కాని తనిప్పుడు బావ క్యారెక్టర్ పరిశీలించడానికే నిర్ణయించుకుంది. ఆ తర్వాత పోల్చిచూసుకోవడం, నిర్ణయం తీసుకోవడం.

"బావా! నీతో కాసేపు మాట్లాడాలని..."

"పద! అలా మోటార్‌షెడ్‌లో కూర్చుని మాట్లాడుకుందాం" అతడు ఆ వైపు నడిచాడు. ఆమె అనుసరించింది.

ఇద్దరూ షెడ్‌లోపల కూర్చున్నాక అతడు అన్నాడు. "చెప్పు సుచీ! ఏం మాట్లాడాలనుకుంటున్నావు?"

"అది... అది..." అంటూ అరనిమిషం నసిగాక చెప్పింది. "...బావా! మనిద్దరికీ పెళ్ళికాబోతుందని అందరూ అంటున్నారు. నాకేమో ఈ పెళ్ళి ఇష్టమే. కాని నీకు నన్ను పెళ్ళి చేసుకోవడం ఇష్టమో, కాదో తెలుసుకుందామని ఇలా వచ్చాను".

ఈశ్వర్ మరదలికేసి కొద్దిక్షణాలు తదేకంగా చూశాడు. ఆ తర్వాత అడిగాడు "ఆ అనుమానం నీకెందుకొచ్చింది?"

"అంటే.. నేనేమో ఈ పల్లెలో పదో తరగతి వరకూ చదువుకుని ఆపేశా. నువ్వేమో సిటీకెళ్ళి చదువుకుని వచ్చావు. అక్కడ కాలేజీలో ఏ అమ్మాయినైనా ప్రేమించడం.."

అతడు ఆమెకు దగ్గరగా ఒక అడుగువేసి కళ్ళలోకి చూస్తూ పలికాడు. "సుచీ! సిటీలో ఎంతో మంది అమ్మాయిలను చూశాను. కాని ఎందుకో నా మరదలు నా మనసుకి నచ్చినట్టుగా మరెవరూ నచ్చలేదు. ఇది నిజం".

సుచరిత మనసు అదోరకమైన ఫీలింగ్‌తో బరువెక్కిపోయింది. 'బావకు తనమీద ఇంత ప్రేముందా? ఇంత ప్రేమను గుర్తించకుండా తను మరొకరిని...?!' వెనువెంటనే తన మనసుకి సర్ది చెప్పుకుంది... 'ఊహు! బావ ప్రేమ సంగతేమో గానీ ముందు తన ప్రేమను నెగ్గించుకోవాలి. ప్రేమ సంగతి పక్కనపెడితే తన వ్యక్తిత్వమేమిటో ముందు తెలియాలి..."

అందుకే అతడి నోటివెంట ఆ మాట రాగానే, తనలో ప్రేమ పొంగిపొరలినట్టుగా ఒక్క అంగలో అతడిని చేరుకుంది. కౌగిలిలో బంధించి "బావా! ఐ లవ్ యూ" అంటూ తమకం నటిస్తూ ఒళ్ళంతా తడిమేయసాగింది.

అలా తడమడంతో తన పయ్యెద తొలగింది. అతడి చుబుకం తగిలి జుట్టు చెదిరింది.

అతడు తనను నెట్టేయాలనే అనుకున్నట్టుంది. కాని తనువుల రాపిడిలో పుట్టిన అయస్కాంతం ఆ పని చేయనివ్వడం లేదు. అందువల్లే అప్రయత్నంగానే అతడి చేతులు ఆమె పిరుదుల మీద వాలాయి. అక్కడినుండి పైపైకి ఎగబాకుతూ ఎదపొంగుల మీదకు చేరి కుచసింహాసన అధిష్ఠానంతో సకల తనూ రాజ్యాధికారం సాధించాలని అనుకుంటుంటే, సమరంలో అతడిదే విజయం కాకుండా ఆమె అడ్డుకుంది.

అప్పుడే మనసులో అనుకుంది. 'ఈ నాటకం నా తనువుకు పరీక్ష పెడుతోంది. బాహుబంధాల బంధం మనసుమాట వినేలా లేదు. ఒకవేళ రావలసినవాళ్ళు రావడం ఆలస్యమైతే...?!'

అలా అనుకుంటున్న సమయంలో షెడ్ తలుపు తెరుచుకుంది.

అతడు ఉలిక్కిపడి అటు చూశాడు. ఆమె అదిరిపడ్డట్టు నటించింది.

లోపలికి రావడానికి కష్టమైందో, అసహ్యమనిపించిందో తెలియదుగానీ, అక్కడ నిలబడిన రామచంద్రరావు తమవైపు చూస్తున్న చూపులు సిగ్గుతో చచ్చిపోవాలనిపించేలా ఉన్నాయి.

తన మేనమామ ఊహాతీతమైన దృశ్యమేదో కంటపడినట్టు అవాక్కయి అలా ఉన్నాడు. ఆయన పక్కనే ఉంది ఆయన చెల్లెలు సంధ్య.

అతడికి కూడా అది ఊహాతీత విషయమే! అందుకే కొద్ది క్షణాలు అయోమయంగా అలా ఉండిపోయాక, ఆ తర్వాత తేరుకున్నాడు. ఇప్పుడు ఆలోచించవలసింది తన గురించి కాదనుకున్నాడేమో! చప్పున సుచరిత వంక చూశాడు.

సుచరిత శరీరం సన్నగా వణుకుతోంది. భయం ఆమె కళ్ళల్లో స్పష్టంగా కనిపిస్తోంది.

అతడు గాఢంగా నిశ్వసించాడు. ఉన్నచోటనే చప్పున నేలమీద కూలబడిపోయి రెండు చేతులూ జోడించి ఏడుపుగొంతుతో చెప్పాడు. "నన్ను క్షమించండి మామయ్యా! పెళ్ళయ్యేవరకూ ఆగలేక ఆవేశపడ్డాను. పాపం! సుచరిత ఎంత గింజుకుంటున్నా వినక, ప్రాధేయపడుతున్నా కనికరించక కఠినంగా ప్రవర్తించాను.."

అతడు మరేదో చెపుతున్నాడు. కాని ఆ మాటలేవీ సుచరిత చెవికెక్కడం లేదు.

•••

"ఎందుకో వాడంటే ఇష్టం అంటారు ప్రేమించే అమ్మాయిలు. కాని 'ఎందుకో' అన్న అస్పష్టత ఎప్పుడోకప్పుడు తొలగిపోయి, 'ఏమిటిది' అన్న భావం ఎప్పుడోకప్పుడు మనసులో జనిస్తుంది. ఆవేశపడి పెళ్ళిచేసుకున్న అనేక జంటలు ఆ తర్వాత విడిపోవడానికి కారణం ఇదే! నువ్వూ ఇంకా 'ఎందుకో' దగ్గర ఆగిపోతే చెప్పు! మీ నాన్నతో మాట్లాడతా. మాట్లాడడానికి వెళ్ళిన ఆడపిల్లను రేప్ చేయబోయినవాడు నీకు అల్లుడుగా తగడని అన్నయ్యకు చెపుతా. దాంతో నీ బావతో నీ పెళ్ళి క్యాన్సిల్ అవుతుంది. అవినాష్‌తో నీ పెళ్ళికి లైన్ క్లియర్ అవుతుంది".

సుచరిత బదులివ్వలేదు. కాని ఆమె ముఖంలోకి చూస్తేనే అర్థమవుతోంది తన మనసులోని సంఘర్షణ!

ప్రేమ పెళ్ళిగా మారకముందు ఆడపిల్ల మనసులో తప్పక కలిగితీరాల్సిన మానసిక సంఘర్షణ అదే! ఒక్కసారి అలాంటి ఫీలింగ్ ఏర్పడితే 'ఏమిటో' అన్న అస్పష్టత నుండి 'ఎందుకు' అన్న స్పష్టత కలిగి తీరుతుంది.

అందుకే సంధ్య తృప్తిగా నిట్టూర్చింది. అయినా తను చెప్పదలచుకున్నది చెప్పింది. "సుచీ! నీకు తెలుసా? ఒకడు ఓ అమ్మాయి తనకు క్లోజ్‌గా మూవ్ అయి కూడా పెళ్ళికి ఒప్పుకోలేదని, తనతో క్లోజ్‌గా ఉన్న ఫోటోలను నెట్‌లో పెట్టి ప్రపంచమంతా చూసేలా చేసి శాడిస్టిక్ ఆనందం పొందాడు. వాడిది ప్రేమ అందామా? నీ ప్రేమికుడు అలాంటి పని చేయబోయాడు. తను మీ రాసలీలను ఊరంతాచూసేలా చేసి నీకు మరో దిక్కు లేకుండా చేయాలనుకుంటున్నాడు. 'ప్రేమించినవాడు ప్రియురాలితో పెళ్ళికోసం దేన్నయినా 'ఎర' వేయొచ్చు. కాని కాబోయే ఇల్లాలి 'శీలం' ఎర వేయకూడదు. అసలు అలా చేయాలన్న ఆలోచన కూడా రాకూడదు. అలాంటి ఆలోచన వచ్చిందంటే వాడివల్ల ఎప్పటికైనా ప్రమాదమే! ప్రేమ ఎప్పుడూ గొప్పదే! కాని ప్రతి ప్రేమికుడూ గొప్పవాడు కాదు. 'నీ బావ నీ తప్పుని కూడా తనమీద వేసుకుని నీ తండ్రి ముందు నువ్వు తలదించుకోకుండా కాపాడాడు. అవినాష్ ఊరందరి ముందు నీ శీలాన్ని నడిబజారులో పెట్టి తన లక్ష్యం సాధించాలనుకుంటున్నాడు. వారిద్దరిలో ఎవరి వ్యక్తిత్వం గొప్పదో ఆలోచించు. పెళ్ళికి ముందు మనిషిమీద ఉండే భ్రమలు ప్రేమను నిలబెడతాయి. పెళ్ళయ్యాక వ్యక్తిత్వాలే జీవితాలను కాపాడతాయి. అది తెలుసుకో".

సుచరిత గాఢంగా ఊపిరి పీల్చుకుని వదులుతూ చెప్పింది "అత్తా! నేను బావనే పెళ్ళి చేసుకుంటాను".

•••

సుచరిత 'గతం' నుండి వర్తమానానికొచ్చింది. ఆ 'గతం'లో తన తాలూకూ తెలియని 'రహస్యాలను' కూడా పెళ్ళికిముందే ఈశ్వర్‌కి చెప్పింది. చివరగా అంది. "భార్యాభర్తలయ్యాక అపోహపడే విషయాలేవీ మనమధ్య ఉండకూడదు బావా! మరో వ్యక్తి వ్యక్తిత్వంతో నీ వ్యక్తిత్వం పోల్చి చూసుకునే ప్రయత్నంలో నిన్ను బాధపెట్టాను.."

అతడు మౌనంగా ఉండిపోతే అనుమానంగా అడిగింది. "బాధగా ఉందా బావా?"

"లేదు!... అప్పట్లో స్వయంవరంలో ఏదో పరీక్షలో గెలిచి కోరిన వధువును పొందేవారట. ఈ పోటీలో నా వ్యక్తిత్వంతో నిన్ను గెలుచుకున్నందుకు ఆనందంగా ఉంది".

ఆనందంతో అతడిని హత్తుకుపోయింది సుచరిత.

"అయితే మన మొదటిరాత్రి మోటార్‌షెడ్‌లో జరగబోతున్నదన్నమాట".

"అది మొదటిరాత్రి కాదు. మనసులు కలిసిన మన తనువులు కలిసే శుభవేళ. అంతే!'

•••

కొత్త జంట సాయంత్రం షికారుగా పొలం వెళ్తామంటే ఎవ్వరూ అభ్యంతరం చెప్పలేదు.

ఈశ్వర్, సుచరిత పొలంలోని మోటార్‌షెడ్ దగ్గరకు చేరుకున్నారు.

అతడు షెడ్ తలుపు తాళం తెరిచాడు.

లోపలికి తొంగిచూసిన ఆమె ఆశ్చర్యపోయింది.

మోటార్‌షెడ్‌లో కొత్తగా ఓ మంచం వచ్చి చేరింది. ఆ మంచం మీద మల్లెలు పరచబడ్డాయి. ఆ పక్కనే టీపాయ్ మీద స్వీట్లు, పళ్ళు ఉన్నాయి. అది తీర్చిదిద్దబడిన శోభనం గదిలానే ఉంది.

"బావా! ఇదంతా ఎప్పుడు చేశావు?"

"ఉదయమే పొలానికొచ్చి ఎవరికీ తెలియకుండా ఈ ఏర్పాట్లు చేసుకుని వచ్చాను. మోటార్‌షెడ్‌కి రేకులు కూడా తీసేశాను! 'ప్రకృతి ఒడిలో సాగే ఈ శృంగార సామ్రాజ్యం మనదే. ఇక్కడికి ఎవరూరారు. రాలేరు. ఆ హామీ నాదే. ఆ రోజు కాదు, ఇక ఈరోజు రెచ్చిపోయే బాధ్యత నీదే' అన్నాడు అతడు ఆమెను దగ్గరకు తీసుకుంటూ.

"అంటే సృష్టి తిరగబడేలా చేయనా?"

"అంటే?"

"ఆడది భూమి, పురుషుడు ఆకాశం... సృష్టి తిరగబడడమంటే, ఆకాశం కిందికి జారుతుంది. నేల.."

"అబ్బా... నువ్వెంత ఆవేశంలో ఉన్నావో అర్థమవుతోంది. రస ప్రయోగాలకు సమయం ఇంకా ముందుంది. ముందు ఈ సృష్టిని డిస్ట్రబ్ చేయకుండా ఉంటేనే మంచిది..." అంటూ అతడు ఆమెను తనలో కలిపేసుకునే ప్రయత్నం మొదలుపెట్టాడు.

ఇక ఆగలేనంటూ ఆమె అతడిని హత్తుకుపోయింది.

యుద్ధంలో ప్రత్యర్థిని మొదట నిరాయుధుడిని చేస్తారు. శృంగార సమరంలో తనువులను నిర్వస్త్రగా మారుస్తారు. ఆ సమయంలో ఎవరు ఎవరిని అలా చేశారో తెలియదు. తెలిసినా అది ఆనందదాయకమేతప్ప ఓటమికి ప్రతీక కాదు. నిజానికి గెలుపు ప్రారంభం అదే .

అప్పుడే ఆరంభమైన ఆ జంట సుదీర్ఘ శృంగార జీవితాన్ని ఆశీర్వదిస్తున్నట్టు ఆకాశం నుండి జారిన చినుకులు వారిని తాకాయి.

***సెల్: 93475 11839***



## పుస్తక సమీక్ష



**మది శారదాదేవి మందిరమే**

బ్రహ్మశ్రీ మల్లాది రామకృష్ణ శాస్త్రిగారి కథ, నవల, వ్యాసాలు, సినీ సాహిత్యానికి మానసోల్లాస వ్యాఖ్య

డాక్టర్ వి.వి.రామారావు

ధర: 300 రూపాయలు

పేజీలు: 402

ప్రతులకు: క్రియేటివ్ లింక్స్, నవచేతన, విశాలాంధ్ర, నవ తెలంగాణ, ప్రజాశక్తి, నవోదయ, తెలుగు బుక్‌హౌస్‌లు.

సమాజ శ్రేయస్సును కాంక్షిస్తూ నిరాడంబరంగా జీవించిన పండితులలో ఒకరు బ్రహ్మశ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి. బహుభాషా నిపుణుడు. వారిది కళాత్మకదృష్టి. ఉత్తమ రసవాది, సౌందర్యవాది, శబ్ద రహస్యమెరిగిన వారు. కథా, నవలా రచయిత, వ్యాసకర్త మాత్రమే కాదు, 1950-68 నాటి సినీ కథా, గేయ రచయిత. ఆయన పాటలన్నీ సినీ సరస్వతికి నైవేద్యాలే. తెలుగుభాషకు అందాన్ని, తెలుగు కథకు యౌవనాన్ని అందించిన ఘనత వారిది. జనవ్యవహారంలో ఉన్న జాతీయాలు, లోకోక్తులను తన పాటలలో పొదిగిన ఘనుడాయన. రెండువందలకుపైగా ఉన్న ఆయన పాటలు పాత్రల నేపథ్యం, కథా సంవిధానం గుర్తుతెచ్చే నవరసాల నిలయాలు! చిన్నకోడలు, చిరంజీవులు, రాజనందిని, స్వర్ణమంజరి, ఆడపెత్తనం, ఇంటిగుట్టు, శ్రీకృష్ణరాయబారం, టాక్సీరాముడు వంటి ఎన్నో చిత్రాలకు కథ, మాటలు, పాటలు కూర్చారు. తెలుగు చలనచిత్రరంగ విశిష్ట వ్యక్తుల రచనలను వెలికితెస్తున్న క్రియేటివ్ లింక్స్ సహకారంతో మల్లాదివారి జీవిత కృషిపై పరిశోధనచేసి మధుర వ్యాఖ్యానం, విశ్లేషణలకు పుస్తకరూపమిచ్చారు డాక్టర్ వి.వి.రామారావు. ఈ తరం సినీ రచయితలు, రసజ్ఞులైన ప్రేక్షకులు మెచ్చే పుస్తకమిది.

---

**విశాఖ కథా తరంగాలు**

కథా సంకలనం

విశాఖ రచయితల సంఘం

ధర: 100 రూపాయలు, పేజీలు: 136

ప్రతులకు: ప్రముఖ పుస్తక దుకాణాలు, సంఘ కార్యదర్శి అడపా రామకృష్ణ, దొండపర్తి, విశాఖపట్నం-16

సెల్: 95052 69091

విశాఖ రచయిత సంఘం కొత్త కాంతులు సంతరించుకుంది. అడపా రామకృష్ణగారి క్రియాశీల సాహితీ కర్తృత్వంలో తొలివిడతగా ఇరవై కథల ఈ సంకలనం వెలువడింది. మలి విడత 18 కథలతో మరో సంకలనం రానున్నది. సమష్టి ఆర్థిక కృషితో విశాఖ కథా రచయితలు సాధించిన విజయమిది.



---



**తెరకోయ**

డా.మాటూరి శ్రీనివాస్

ధర: 100 రూపాయలు

పేజీలు: 208

ప్రతులకు: రచయిత, సాయిచంద్ర అపార్ట్‌మెంట్స్, దువ్వాడ స్టేషన్‌రోడ్, విశాఖపట్నం-46

సెల్: 98490 00037

వ్యక్తిత్వ వికాసానికి అవసరమైన మౌలిక ఆవశ్యకత 'మార్పు'. ఆ మార్పును జపనీయులు ఎలా జీర్ణించుకున్నారో, ఆచరించారో తెలియజేసే చారిత్రక, సామాజిక విషయాలను, అనుభవాలను తెలుగు, ఆంగ్ల భాషల్లో వివరించే యాత్రా రచనిది.

## స్వీకారాలు

**రేపటి జ్ఞాపకం** కవిత్వం

అడిగోపుల వెంకటరత్నమ్

ధర: 100 రూపాయలు, పేజీలు: 128

ప్రతులకు: ప్రజాశక్తి, విశాలాంధ్ర బ్రాంచీలు

**శ్రీగురు రాఘవేంద్ర శతకం**

మల్లేపల్లి శేఖర్‌రెడ్డి

ధర: 50 రూపాయలు, పేజీలు: 26

ప్రతులకు: యెన్నం రుక్మాంగదరెడ్డి

సెల్: 94403 09087

**పీవీ మన లీవీ**

రచన: చీకోలు సుందరయ్య

ధర: 60 రూపాయలు, పేజీలు: 74

ప్రతులకు: ప్రముఖ పుస్తక దుకాణాలు

**ఈ నేల వెన్నెల కాయనీ**

కవిత్వం

సంపాదకులు: అందోజు పరమాత్మ

ధర: 60 రూపాయలు, పేజీలు: 128

ప్రతులకు: 89788 69183, 90522 03843.

-లలితా త్రిపుర సుందరి




# పరువు తీస్తున్న ఆర్టికల్




**అరుణాచల్ ప్రదేశ్, ఉత్తరాఖండ్ అనుభవాల నేపథ్యంలో ఆర్టికల్ 356ను రద్దు చేయడమో, గవర్నర్ పదవికి ఉద్వాసన చెప్పడమో జరగాలి.**

ఆర్టికల్ 356కి ఉన్న రాజకీయ చరిత్రను దృష్టిలో పెట్టుకుని ఆలోచిస్తే, దీన్ని చాలా కాలం కిందటే రద్దు చేసి ఉండాలనిపిస్తుంది. ఇది ఇంకా చట్టంగా ఉందంటే అందుకు ప్రధాన కారణం ఇది కేంద్రంలోని పాలక పక్షానికి అడపాదడపా ఉపయోగపడుతుండడమే. ప్రతిపక్షాల పాలనలోని ప్రభుత్వాలను అస్థిరం చేయడానికి కేంద్రంలోని పాలక పక్షం దీనినొక బ్రహ్మాస్త్రంగా తరచూ ఉపయోగిస్తుంటుంది. అరుణాచల్ ప్రదేశ్‌లో విధించిన రాష్ట్రపతి పాలనను రద్దు చేసి, అక్కడి కాంగ్రెస్ ప్రభుత్వాన్ని పునరుద్ధరించాలంటూ సుప్రీం కోర్టు ఇటీవల రూలింగ్ ఇవ్వడంతో ఆర్టికల్ 356 మీద మళ్లీ చర్చ మొదలైంది. రాష్ట్రపతి పాలన విధించడానికి సంబంధించిన ఈ ఆర్టికల్ 356 ఉండాలా, వద్దా అన్నది ఇప్పుడు పరిశీలనాంశమైంది.

సుప్రీం కోర్టు తన రూలింగ్‌లో కేంద్రంలోని పాలక బీజేపీ ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించింది. అరుణాచల్ ప్రదేశ్‌లో రాష్ట్రపతి పాలన విధించాలన్న రాష్ట్ర గవర్నర్ జేపీ రాజ్‌ఖోవా నిర్ణయం చట్ట విరుద్ధం, రాజ్యాంగ నిబంధనలకు పూర్తి వ్యతిరేకం అంటూ అది గట్టిగా మందలించింది. తరచూ ప్రభుత్వాల రద్దుకు పాల్పడుతున్న రాజకీయ పాలక పక్షాలు సుప్రీం కోర్టు మందలింపుల నుంచి నేర్చుకుంటున్నది ఏమైనా ఉందా అన్నది ఇక్కడ ప్రశ్న. గత చరిత్రను బట్టి చూసినా, ఇప్పటి రాజకీయ స్పందనలను పరిశీలించినా తెలుతున్నది ఏమిటంటే, రాజకీయ పార్టీలు గుణపాఠం నేర్చుకునే సూచనలేమీ లేవనే. రెండు నెలల క్రితమే బీజేపీ ప్రభుత్వాన్ని సుప్రీం కోర్టు ఇదే విషయంలో గట్టిగా మందలించాల్సి వచ్చింది. ఉత్తరాఖండ్‌లో హరీశ్ రావత్ నేతృత్వంలోని కాంగ్రెస్ ప్రభుత్వాన్ని బీజేపీ ప్రభుత్వం రద్దు చేసి, రాష్ట్రపతి పాలన విధించిన సందర్భం అది.

సుప్రీం కోర్టు రావత్ ప్రభుత్వాన్ని పునరుద్ధరించింది. శాసనసభలో తమ ప్రభుత్వ మెజారిటీని నిరూపించుకోవాలని రావత్ ప్రభుత్వానికి సూచించింది. "ఉత్తరాఖండ్‌లో రాష్ట్రపతి పాలనను రద్దు చేసి, రావత్ మళ్లీ ముఖ్యమంత్రి పదవిని చేపట్టడానికి అవకాశం కల్పించాలని కేంద్రం భావిస్తోంది" అని సుప్రీం కోర్టుకు విన్నవించడానికి అప్పట్లో అటార్నీ జనరల్ ఎంతగానో ఇబ్బంది పడి ఉంటారు. ఈసారి కూడా కాంగ్రెస్ ఆనందానికి పట్టపగ్గాలు లేవు. అరుణాచల్ ప్రదేశ్‌లో రాష్ట్రపతి పాలనను తొలగిస్తూ, కాంగ్రెస్ ప్రభుత్వాన్ని పునరుద్ధరిస్తూ సుప్రీం కోర్టు ఇచ్చిన రూలింగ్ 'ప్రజాస్వామ్యానికి విజయం' అంటూ కాంగ్రెస్ అగ్రనాయకత్వం అభివర్ణించింది. కాంగ్రెస్ స్థానంలో బీజేపీ గనుక ఉండి ఉంటే, విచక్షణా రహితంగా ఆర్టికల్ 356ను ప్రయోగించడాన్ని తీవ్ర పదజాలంతో ఖండించేది. ఈ పార్టీ ఆ పార్టీ అన్న తేడా లేదు. రాజకీయ స్వప్రయోజనాల కోసం ఆర్టికల్ 356ను దుర్వినియోగం చేయడంలో ప్రతి పార్టీ తన వంతు పాత్ర పోషించింది.

### అన్ని పార్టీలూ ఇదే తంతు!

వ్యూహాలు, ఎత్తుగడలు పన్నడంలో ఏ రాజకీయ పార్టీ కూడా తక్కువ తినలేదు. ప్రతిపక్షాల నాయకత్వంలో ప్రభుత్వాలు ఉన్న రాష్ట్రాలకు తమకు అనుకూలమైన గవర్నర్లను పంపి, తాము అనుకున్నది సాధించడానికి కాంగ్రెస్, బీజేపీ అన్న తేడా లేకుండా ప్రతి పార్టీ ప్రయత్నించింది. పార్టీలకు విధేయులుగా ఉన్నవారికే గవర్నర్ పదవులను కట్టబెట్టడం ఈ ప్రయోజనం ఆశించే జరుగుతోంది. గవర్నర్ అంటే కీలుబొమ్మ అనే అర్థం అన్నట్టుగా పరిస్థితి తయారైంది. అసలు ఆర్టికల్ 356ను ప్రవేశపెట్టడానికి కారణమేమిటి? దీనివల్ల ఎటువంటి మంచి ప్రయోజనాన్ని ఆశించారు? "రాజ్యాంగానికి అనుగుణంగా రాష్ట్ర ప్రభుత్వాన్ని నిర్వహించలేకపోతున్నప్పుడు" ఆర్టికల్ 356 కింద రాష్ట్రపతి పాలన విధించాలని ఇది చెబుతోంది. అయితే, గత 50 ఏళ్లుగా ఈ ప్రయోజనానికి విరుద్ధంగానే రాష్ట్ర ప్రభుత్వాలను రద్దు చేయడం జరుగుతోంది. తమ అదుపూ అజమాయిషీల్లో లేని ప్రభుత్వాలను తొలగించడానికే ప్రతి రాజకీయ పార్టీ ఈ ఆర్టికల్ 356 కింద ప్రభుత్వాలను కూలదోస్తోంది.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత వివిధ రాష్ట్రాల్లో మొత్తం 124 సార్లు రాష్ట్రపతి పాలన విధించారు. మణిపూర్‌లో పది సార్లు రాష్ట్రపతి పాలన విధించారు. ఇక ఉత్తరప్రదేశ్, పంజాబ్‌లలో అయితే తొమ్మిదిసార్లు చొప్పున కేంద్ర పాలన విధించడం జరిగింది. రాష్ట్రపతి పాలన విధించడమనే వ్యవహారం 1951లో ప్రారంభమైంది. ఆ ఏడాది అప్పటి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ

పంజాబ్‌లో తొమ్మిది నెలల పాటు రాష్ట్రపతి పాలన విధించారు. కకావికలుగా ఉన్న కాంగ్రెస్ ప్రభుత్వం కూడగట్టుకోవడానికి రాష్ట్రపతి పాలన విధించడం జరిగిందని అప్పట్లో వార్తలు వచ్చాయి. ఎనిమిదేళ్ల తరువాత నెహ్రూ కేరళలో ఇ.ఎం.ఎస్. నంబూద్రిపాద్ ఆధ్వర్యంలోని కమ్యూనిస్ట్ ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేసి రాష్ట్రపతి పాలన విధించడం జరిగింది. తన రాజకీయ ప్రత్యర్థుల నాయకత్వంలోని ప్రభుత్వాలను వదల్చుకోవడానికి ఇందిరాగాంధీ కనీసం 50 సార్లు ఆర్టికల్ 356ను ప్రయోగించి ఉంటారు.

ఈ విషయంలో ఇతర పార్టీల ప్రభుత్వాలు కూడా వెనుకబడి లేవు. జనతా పార్టీ ప్రభుత్వం తొమ్మిది కాంగ్రెస్ ప్రభుత్వాలను బర్తరఫ్ చేసి, ఆర్టికల్ 356 ప్రయోగించింది. వాజ్‌పేయి నాయకత్వంలోని ఎన్‌డీఏ ప్రభుత్వం అధికారంలో ఉన్నప్పుడు, అప్పట్లో కేంద్ర ప్రభుత్వ మిత్రపక్షమైన తృణమూల్ కాంగ్రెస్ నాయకురాలైన మమత బెనర్జీ, పశ్చిమ బెంగాల్‌లో రాష్ట్రపతి పాలన విధించాల్సిందిగా కేంద్రంపై విపరీతమైన ఒత్తిడి తెచ్చేవారు. పశ్చిమ బెంగాల్‌లో కమ్యూనిస్టు కూటమి అధికారంలో ఉండేది. రాష్ట్రంలో శాంతిభద్రతలు సూచిస్తున్నారు. రాజ్‌భవన్‌లను ఆక్రమించే వృద్ధులను ఇక రిటైర్ చేసి, శేష జీవితాన్ని వారు తమ కుటుంబంతో గడపడానికి అవకాశం కల్పించడం మంచిదని వారు అభిప్రాయపడుతున్నారు. రాజ్‌భవన్‌లను ఉదయపు నడకలకు, యోగా తరగతుల నిర్వహణకు, పిల్లలు ఆడుకోవడానికి లేదా మరేదైనా సరైన ప్రయోజనానికి ఉపయోగించడం చాలా మంచిది. అరుణాచల్ ప్రదేశ్‌పై సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పును సరైన అవకాశంగా తీసుకుని, గవర్నర్ల నియామకంపై పునరాలోచన చేయాల్సి ఉంది.

ప్రజాస్వామ్యబద్ధంగా ఎన్నికైన ప్రభుత్వాలను అస్థిరం చేయడానికి, రాష్ట్ర ప్రభుత్వాల వ్యవహారాల్లో అనవసరంగా జోక్యం చేసుకోవడానికి చాలా ఏళ్లుగా కేంద్రం గవర్నర్ పదవులను ఉపయోగించుకుంటోంది. గవర్నర్లు కేంద్ర ప్రభుత్వ గూఢచారులుగా, ఏజెంట్లుగా ఉపయోగపడుతున్నారనే ఆరోపణ ఇందిరా గాంధీ హయాం నుంచి వినవస్తోంది. అరుణాచల్ ప్రదేశ్‌పై సుప్రీం కోర్టు తీర్పు వెలువడిన దగ్గర నుంచీ గవర్నర్లు రాష్ట్ర ప్రభుత్వాలను అస్థిరం చేసే రోజులు గతించాయనిపిస్తోంది. ప్రయోజనం ఉండకపోవచ్చు!

## ఎందుకీ పదవి?

నిజానికి గవర్నర్ పదవి పూర్తిగా అలంకార ప్రాయమైంది. గణతంత్ర దినోత్సవం సందర్భంగా ప్రసంగం చేయడం, అసెంబ్లీని ఉద్దేశించి లాంఛనంగా ప్రసంగించడం, పునఃపరిశీలించాల్సిందిగా మధ్య మధ్య కొన్ని బిల్లులను తిప్పి పంపడం వంటి అధికారాలకు మాత్రమే ఆ పదవి పరిమితం. ఈ కొద్దిపాటి అధికారాలతో గవర్నర్ పదవి ప్రాధాన్యం సంతరించుకోదు. కొత్త ప్రభుత్వాలతో ప్రమాణ స్వీకారాలు చేయించడం కూడా గవర్నర్‌కు ఉన్న ఓ ప్రధాన అధికారం. హంగ్ అసెంబ్లీలు ఏర్పడినప్పుడు, కొన్ని కుతంత్రాలు చేయడానికి గవర్నర్‌కు అవకాశం ఉండేది. ఇది ఒకప్పటి మాట. ఇప్పుడు శాసనసభలో బలం నిరూపించుకున్న పార్టీ అధికారంలోకి రావడం సహజ పరిణామంగా మారిపోయింది. ప్రమాణ స్వీకారాలు చేయించడం అనేది గవర్నర్లు మాత్రమే చేయనక్కర లేదు. ప్రధాన న్యాయమూర్తులు కూడా చేయొచ్చు.

నారాయణ్ దత్ తివారి, జేపీ రాజ్‌ఖోవా, రాం నరేశ్ వంటి గవర్నర్లు ఈ పదవిని అప్రతిష్ఠ పాలు చేశారు. అటువంటివారిని దృష్టిలో పెట్టుకు

హరీశ్ రావత్

**రాజ్‌భవన్‌లను ఆక్రమించే వృద్ధులను ఇక రిటైర్‌చేసి, శేషజీవితాన్ని వారు తమ కుటుంబ సభ్యులతో గడపడానికి అవకాశం కల్పించడం మంచిదని రాజకీయ నిపుణులు అభిప్రాయ పడుతున్నారు! అరుణాచల్ ప్రదేశ్‌పై సుప్రీంకోర్టు తీర్పు నేపథ్యంలో ఈ పునరాలోచన చేయాల్సిఉంది. రాజ్‌భవన్‌లను ఉదయపు నడకలకు, యోగా తరగతుల నిర్వహణకు, లేదా మరేదైనా సరైన ప్రయోజనాలకు ఉపయోగించడం చాలా మంచిది.**

పూర్తిగా క్షీణించిపోయాయనే సాకు చూపించడం ఆర్టికల్ 356 విధింపులో అలవాటుగా, ప్రధాన అస్త్రంగా మారిపోయింది. కాంగ్రెస్ ప్రభుత్వాలకు తమ ప్రభుత్వం భిన్నమైందని, వివిధ రాష్ట్ర ప్రభుత్వాల మధ్య, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య సహాయాలు, సహకారాలు పెంపొందాలని తమ ప్రభుత్వం భావిస్తోందని నరేంద్ర మోదీ అధికారంలోకి రాగానే పదే పదే ప్రకటించారు. అయితే, ఆయన ప్రభుత్వం కూడా ఉత్తరాఖండ్, అరుణాచల్ ప్రదేశ్‌లలో రాష్ట్రపతి పాలన విధించడాన్ని బట్టి, ప్రస్తుత కేంద్ర ప్రభుత్వం కూడా బీజేపీకి అనుకూలంగా లేని ప్రభుత్వాలను కూల్చేయడానికి పాల్పడుతోందనే సంగతి అర్థమవుతోంది.

## గవర్నర్ పదవి రద్దు?

ఉత్తరాఖండ్, అరుణాచల్ ప్రదేశ్ ప్రభుత్వాలను అస్థిరం చేయడానికి గవర్నర్ కార్యాలయాన్ని ఉపయోగించుకున్నందుకు మోదీ ప్రభుత్వం పశ్చాత్తాప పడుతుందా? ఒకవేళ పశ్చాత్తాపం ప్రదర్శించదలిస్తే అది చేయాల్సిన ఏకైక పని గవర్నర్ పదవిని రద్దు చేయడమేనని రాజకీయ నిపుణులు "అధికారంలో ఉన్న పార్టీలో వచ్చే అనంగీకారం, అసమ్మతి, అభిప్రాయభేదాలు, అసంతృప్తి వగైరాలకు గవర్నర్లు ఎంత దూరంలో ఉంటే అంత మంచిది" అని అరుణాచల్ ప్రదేశ్‌లో కాంగ్రెస్ ప్రభుత్వాన్ని పునరుద్ధరిస్తూ ఐదుగురు న్యాయమూర్తుల రాజ్యాంగ ధర్మాసనం స్పష్టం చేసింది. "నైతికంగా ఎంత దారుణంగా ఉన్నా సరే, రాజకీయ బేరసారాలకు, రాజకీయ కుట్రలు, కుతంత్రాలకు, వ్యూహ ప్రతివ్యూహాలకు గవర్నర్ సాధ్యమైనంత దూరంగా ఉండడం శ్రేయస్కరం. ఓ రాజకీయ పార్టీకి ఎవరు నాయకుడుగా ఉండాలి, ఎవరు నాయకుడుగా ఉండకూడదన్నది ఆ పార్టీకే వదిలిపెట్టాలి. అవి తనకు సంబంధించినవి కావని గవర్నర్ అర్థం చేసుకోవాలి" అని కూడా కోర్టు నొక్కి చెప్పింది. రాజకీయ పార్టీలను అదుపులో పెట్టడమనే అధికారాన్ని పూర్తిగా కోల్పోయిన గవర్నర్లు ఇక ఆ పదవిలో ఉండి చేసేదేమిటి? కేంద్రానికి అటువంటి గవర్నర్ల వల్ల ప్రయోజనం ఏమిటి? ప్రభుత్వాలను అస్థిరం చేసే అధికారాన్ని కోల్పోవడంతో కేంద్రానికి ఇక వారి వల్ల ఏమాత్రం నైనా గవర్నర్ పదవిని రద్దు చేయాలని రాజకీయ పరిశీలకులు భావిస్తున్నారు. గవర్నర్ల నియామకంపై కొన్ని సమూల సంస్కరణలు అవసరమని సర్కారియా కమిషన్ ఒకప్పుడు కేంద్ర ప్రభుత్వానికి సిఫారసు చేసింది. క్రియాశీల రాజకీయాలకు దూరంగా ఉండి, వివిధ రంగాలలో ప్రముఖంగా ఉన్న వ్యక్తుల్ని మాత్రమే గవర్నర్లుగా నియమించాలని, రాష్ట్ర ముఖ్యమంత్రి, ఉప రాష్ట్రపతి, లోక్‌సభ స్పీకర్‌లను సంప్రదించిన తరువాతే నియామకాలు జరపాలని సర్కారియా కమిషన్ సూచించింది. అయితే ఏ ప్రభుత్వమూ ఈ సంస్కరణలను పరిగణనలోకి తీసుకోలేదు. కేంద్రంలో అధికారంలో ఉన్న ప్రతి పార్టీ ఈ పదవుల్ని తమ విధేయులు, వందిమాగధులు, ఏజెంట్లతో నింపేయడం పరిపాటి అయిపోయింది. సర్కారియా కమిషన్ సిఫార్సుల్లో కొన్నిటినైనా కేంద్రం ఆమోదించి, అమలు చేసి ఉంటే గవర్నర్ల పదవికి ప్రతిష్ఠ మిగిలి ఉండేది. గవర్నర్ల పదవులపై నమ్మకం ఇంతగా సడలేది కాదు. ఇప్పుడిక గవర్నర్ పదవిని రద్దు చేయడం తప్ప మరో మార్గం లేదన్నట్టుగా దేశ రాజకీయ పరిస్థితి తయారైంది.




సరిగ్గా అదే సమయంలో కర్కరే ఇంట్లో మందు కొడుతున్నాడు. అన్వర్ కింద కూర్చుని అతడి పెగ్‌లో సోడా కలుపుతున్నాడు.

"ఏది ఏమైనా మీరు నక్కను తొక్కారు సర్" అన్నాడు అన్వర్, టీపాయ్ పక్కగా పెట్టుకున్న అతడి గ్లాసులోనుండి ఆల్కహాల్ గొంతులోకి ఒంపుకుంటూ.

"అంతేనంటావా?" అన్నాడు కర్కరే సంతోషంగా.

"అవును సార్, సమంతగారు మీ స్వప్నం, మీ ఆకాంక్ష. తనకై తనే వచ్చి ప్రపోజల్ చేయడమంటే చిన్న విషయం కాదుకదా సర్..." అన్నాడు అన్వర్.

కర్కరే ఒక నిమిషం డ్రీమ్‌లోకి వెళ్ళాడు. సమంత ఆఫీసులో చేరిన రోజు అతడికి బాగా గుర్తు. లేడిపిల్లలా అమాయకంగా వచ్చి చేరింది. అందంలోనే కాదు, వర్క్‌లో కూడా సిన్సియర్ అని అర్థమైంది. ఏదైనా తప్పు చేస్తే ఆ వంకతో ఆమెని కేకలేసి తనపై ఆధారపడేలా చేయాలనుకున్నాడు. తద్వారా లొంగదీసుకోవాలనుకున్నాడు. తను అలాంటి ఘటం కాదని నిర్ణయించుకున్న తర్వాత, పాజిటివ్‌గా ఆలోచించి ఆమె దగ్గర మార్కులు పొందాలనుకున్నాడు. ఈలోపు శ్రీకర్ ఆమెని గద్దలా తన్నుకుపోయాడు.

రక్తం ఉడికిపోయింది కర్కరేలో. అయినా చేసేది ఏమీలేక మౌనం వహించాడు. అదృష్టం మళ్ళీ ఈ రూపంలో వచ్చింది. యుఎస్‌లో నయాగరా జలపాతం దగ్గర తానూ, సమంతా విహరిస్తున్నట్టు ఊహించుకున్నాడు.

కర్కరే ఊహల్లో ఉన్నాడని అర్థమైన తర్వాత గబగబా ఫారెన్ లిక్కర్ మరో రెండు గుక్కలు ఎక్కువ వేశాడు అన్వర్. కర్కరే బలహీనత సమంత అన్న విషయం అర్థమైన తర్వాత అన్వర్ ఆ పరిస్థితిని బాగా ఉపయోగించుకున్నాడు. సమంత గురించి ఊరిస్తూ అతడు చెప్పినకొద్దీ కర్కరే అతడికి వెయ్యిరూపాయల నోట్లు గిఫ్ట్‌గా ఇవ్వడం మొదలైంది.

ఇప్పుడు నెయ్యి విరిగి...సారీ రొట్టె విరిగి నేతిలో పడిందా అన్పించింది అతడికి. ఈ దెబ్బతో తన చిరకాల కోరిక తీర్చుకోవాలనుకున్నాడు అన్వర్. హౌసింగ్‌లోన్‌కి అప్లయ్ చేసి ఉన్నాడు. అప్పటికే కటింగ్స్ ఎక్కువగా ఉన్నాయని హెడ్ ఆఫీస్ లోన్ రిజెక్ట్ చేసింది. ఇప్పుడు కర్కరే వకాల్తా ఇస్తేనే తనకి లోన్ మంజూరు అవుతుంది. అందుకే అతన్ని మరికాస్త ఉబ్బేయాలన్న నిర్ణయానికి వచ్చాడు అన్వర్.

"సార్, మీకెక్కడో సుడి ఉంది సర్.." అన్నాడు.

"అంటే ఏంట్రా...." అడిగాడు కర్కరే డ్రీమ్‌లో నుంచి బయటకు వస్తూ.

"సమంతగారు మీకు పడడమేంటి సర్, మీకు సుడి లేకుంటే.." అన్నాడు అన్వర్.

కర్కరే ముసిముసిగా మత్తులోనే నవ్వుకున్నాడు.

"అదేనోయ్ ఫేట్ అంటే" అన్నాడు తనకు తాను జబ్బలు చరుచుకుంటూ.

"అదేసార్ చెబుతున్నా. దాన్ని మీరు ఇంగ్లీష్‌లో ఫేట్ అంటారు. మేము సుడి అంటాం" చెప్పాడు అన్వర్.

అన్వర్‌ని అభినందనగా చూశాడు కర్కరే.

"సమంతగారు అంత త్వరగా ఎవరికీ ఈల్డ్ అయ్యే రకం కాదు. ఆమెకు ఎక్కడో మీ మీద ప్రేమ ఉండబట్టే సాధ్యం అయ్యింది సార్. శ్రీకర్ గారి కంటే పర్సనాలిటీలో మీరే టాప్. కాకపోతే

### జరిగిన కథ

*పెళ్ళి, తాళి వ్యవస్థపై సమంతకు నమ్మకం ఉండదు. శ్రీకర్ ఆమెను పెళ్ళిచేసుకోవాలని అనుకుంటాడు. ఆమె తిరస్కరిస్తుంది. కానీ ఇటు తల్లి ఆరోగ్యాన్నీ, అటు శ్రీకర్ ప్రేమనీ కాపాడుకునేందుకు పెళ్ళికి బదులు సహజీవనానికి అంగీకరిస్తుంది సమంత. కొంతకాలం తర్వాత ఒక బిడ్డను కని తన తండ్రి కోర్కె తీర్చమంటాడు శ్రీకర్. అందుకు తిరస్కరించి, శ్రీకర్‌ని మరో వివాహం చేసుకోమంటుంది సమంత. ఆ మాటకు అతడు దిగ్భ్రాంతి చెందుతాడు. అతన్ని వదిలి అమెరికా వెళ్ళిపోవాలనే ప్రయత్నంలో పడుతుంది సమంత. ఆ తర్వాత....*



మీకు బట్టతల ఉంది. అతడికి లేదు..." అన్నాడు అన్వర్.

"అంతే అంటావా? నాకు తెలుసు, నా గ్లామర్ అమ్మాయిలని నిద్రపోనివ్వదు.."

తనను తాను ఎక్కేసుకున్నాడు కర్కరే.

"అవును సార్.." చెప్పాడు అన్వర్.

"వెరీ గుడ్‌బాయ్, అందాన్ని ఇట్టే కనిపెట్టే సామర్థ్యం నీలో ఉంది" అభినందించాడు కర్కరే.

ఇదే మంచి సమయం అనుకుని చేతులు నులుముకుంటూ, "సార్ మీరు వెళ్ళేలోపు నన్నే ఇంటివాడిని చేయండి సార్" అన్నాడు.

"అదేంటి అన్వర్ నీకు పెళ్ళయింది కదా" అడిగాడు కర్కరే ఆశ్చర్యపోతూ.

"ఇంటివాడంటే పెళ్ళి చెయ్యమని కాదు సార్, హౌస్‌లోన్ శాంక్షన్ చేయండన్నది నా ఆబ్లిగేషన్ సార్..." చెప్పాడు అన్వర్.

"డెఫినెట్లీ నేను ష్యూరిటీ ఇచ్చి లోన్ శాంక్షన్ చేయిస్తా. డోంట్ వర్రీ..." చెప్పాడు కర్కరే.

మత్తులో మహదానందపడిపోయాడు అన్వర్.

మత్తులో ఉండగానే అతడిలో నుండి తన్నుకు వచ్చిన సందేహం అడిగాడు అన్వర్.

"యుఎస్‌కి వెళ్ళే అవకాశం సమంతగారికి మాత్రమే కదా సార్. మీరు కూడా వెళ్ళడానికి కంపెనీ అనుమతి ఇస్తుందా సార్..." సందేహం వ్యక్తం చేశాడు అన్వర్.

కర్కరేకి కాస్త మత్తు దిగింది.

అన్వర్‌గాడి సందేహం కరెక్టే అనిపించింది. ప్రాజెక్ట్ ఎగ్జిక్యూటివ్స్‌ని పంపడం వేరు. ప్రాజెక్ట్ హెడ్స్‌ని పంపడం దరిదాపు జరగదు. తనలాంటి సీనియర్ ఫ్యాకల్టీని అంత తొందరగా పంపరు. ఏదో భావావేశంతో సంతోషపడుతున్నాడు గానీ, యుఎస్‌కి తాను వెళ్ళే విషయంలో సీరియస్ ట్రయల్స్ మొదలుపెట్టాలి.

ముఖ్యంగా జోనల్ ఇన్‌ఛార్జ్ మెల్కోటేని సంతోషపెడితే తప్పా తను యుఎస్‌కి వెళ్ళడం సాధ్యం కాదు. ఈ వారంలో మెల్కోటే వస్తున్నాడు. అతన్ని ఎలా సంతృప్తి పర్చాలి? ఆలోచనల్లో పడ్డాడు కర్కరే.

అన్వర్ కర్కరే ముఖంలోకి చూస్తూ "ఎక్కడో



గుంటలో పడ్డాడు వీడు" అనుకున్నాడు.

అతడి పక్కన సమంతను ఊహించుకోవడానికి అన్వర్‌కి మనసొప్పలేదు. డోకు వచ్చినంత పనైంది. కానీ తానొక ఇంటివాడు కావాలంటే వీడికి పంపు కొట్టక తప్పదు అనుకున్నాడు. అన్వర్ కర్కరేని ఆలోచనల్లోంచి తప్పిస్తూ...

"సార్ ఫుడ్ సర్వ్ చేయనా?" అడిగాడు.

"ఓకే..." అన్నాడు పరధ్యానంగా.

అతడి కళ్ళకు మెల్కోటే కన్పిస్తున్నాడు. అతన్ని ఎలా కన్విన్స్ చేయాలా? అని ఆలోచిస్తున్నాడు. చిన్ని కళ్ళు, భారీ విగ్రహం, ఫ్రెంచి కట్టు మీసాలు వెరసి మెల్కోటే విచిత్ర రూపం కన్పించింది అతడికి.

•••

"వాట్ నాన్‌సెన్స్! ఆర్ యూ మ్యాడ్" అరిచాడు మెల్కోటే.

చేతులు నులుముకుంటూ నిల్చున్నాడు కర్కరే.

"స్మాల్ ఫేవర్ సార్..." అభ్యర్థించాడు.

"నిన్ను పంపిస్తే నన్ను పీకేస్తారు. నో, ఇట్స్ ఇంపాజిబుల్. ఈ బ్రాంచికి నువ్వు ఆయువుపట్టులాంటి వాడివి. నిన్ను పంపడం సాధ్యం కాదు. కంపెనీ హెడ్స్ ఒప్పుకోరు.." కరాఖండిగా చెప్పాడు మెల్కోటే.

ముఖం దిగాలుగా పెట్టాడు కర్కరే. తన నుండి సమంత దూరంగా వెళ్తున్న ఫీలింగ్...

"సార్...సార్.." పిలుపుతో లోకంలోకి వచ్చాడు కర్కరే.

ఎండ చర్రుమంటోంది. అన్వర్ అతన్ని లేపుతున్నాడు. మెల్కోటే కలలోకి వచ్చాడన్నది అర్థమయింది కర్కరేకి. ఉదయాన్నే వచ్చి ఆఫీస్ ఫైల్స్ తీసుకెళ్ళడం అతని అలవాటు.

"ఏంటి సార్, కలగన్నారా?" ఆసక్తిగా అడిగాడు అన్వర్.



**ప్రాయంలో ఉండే మగసింహం గర్జన ఎనిమిది కిలోమీటర్ల దూరం వినిపిస్తుంది.**

"అవున్రా! కల్లో మెల్కోటే నన్ను యుఎస్ పంపడానికి నిరాకరిస్తున్నారు" చెప్పాడు కర్కరే.

"అయితే సమంతమ్మ ఇక మీకు దక్కదా సార్..." అన్నాడు అన్వర్ విచారం నటిస్తూ.

"అన్వర్ నేను కన్నది కల. వాస్తవం దీనికి విరుద్ధంగా ఉండవచ్చు గదా..?" అన్నాడు కర్కరే ఒళ్ళు విరుచుకుంటూ.

"ఒకవేళ కల్లోలాగా జరిగితే..." సందేహించాడు అన్వర్.

కోపంగా చూశాడు కర్కరే.

"నువ్వు మూసుకొని ఫైల్సు తీసుకెళ్ళు" చెప్పాడు కర్కరే.

బాసుకు ఒళ్ళు మండిందని అర్థమై..."ఓకే సార్.." అని బైటపడ్డాడు అన్వర్.

•••

సమంత తననుండి దూరంగా వెళ్ళాలనుకుంటుందన్న విషయం రమణ ద్వారా తెలిసి

**అతడితో బంధం తెంచుకుని అమెరికా వెళ్ళిపోవాలని నిర్ణయించుకుందామె. ఆమె స్నేహితుల ద్వారా ఆ విషయం తెలుసుకుని అతడు దిగ్భ్రాంతి చెందాడు. అన్యమనస్కుడయ్యాడు. తనకు పిల్లలు వద్దని, సహజీవనం అగ్రిమెంటును బ్రేక్ చేసుకోవడం తనకు ఇష్టం లేదనీ ఆమెకు స్పష్టం చేశాడతను. అప్పుడామె ఎలా రియాక్టయింది? తన అమెరికా ప్రయాణం రద్దు చేసుకుందా?**

దిగ్భ్రాంతి చెందాడు శ్రీకర్. అందులోనూ వయసు ముదిరిన కర్కరేతో సహజీవనానికి సిద్ధపడుతోందని తెలిసి గుండెలు అవిసిపోయాయి.

"తను నీమీద ద్వేషంతోనో లేక కర్కరేమీద ప్రేమతోనో ఈ నిర్ణయం తీసుకోలేదు.." చెప్పాడు రమణ.

శ్రీకర్‌కి ఏమీ వినిపించడం లేదు.

"నాకు..నాకు పిల్లలు వద్దు. సమంతే కావాలి" అతడి స్వరం అతడికి బలహీనంగా వినిపించింది.

"బట్ యూ ఆర్ లేట్ శ్రీకర్" అంది అప్పుడే అక్కడికి వచ్చిన సమీర.

ఇద్దరికీ చెరొక కప్పు కాఫీ తెచ్చింది.

మాట్లాడాలి రమ్మంటే ఆఫీసు నుండి నేరుగా వెళ్ళాడు శ్రీకర్. అతడి కోసం సమీర, రమణ ఎదురు చూస్తున్నారు.

రమణ చెప్పిన సమాచారం వినగానే శ్రీకర్ మైండ్ బ్లాంక్ అయింది.

"సమీరా, నువ్వైనా తన ఆలోచనల్ని మార్చవచ్చు కదా..." అన్నాడు.

ఐదు నిమిషాల తరువాత, "చెంపలు వాయించాను. తన నిర్ణయంలో మార్పు లేదు. ఒక విధంగా చెప్పాలంటే నీ పైన తనకు కన్సర్న్ ఉంది. నీకు నష్టం జరగకూడదనే తాను దూరంగా జరిగిపోతోంది." చెప్పింది సమీర.

"నాకు దూరం కావడం కన్సర్న్ ఎలా అవుతుంది?" పేలగా అన్నాడు శ్రీకర్.

"వంశం నిలవాలన్న నీ కుటుంబం తపనలో న్యాయం ఉందని తను బలంగా ఫీలవుతోంది" చెప్పింది సమీర.

ఆరిపోయిన ముఖంతో బయటకు నడిచాడు శ్రీకర్. ఆ రాత్రి సమీరా, రమణలకు భోజనం చేయాలనిపించలేదు. రమణ బలవంతం చేయడంతో ఫ్రూట్ జ్యూస్ తాగింది సమీర. రమణ మెతుకు ముట్టలేదు.

శ్రీకర్ జీవితం ఇలా అయిపోయిందేమిటా అన్న వ్యధ అతడిలో పెరిగిపోయింది. శ్రీకర్‌తో అతడి పరిచయం వయసు ఏడేళ్ళు. తన సమీప బంధువు రెఫరెన్స్‌తో శ్రీకర్ ఫ్లాట్‌మేట్ అయ్యాడు. మొదట్లో తనకు శాలరీ తక్కువ రావడంతో అద్దె షేర్ చేసుకోలేకపోయేవాడు. శ్రీకర్ పెద్దగా పట్టించుకునేవాడు కాదు. దరిదాపు తన అవసరాలన్నీ శ్రీకరే తీర్చేవాడు. కాలేజీ లైఫ్ నుంచీ వంట చేసుకునే అలవాటు ఉండడంతో రూంలో కూడా తనే వంట చేసేవాడు. శ్రీకర్‌కి ఇష్టమైన బెండకాయ వేపుడు, దోసకాయ చెట్నీ తరచూ చేసేవాడు. "రమణా, శ్రమగా లేదా" అనేవాడు చాలాసార్లు.

"ఇష్టమైతే ఏదీ శ్రమ అనిపించదు బాసూ" అనేవాడు రమణ.

రమణ సమీప బంధువులు ఎవరు వచ్చినా శ్రీకరే మంచీ మర్యాదా చూసుకునేవాడు. తర్వాత తర్వాత రమణకు ఆఫీసులో పని ఒత్తిడి పెరగడంతో మెస్‌ను ఆశ్రయించారు. "ఏమైనా నీ చేతి వంట తర్వాతే రమణా" అనేవాడు శ్రీకర్. ప్రతి ఆదివారం శ్రీకర్‌కి ఇష్టమైన రొయ్యల వేపుడు, కొరమీను చేపలకూర వంటివి చేసేవాడు.

"ఏంటండీ నిద్ర రావడం లేదా? కడుపు ఖాళీగా ఉంటే నిద్ర ఎలా వస్తుంది. కొంచెం కర్డ్ రైస్ తేనా" అడిగింది సమీర.

"వద్దు మీరా" అని లైటార్పి పడుకున్నాడు రమణ.

•••

శ్రీకర్ ఇంటికి వెళ్ళేసరికి సమంత ఎదురు చూస్తోంది. "ఇంత ఆలస్యం అయ్యిందేం?" అడిగింది.

చివాలున చూశాడు "ఏంటీ ఈ అథారిటీ?" అన్నట్లు.

"ఆకలి వేస్తోంది. కంపెనీ లేకపోతే తిన్నట్లనిపించదు. త్వరగా స్నానం చేసి రండి. వడ్డిస్తాను" అంది.

"నాకు ఆకలిగా లేదు సమంతా" చెప్పి తన గదిలోకెళ్ళి పడుకున్నాడు శ్రీకర్.

సమంత సందేహంగా చూసింది అతడు వెళ్ళినవైపు. శ్రీకర్ మూడాఫ్‌లో ఉన్నాడని అర్థమైంది. కొంత తను గెస్ చేసింది. తను శ్రీకర్‌ని విడిచి వెళ్ళిపోతున్నట్టు రమణ, సమీరలు చెప్పారా? అన్న సందేహం కలిగింది. అదీ ఒకందుకు మంచిదే అన్న నిర్ణయానికి వచ్చింది. తను చెప్పడానికి కలిగే ఇబ్బంది నుండి కాపాడిన వారవుతారనుకుంది. పైగా శ్రీకర్ ముఖం చూసి చెప్పే సాహసం చేయలేకపోవచ్చు. ఏది ఏమైనా తప్పదు కదా? అనుకుని, తను కూడా మజ్జిగ తాగి తన గదిలోకి వెళ్ళి పడుకుంది.

అప్పుడప్పుడూ ఇద్దరూ వేరు వేరు గదుల్లో పడుకున్నా ఎవరికి మూడ్ వచ్చినా రెండో వ్యక్తి సహకరించుకోవడం ఆనవాయితీగా వాళ్ళమధ్య జరుగుతున్నది. ఉన్న కొద్ది రోజులూ శ్రీకర్‌ను ఎందుకు డిజప్పాయింట్ చేయాలి? తనే చొరవ తీసుకుంటే పోలేదా? అనుకుంది ఒక నిమిషం.

కానీ అతడు వెళ్ళిన తీరు చూసి సాహసించలేక పోయింది. ఎందుకో బలంగా శ్రీకర్‌ని కౌగిలించుకొని పడుకోవాలనుకుంది కానీ ధైర్యం చాల్లేదు.

ఐదు నిమిషాల వ్యవధి తర్వాత ఆమె సెల్ ఫోన్ రింగయింది. అవతల లైన్లో కర్కరే. మొదట తీయకూడదనుకుంది. తర్వాత అతడితో గడిపే జీవితం గుర్తుకు వచ్చి పాజిటివ్‌గా రియాక్టయింది. "చెప్పండి సర్..?" అంది.

"ఇంకా సర్ ఏమిటి సమంతా...కర్కరే లేక రే అని పిలువ్..." అన్నాడు రొమాంటిగ్గా.

"అప్పుడే అంత చొరవ చూపలేను కదా సర్.." అని నాలిక్కరుచుకుంది.

"మళ్ళీ..." అన్నాడు నవ్వుతూ.

"చెప్పండి సర్, ఏదైనా మెసేజ్ ఉందా? లేక ఆఫీసు విషయమా?" అడిగింది.

"ప్యూర్లీ పర్సనల్. మన ఇద్దరి అప్లికేషన్లు రేపే ఫార్వర్డ్ చేస్తున్నాను. వచ్చేవారం మెల్కోటే సర్ వస్తున్నారు. ఈ విజిట్‌లో ఆయన ఆమోద ముద్ర వేస్తారనుకుంటున్నాను..." చెప్పాడు.

కర్కరే రొమాంటిక్ ఊహల్లోకి వెళతాడని అర్థమై "గుడ్‌నైట్ సర్...నిద్ర వస్తోంది" అంది.

కర్కరే ఏదో చెప్పబోయాడు.

సమంత ఫోన్ కట్‌చేసి, స్విచాఫ్ చేసింది. అంతకు ముందురోజు అడిగాడు కర్కరే, "ఫోన్ చేస్తే నీకేమైనా ఇబ్బందా?"

"ఫర్వాలేదు సర్! మేం విడిగానే ఉంటాం" చెప్పింది.

"థాంక్ గాడ్.." అని నవ్వాడు.

అదే గుర్తొచ్చింది కర్కరేకి.

"తననుంచి విడిపోతుందని తెలిసి కూడా శ్రీకర్ అంతే రొమాంటిగ్గా ఉండగలడా? ఊహించుకున్నాడు కర్కరే. అతడికి జెలసీ! దాంతో పాటు సమంతతో భవిష్యత్తు అంతా తనదే కదా? అన్న ఆనందం ముప్పిరిగొంది.

●●●

ఉదయాన్నే వచ్చిన తన మావయ్య రాజారావుని చూసి ఆనందపడింది సమంత.

శ్రీకర్ ఆదరణగా నవ్వి "ఇప్పుడేనా అండీ రావడం" అన్నాడు.

"అవును బాబూ" చెప్పాడు రాజారావు.

టిఫిన్ వగైరా అయిపోయిన తర్వాత..."మీతో మాట్లాడాలి బాబూ" అన్నాడు రాజారావు.

"ఇవాళ ఆఫీసులో ఆడిటింగ్ ఉంది. సాయంత్రం ఎర్లీగా వస్తానండీ. సమంత లీవు పెడుతుందిలెండి" చెప్పి వెళ్ళిపోయాడు శ్రీకర్.

మావయ్య రావడంతో సమంతకి సెలవు పెట్టక తప్పలేదు. మధ్యాహ్నం భోజనం అయిన తర్వాత "నీతో మాట్లాడాలిరా" అన్నాడు రాజారావు.

"చెప్పండి మావయ్యా" అంది సమంత.

"రమణ, సమీర ఫోన్ చేశారు" చెప్పాడు ఉపోద్ఘాతంగా.

అప్పటికే సగం విషయం అర్థమైంది సమంతకు. అసహనంగా ముఖం పెట్టింది.

మేనకోడలి ఫీలింగ్స్ అప్పటికే అర్థమయ్యాయి రాజారావుకి. "మీరు చదువుకున్న వాళ్ళమ్మా. మీకు చెప్పేంత తెలివితేటలు మాకున్నాయో లేదో తెలీదు" చెప్పడం ఆపి సమంత కళ్ళల్లోకి చూశాడు.

"అయ్యో, అవేం మాటలు మావయ్యా. మంచి చెప్పేందుకు ఉన్నత చదువులు అవసరం లేదు" భరోసా ఇచ్చింది. ఆమె ఇచ్చిన ధైర్యంతో చర్చ ముందుకు పోనిచ్చాడు.

"వాళ్ళు చెప్పింది నిజం కాకూడదని అనుకుంటున్నానమ్మా..." అన్నాడు నేరుగా విషయంలోకి వచ్చి.

"వాళ్ళు ఏం చెప్పారు?" కాస్త కోపంగానే అడిగింది సమంత.

"నువ్వు కర్కరే అనే మీ ప్రాజెక్ట్ మేనేజర్‌తో కలిసి యుఎస్ వెళ్తున్నావని చెప్పారమ్మా" ఇక విషయం దాచడం ఎందుకని బద్దలుకొట్టాడు రాజారావు.

"ఎందుకు..ఎందుకు పోతున్నానో చెప్పారా?" అడిగింది. రాజారావు నీళ్ళు నమిలాడు.

"మీరు...మీరు చేసిన తప్పును సరిదిద్దుకోవడానికే వెళ్తున్నాను.." క్షణకాలం పాటు షాకయ్యాడు రాజారావు.

"అమ్మకు అనారోగ్యమని మీరు కట్టుకథ పుట్టించారని నాకు తెలుసు మావయ్యా! అమ్మకు బావోలేదని నాటకమాడి అతడి జీవితంలోకి వెళ్ళేలా చేశారు. అక్కడ అమ్మకు ఏ ట్రీట్‌మెంట్ జరగలేదని అమ్మ కండిషన్ తెలుసుకోవడానికి నేను మీరిచ్చిన నకిలీ రిపోర్ట్‌తో వెళ్తే తెలిసింది. నన్నో సంక్షోభంలోకి నెట్టివేశారు. అతడికీ ఆశలూ, ఊహలూ ఉంటాయని ఊహించలేకపోయారు. పెళ్ళి నాకు అవసరం లేదంటే వెంటపడ్డారు. మీ తృప్తి కోసమే అతడితో సహజీవనానికి ఒప్పుకున్నాను. ఇప్పుడతనికి పిల్లలు కావాలంట..." కోపంగా అంది.

గిల్టీగా ఫీలయ్యాడు రాజారావు. కొద్ది క్షణాలు తల దించుకున్నాడు.

"మేం ఏం చేసినా నీ మంచికోసమే గదమ్మా! అయినా అతడిది న్యాయమైన కోరికే కదమ్మా" పీలగా అన్నాడు రాజారావు.

"వద్దు. నాకు వద్దు మావయ్యా. ఎప్పుడు తెగిపోతుందో తెలీని బంధానికి పిల్లలనే జంఝాటం వద్దు. మా ఇగోలతో పుట్టే బిడ్డల్ని హింసించలేం" మరింత కోపంగా అంది.

"అతడు మంచివాడే కదమ్మా" అన్నాడు రాజారావు.

"నాన్నను కూడా మంచివాడనే కదా అమ్మ గొంతుకోశారు. నేనూ అమ్మలాగే నాన్నప్రేమ అంటే ఏంటో తెలియకుండా బిడ్డల్ని పెంచాలా? వద్దు..నాకు వద్దు...అలా వద్దనుకునే అగ్రిమెంట్ పంపించాను. అందులో బిడ్డల్ని కంటానని ఎక్కడా చెప్పలేదు. అతడు కూడా ముందు మాట్లాడలేదు. ఇప్పుడు అతడి వంశం నిలబెట్టడం కోసం బిడ్డని కనాలట. నేను దానికి సిద్ధంగా లేనని చెప్పాను. అతడి వంశాన్ని నిలబెట్టడానికే వెళ్తున్నాను తప్ప ఒళ్ళు కొవ్వెక్కి వెళ్ళడం లేదు" కరాఖండిగా చెప్పింది సమంత.



## ఇంత ప్రచారం అవసరమా?

హీరోయిన్‌గా కన్నా అలనాటి హీరోయిన్ రాధ కూతురుగానే కార్తీకకు గుర్తింపు ఎక్కువ! ఇటీవలి కాలంలో కార్తీక చేసిన సినిమాల పేర్లు ఎక్కడా వినిపించడం లేదు. ఇలాంటి పరిస్థితుల్లో కార్తీక సినిమాలకు గుడ్ బై చెప్పేస్తోందన్న ప్రచారం మీడియాలో బాగా జరుగుతోంది. సమంతలాంటి హీరోయిన్ సినిమాలకి గుడ్‌బై చెబితే న్యూస్ కానీ, కార్తీక మానేస్తే సెన్సేషన్ ఎలా అవుతుంది? అంటున్నారు సినీ జనాలు. అసలు కొంతమంది సినీ ప్రేక్షకులకు కార్తీక హీరోయిన్ అన్న సంగతే తెలియదనీ, అలాంటప్పుడు ఈ ప్రచారం ఎందుకో అర్థం కావడం లేదనీ అంటున్నారు. సినిమాలు మానేస్తున్నానంటే దయ తలచి ఎవరైనా ఓ ఛాన్స్ ఇస్తారేమో అన్న ఆశతోనే కార్తీక ఇలాంటి ప్రచారానికి తెర లేపిం దని కూడా అంటున్నారు. అసలు కార్తీక సినిమాలు మానేస్తే ఎవరికి నష్టం? అన్న అనుమానాన్ని కూడా కొందరు వ్యక్తం చేస్తున్నారు.

రాజారావు ఏదో చెప్పబోయాడు.

సమంత చేతిని అడ్డుగా పెట్టి "మావయ్యా... నా బ్రతుకు నన్ను బ్రతకనియ్యండి. మీక్కావలసింది నా సంతోషమేగా, నేనెక్కడున్నా సంతోషంగా ఉంటా. అది చాలు కదా?" అంది.

రాజారావు నోటికి మూత పడింది. నిస్సహాయంగా చూశాడు. తాను చేయగలిగింది ఏమీ లేదని శ్రీకర్ కోసం ఎదురు చూడకుండా వెళ్ళిపోయాడు.

శ్రీకర్ రాజారావు వచ్చాడనే కాస్త పెందలాడే వచ్చాడు. "సమంతా మీ మామగారేరి?" అడిగాడు.

"ఏదో పని ఉందని వెళ్ళిపోయారు.." చెప్పింది సమంత.

ఆమె చెప్పింది అంత నమ్మశక్యంగా అనిపించలేదు అతడికి.. "సమంతా, మన మధ్య ఎన్ని గొడవలైనా ఉండవచ్చు. పెద్దవాళ్ళని బాధ పెట్టకూడదుకదా?" అన్నాడు సౌమ్యంగా.

"గొడవలా? గొడవలేం ఉన్నాయి?" అంది.

"అదే..." నసిగాడు.

"సమీరకు వార్నింగ్ ఇచ్చా. టెలిఫోన్ రాయబారాలు ఆపమని" అంది కోపంగా.




శ్రీకర్ తల దించుకున్నాడు.

"రమణక్కూడా ఫోన్ చేశాను. లిఫ్ట్ చేయలేదు. మీరు కూడా చెప్పండి. అగ్రిమెంట్ మరోసారి చదువుకోమనండి. అంతేతప్ప మన విషయంలో ఇన్‌వాల్వ్ కావద్దని చెప్పండి" అంది కాస్త కటువుగానే.

శ్రీకర్‌కి చప్పున కోపం వచ్చింది. "అతడు నా వెల్‌విషర్" అన్నాడు.

"నేను కానా?" అంది అంతే వేగంగా.

శ్రీకర్ నుంచి సమాధానం రాలేదు.

"మీ శ్రేయోభిలాషిని కాబట్టే వెళ్ళిపోవాలనుకుంటున్నాను. మీ ఇంజనీరింగ్ బుర్రకి కాస్త పదును పెట్టండి" అంది.

"నాకు పిల్లలు అవసరం లేదు." సూటిగా అన్నాడు.

"ఆ మాట మీ నాన్నకు హార్ట్ ఎటాక్ రాకముందే చెప్పాల్సింది" అంది.

"దానికీ నన్నొదిలి పోవడానికీ సంబంధం ఏంటి?"

"ఉంది. మూడోసారి అటాక్ వస్తే ఆయన మీకు దక్కడు. మీరు బిడ్డాపాపలతో ఉంటే నూరేళ్ళు కళకళలాడుతూ ఉంటారు. మీకు బిడ్డల్ని కనేందుకు నేను సిద్ధంగా లేను." అంది దృఢంగా.

"నాకు పిల్లలు వద్దు. ఆ విషయం మా నాన్నతోనే నీకు చెప్పిస్తా" అన్నాడు మొండిగా.

"స్వార్థంతో మాట్లాడకండి. తండ్రిని కాపాడుకోండి" అంది అసహనంగా.

"నీ మాటల్లో అసహజత్వం ఉంది.." అన్నాడు డెస్పరేట్‌గా శ్రీకర్.

"నా ఆలోచనల్లో నాకు సహజత్వమే కనిపిస్తోంది. చట్టబద్ధమైన వివాహం ద్వారానే మీరు పొందాలనుకున్నవన్నీ జరుగుతాయి. ఆ హక్కు మీకు కల్పించాలనుకుంటున్నాను. అది డేటింగ్ ద్వారా సాధ్యం కాదు. మీరు లాజిక్ మిస్సయ్యారు" అంది.

"నువ్వు జీవితాన్ని మిస్ అవుతున్నావు సమంతా" నిస్పృహగా అన్నాడు శ్రీకర్.

"పర్వాలేదు. మీరు సంతోషంగా ఉంటే చాలు" చెప్పింది సమంత.

●●●

ఆ మర్నాడు ఆఫీసుకు సెలవు పెట్టింది సమంత. ఆమెకు చాలా అసహనంగా ఉంది. రకరకాల భావాలతో హింసిస్తున్న వారందరూ ఆమెకు స్నేహితులూ, బంధువులూ కావడమే ఆమె అసహనానికి కారణం. తన బ్రతుకు తననెందుకు బ్రతకనియ్యరో అర్థం కావట్లేదు. తన అభిప్రాయాలకు విరుద్ధంగా వ్యవహరిస్తున్నారు. తనలోకి బలవంతంగా దూసుకొస్తున్నారు. తన మనసును విచ్ఛేదం చేస్తున్నారు. తన స్వేచ్ఛను ధ్వంసం చేస్తున్నారు. తన చిన్న ప్రపంచంలోకి బలమైన బాహులతో వస్తున్నారు. తల్లీ.. మావయ్యా, శ్రీకర్, సమీరా...అందరూ వస్తున్నారు. తల విదిల్చింది.

ఆ రోజు తాను సాయం చేసే చారిటీ సంస్థ సాల్వేషన్ ఆర్మీ నేతృత్వంలో సాగే ఆర్ఫనేజ్ హోమ్‌కి బయలుదేరింది. సిస్టర్ నివేదిత సాదరంగా ఆహ్వానించింది.

పరస్పర నమస్కారాలు చేసుకున్నారు. సిస్టర్ నివేదితను కన్నార్పకుండా చూసింది సమంత. చాలా చక్కగా ఉందామె. అంతకన్నా ఆమె ముఖంలో చిరునవ్వు ఉంది. ప్రశాంతంగా ఉంది. "రండి మేడమ్" అంది.

చైల్డ్‌కేర్ సెంటర్ దగ్గరకు వెళ్ళింది. దరిదాపు అందరూ నాలుగేళ్ళ కన్నా చిన్న వయస్సు పిల్లలు ఉన్నారక్కడ. సమంతను చూడగానే ఆనందంతో కేరింతలు కొట్టారు. తనతో తెచ్చిన చాక్లెట్ ప్యాకెట్లు ఇచ్చింది సమంత. కేర్‌టేకర్‌గా ఉన్న ఒక అమ్మాయి ఆ పిల్లలందరికీ సమానంగా పంచింది. పది నిమిషాలు వాళ్ళమధ్య గడిపి గార్డెన్ వైపు వెళ్ళింది.

నివేదిత సమంత వెంట నడిచింది.

అన్యమనస్కంగా కన్పించిన సమంతను.. "ఏంటి మేడమ్! ఏదో ఆలోచిస్తున్నారు" అడిగింది తను.

తన మూడ్‌ని గుర్తించిందని అర్థమైంది సమంతకు. అక్కడ ఉన్న సిమెంట్ బల్లపై కూర్చుంది. "సిస్టర్, మీరెందుకు నన్‌గా మారారు" అడిగింది.

"పెద్దగా రీజన్స్ లేవు. మా పిల్లల్లో ఒకరిని నన్‌గా దేవుడికి అప్పగిస్తానని అమ్మ గాడ్‌కి కమిట్ అయ్యింది. ఫాదర్ చార్లెస్‌కి అప్పగించింది. ఆయన నేతృత్వంలోనే పెరిగి నన్‌గా మారా.." చెప్పింది నివేదిత.

"మీకీ జీవితం బావుందా?" చప్పున అడిగింది సమంత.

"బావుంది. ఇంతమందికి సేవచేయడం కన్నా లభించే తృప్తి ఏముంది?" చెప్పింది నివేదిత.

"వైవాహిక జీవితాన్ని మిస్ అయ్యానని మీరెప్పుడూ ఫీల్ కాలేదా?" అడిగింది.

నివేదిత వెంటనే సమాధానం చెప్పలేదు. "ప్రభువుకి జీవితం అప్పగించిన తర్వాత అటువంటి ఫీలింగ్స్ అల్పమైనవి.." చెప్పింది నివేదిత.

ఒక నిమిషం మాట్లాడలేదు సమంత.

"ఇహపరమైన కోర్కెలు అణుచుకోలేక కొందరు ఫాదర్లకు లొంగిపోయిన నన్స్ కూడా ఉన్నారు" చెప్పింది నివేదిత తలదించుకొని.

చేదు తిన్నట్టు చూసింది సమంత.

"సంసారసుఖానికి అలవాటుపడ్డ తర్వాత ఇక వాళ్ళు నన్స్ కారు. వేషధారులే అవుతారు" చెప్పిందామె.

"మీకెప్పుడూ అలా అన్పించలేదా సిస్టర్" అడిగింది సమంత.

"అలా అన్పించిన మరు నిమిషంలో నన్ రూపం వదిలేస్తా" స్థిరంగా చెప్పింది నివేదిత.

"మీరు చాలా గ్రేట్ సిస్టర్" అభినందించింది సమంత.

ఆమె కళ్ళముందు చిన్నారులు కన్పించారు. ఎందుకు పుట్టారో తెలియనివారు. ఎవరికి పుట్టారో తెలియనివారు. నిస్సహాయస్థితిలో వదిలి వెళ్ళిన తల్లిదండ్రులకు చెందినవాళ్ళు. ఏమీ ఎరుగని పువ్వుల్లాంటి వారు. అంతమందికి తల్లిలా సేవ చేస్తున్న నివేదిత చాలా గొప్పగా కన్పించింది సమంతకు.

వచ్చేటప్పుడు తన బ్యాగులో నుండి చెక్ తీసి సిస్టర్‌కి ఇచ్చింది. "ఇది నేను స్వయంగా ఇచ్చే ఆఖరి చెక్. నెక్స్ట్ మంత్ యుఎస్ నుండి పంపుతా" చెప్పింది సమంత.

కళ్ళు రెపరెపలాడించింది నివేదిత. "సార్‌కి యుఎస్ ట్రాన్స్‌ఫర్ అయ్యిందా మేడమ్" అడిగిందామె.

"అవును.." చెప్పింది సమంత.

***(ఇంకావుంది)***

# మంచు మిస్టరీ!

ఆస్వాదించాలేగానీ, ఈ భూమ్మీద విచిత్రమైన అనుభూతులు ఎన్నో ఎదురవుతాయి. ఎండ, వాన, వరద, మంచు... ఒక్కొక్కటీ ఒక్కొక్క లక్షణాన్ని చూపిస్తూ మనకి హాయిగొలుపుతాయి. మురిపిస్తాయి. భయపెడతాయి. అబ్బురపరుస్తాయి. వీటన్నింటిలో మరీ విచిత్రమైన అనుభూతి కలిగించేదీ, మనసును ఆహ్లాదపరిచేదీ చల్లదనం, మంచు! ప్రకృతి సహజసిద్ధంగా ఏర్పడిన చల్లటి ప్రదేశాలు మన మనసును ఊరడిస్తాయి. ఆహ్లాదపరుస్తాయి. ఇలాంటి ప్రదేశాల్లోనే ఎన్నో మంచు మిస్టరీలు కూడా ఉన్నాయి. అవన్నీ ప్రకృతి రమణీయ దృశ్యాలుగా కనువిందు చేస్తూ ఉంటాయి. విడ్డూరంగా అనిపిస్తాయి. అలా అపురూప మైన అందాలుగా రూపుదిద్దుకుని ఔరా! అనిపించే ఈ ప్రకృతికి జోహార్లు అర్పించాలనిపిస్తుంది!

చూడడానికక్కడ వెనీలా ఐస్‌క్రీమ్‌లా తెల్లగా ఉంటూ నోరూరిస్తుంది కానీ దాన్ని తినలేం. అక్కడ అగ్నిపర్వతాలు బద్ధలవుతాయి కానీ లావా ఉప్పొంగదు మొత్తం చల్లగా ఉంటుంది.. ఇంకో ప్రదేశంలో మంచుతో కోటలు కట్టబడి ఉంటాయి. అదంతా చూస్తుంటే విడ్డూరంగానే ఉంటుంది మరి!అయితే ఇవన్నీ మంచుప్రాంతాలలోనే ఏర్పడతాయి. కనులకు ఆనందంతోబాటు, ఆశ్చర్యం కలిగించే ఈ మంచు ప్రదేశాల గురించి తెలుసుకోండి!

## మంచు పర్వతం

అగ్నిపర్వతం గురించి మనందరికీ తెలిసిందే! వేడివేడి పొగలు కక్కుతూ వెలువడే లావా, అగ్నికీలలు, విపరీతమైన వేడి. కానీ మంచు అగ్నిపర్వతం గురించి మీకు తెలుసా.. అవునండీ ఐస్ వాల్కనోస్ కూడా ఉన్నాయి. వాటిని ఫ్యూమరోల్స్ అని పిలుస్తారు. ఇవి లావా బదులు వాయువులను, మంచును వెదజల్లుతాయి. వేడివేడి ఉష్ణానికి బదులు ఆ ప్రాంతం అంతా చల్లగా ఉంటుంది. స్టీమ్ అంతా బయటకు పొంగుతూ చూడ్డానికి చాలా ఆశ్చర్యకరంగా ఉంటాయి.

## ఐస్‌క్రీమ్ మాత్రం కాదండీ

చూడ్డానికి అచ్చం వెనీలా ఐస్‌క్రీమ్‌లా కనిపిస్తుందని పొరపాటున వెళ్లి తినేరు. నిజానికి వెనీలా ఐస్‌క్రీం కాదు అది. స్ట్రిప్డ్ ఐస్ బర్డ్. ఈ స్ట్రిప్డ్ ఐస్ బర్డ్ సహజసిద్ధంగా సముద్రం దగ్గర ఏర్పడింది. దీనిపైన ఉన్న చాక్లెట్ లాంటి గీతలన్నీ సముద్రం ద్వారా ఏర్పడినవే.

## స్నో రోలర్

రోడ్ రోలర్ గురించి తెలుసు కానీ స్నో రోలర్ అనే పేరు ఎప్పుడైనా విన్నారా. అతి శీతలమైన మంచుఉన్న ప్రదేశాలలో ఈ స్నో రోలర్స్ ఏర్పడతాయి. మంచు గడ్డ కట్టి ఇలా గుండ్రంగా ఏర్పడతాయి. భారీ ఎత్తున గాలులు వచ్చినపుడు గాలితో పాటు మంచు కూడా రావడం వల్ల ఈ స్నో రోలర్లు ఏర్పడతాయట.

## మంచుగుహ

అమర్‌నాథ్‌లాంటి మంచుగుహల సంగతి మనకు తెలిసిందే కదా! అలాంటిదే మరొక మంచుగుహ ఉంది. సహజ సిద్ధంగా ఇది ఏర్పడింది. అలస్కాగా దాన్ని పిలుస్తారు. భారీ మంచుతో ఏర్పడిన ఈ గుహను చూడడానికి చాలామంది వస్తారట. పగటిపూట తెల్లని మంచుతో ఈ గుహ చాలా అద్భుతంగా కనిపిస్తుందట.

## మంచు లోయ

రకరకాల లోయలు గురించి మనకు తెలుసు. హిమాలయాలు లాంటి మంచు కురిసే ప్రాంతాల్లో మంచులోయలు ఉంటాయి కదా! ప్రపంచంలోనే అలాంటి అతి పెద్ద మంచులోయ పేరు గ్రీన్ ల్యాండ్. 80 శాతానికంటే ఎక్కువ మొత్తంలో అడుగుభాగం అంతా మంచుతో ఏర్పడి ఉంటుందీ లోయ.

## బ్లూ ఐస్

హిమనీ నదాల వల్ల ఏర్పడినదే బ్లూఐస్. ఇవన్నీ చాలా వరకు సహజసిద్ధంగా ఏర్పడతాయి. సంవత్సరాల తరబడి ఒకేచోట మంచు పేరుకుపోవడంవల్ల అదో చిన్న కొండలా తయారవుతుంది. ఇలా ఏర్పడినదే ఈ బ్లూ ఐస్. మంచు ఎక్కువగా కురిసే ప్రాంతాలలో ఇవి ఉంటాయి. బ్లూ ఐస్ అంటే ఇవి చిన్న రకం నీలిరంగు మంచుకొండలు.

## ఐస్ సర్కిల్

చుట్టూ నీరు, మధ్యలో మంచుతో సర్కిల్ ఆకారంలో ఏర్పడిన ప్రాంతాన్ని ఐస్ సర్కిల్ అంటారు. ఇవి చూడ్డానికి ఎంతో ఆకర్షణీయంగా కనిపిస్తాయి. ఈ ఐస్ సర్కిల్‌నే ఐస్ ప్యాన్ లేదా ఐస్ డెస్క్ లేదా ఐస్ సర్కిల్ అని పిలుస్తారు. చల్లటి వాతావరణం ఉన్నపుడు ఇవి సహజసిద్ధంగా ఏర్పడతాయి.

- నివేదిత

# నోబెల్ కథలు

# ఆపరేషన్

-రోజర్ మార్టిన్ డుగార్డ్



*రోజర్ మార్టిన్ డుగార్డ్ 23 మార్చి 1881న ఫ్రాన్స్‌లో జన్మించారు. 1937లో సాహిత్యంలో నోబెల్ బహుమతి అందుకున్నారు. 77యేళ్ళ వయసులో 22 ఆగస్ట్ 1958న మరణించారు.*

**రుడాల్గర్‌లోని షాల్ ఇంటిముందు జనం గుంపులుగా నిలబడి ఉన్నారు. ఇంతలో ఆ ఇంటి ముందుకో కారు వచ్చి ఆగింది. కారులోనుంచి దిగుతున్న షాల్, డాక్టర్ ఆటోన్‌ని చూసి, గుమి కూడిన వారందరూ పక్కకి తొలగి దారి ఇచ్చారు. ఇద్దరూ హడావిడిగా లోపలికి వెళ్ళారు. అప్పటికే వాచ్‌మన్ కారులోనే డాక్టరుకు పరిస్థితిని వివరించాడు. వింటున్న షాల్ కన్నీళ్ళు పెట్టుకోక పోయినా యాక్సిడెంట్ గురించి వివరం చెబుతున్నప్పుడల్లా కదిలిపోతున్నాడు.**

"జూల్స్‌ను కలుసుకోవడానికి వెళ్ళిన డెడెట్టీని వేగంగా దూసుకొచ్చిన కారు ఢీకొట్టి, ఆమె శరీరం మీదనుంచీ వెళ్ళిపోయింది. పోగయిన జనంలోంచి ఓ పత్రికా విలేకరి పాపను గుర్తుపట్టి, స్పృహ లేని స్థితిలో అపార్టుమెంటుకు చేర్చాడు. అసలు యాక్సిడెంట్ జరగ్గానే నా భార్య పక్కనే ఉన్న రెస్టారెంట్‌కి వచ్చే డాక్టరును పిలుచుకురావడానికి వెళ్ళింది. బహుశా ఆయన వచ్చి ఉండొచ్చు" వాచ్‌మెన్ డాక్టర్ ఆటోన్‌కి చెప్పాడు. ఆటోన్ తలూపి షాల్ వెంట లోపలికి నడిచాడు. వాళ్ళు హాలునీ, రెండు చిన్న గదుల్నీ, వంట గదినీ దాటి ఒక గదిముందు ఆగారు. వంటగదికి ఇవతల ఒక గుండ్రటి భోజనం బల్లపై నలుగురికోసం ప్లేట్లు పెట్టి ఉండడం ఆటోన్ దృష్టిలో పడింది. షాల్ గది ముందు నిల్చుని 'డెడెట్టి! డెడెట్టి" అని పిలిచాడు.

"లోపలికి రండి" అని ఒక గొంతు వినిపించింది.

గదిలోకి అడుగుపెడుతూనే గులాబీరంగు దుస్తులు ధరించిన ఒక అమ్మాయి దీపాన్ని రెండు చేతులతో ఎత్తిపట్టుకుని ఉండడం ఆటోన్ గమనించాడు. చెదిరిన ఆమె జుట్టుమీదా నుదుటిమీదా దీపం వెలుతురు పరుచుకుని ఉంది. సూర్యాస్తమయం తాలూకు పలచనికాంతి దీపపు వెలుతురులో కలిసిపోయింది. అప్పుడు ఆటోన్ దృష్టి గదిలోని మంచం మీద పడింది. ఒక యువకుడు మంచం మీదకు వంగి రక్తంతో తడిసిన ఆ పాప దుస్తులను కత్తెరతో కత్తిరిస్తూ కనిపించాడు. ఆమె చిన్నతల దిండులో కూరుకుపోయి ఉంది. ఒక ముసలావిడ మోకాళ్ళపై వంగి కూర్చుని ఆ యువకుడికి సహాయం చేస్తోంది.

"ఆమె బతికే ఉందా?" ఆటోన్ అడిగాడు.

డాక్టర్ వెనుతిరిగి ఆటోన్‌ను చూసి ఒక నిమిషం తటపటాయించి "బతికే ఉంది" అని చెప్పాడు. అయితే అతని గొంతు బలహీనంగా ధ్వనించింది.

"షాల్ కోసం వాచ్‌మెన్ వచ్చినప్పుడు నేను ఆయన పక్కనే ఉన్నాను. వెంటనే మందుల పెట్టె తీసుకుని నేను కూడా వెంటవచ్చాను. నా పేరు డాక్టర్ ఆటోన్. పిల్లల హాస్పిటల్‌లో డాక్టరుగా పనిచేస్తున్నాను" తననుతాను పరిచయం చేసుకున్నాడు ఆటోన్. ఆ యువకుడు లేచి ఆటోన్‌కు దారి ఇవ్వబోయాడు.

"కానివ్వు, కానివ్వు" అంటూనే, "పల్స్ ఎలా ఉంది" అడిగాడు ఆటోన్.

"చాలా బలహీనంగా ఉంది" యువడాక్టర్ చెప్పాడు.

"అంబులెన్స్ పిలిపించి తనని మా హాస్పిటల్‌కి తీసుకెళ్ళడం మంచిదేమో అనిపిస్తోంది" గులాబీరంగు దుస్తుల్లోని యువతి మొహంలో ఆందోళన గమనించి అన్నాడు ఆటోన్.

"అక్కర్లేదు" అంటూ ఒక గొంతు ఖంగుమని వినిపించింది. మంచం తలాపి వైపు నిలబడి ఉన్న ఒక ముసలావిడ అప్పుడు ఆటోన్ కళ్ళలో పడింది. ఆ చిన్నపిల్లకి ఆవిడ అమ్మమ్మ అయ్యుండొచ్చేమో అనుకున్నాడు. ఆవిడ ముక్కు కొనదేరి విలక్షణంగా ఉంది. ఆమె తన వాడిచూపులతో ఆటోన్‌ను శల్య పరీక్ష చేస్తున్నట్టుగా చూస్తోంది.

"మేం బీదవాళ్ళుగా కనిపిస్తుండొచ్చు. మేం మా ఇళ్ళల్లో మంచంలో పడి చనిపోవడానికైనా ఇష్టపడతాం కానీ ఆస్పత్రి ఛాయలకి వెళ్ళం. డెడెట్టీని ఆస్పత్రికి తీసుకువెళ్ళడానికి వీల్లేదు" ఆమె కచ్చితంగా చెప్పేసింది.

**రోడ్డు ప్రమాదంలో గాయపడిందో బాలిక. సమయానుకూలంగా స్పందించి ఆపరేషన్ చేశాడా వైద్యుడు. పాప బతుకుతుందో లేదో తెలియని అనిశ్చితి. అలాంటి స్థితిలో ఆ డాక్టరుకు సహాయకారిగా నిలిచిందో యువతి. ఆమె అందం, మానసిక పరిణతి చికిత్స ఆద్యంతం అతణ్ణి ప్రభావితం చేస్తూనే ఉన్నాయి. ఆమెను బాలిక తల్లిగా భావించాడతను. ఇంతకూ ఆమె ఎవరు? అతడామెను ప్రేమించాడా? వారి ప్రేమ ఫలించిందా?**

"ఎందుకు వీల్లేదు" ఆటోన్ పట్టుదలగా అడిగాడు.

"మాకు ఇష్టం లేదు" ఆవిడ కుండబద్దలు కొట్టినట్టు చెప్పింది.

ఆటోన్ ఆ యువతి అభిప్రాయం కోసం చూశాడు. ఆమె మొహంమీద వాలిన దోమల్ని తోలుకుంటుండడంతో ఆటోన్ షాల్‌వైపు తల తిప్పి చూశాడు. ముసలావిడ డాక్టరు చూపుల్ని గమనించి కరకుగా ఉన్న కంఠంతో "నువ్వేమంటావ్ షాల్" అని అడిగింది.

"నువ్వన్నదే సరైందమ్మా" షాల్ అన్నాడు. ముసలావిడ సరేనన్నట్టు తలూపి "నువ్వు ఇక్కడ ఉండొద్దు షాల్. నీకు నీ గదిలోనే బాగుంటుంది. అక్కడికి వెళ్ళు" అంటూ ఆజ్ఞ జారీ చేసింది. షాల్ లేచి లోపలి గదిలోకి వెళ్ళిపోయాడు.

ఆటోన్ పెదాలు కొరుక్కుంటూ ఒక్క నిమిషం ఏం చేయాలా అని ఆలోచిస్తున్నట్టు నిలబడిపోయాడు. అతను ఆలోచిస్తూనే కోటువిప్పి, షర్టు మోచేతుల వరకూ మడిచి మంచం పక్కన మోకాళ్ళపై కూలబడ్డాడు. ఎలాంటి క్లిష్ట పరిస్థితిలోనైనా సరే వేగంగా నిర్ణయాలు తీసుకోవడం, వాటిని అమలు చేయడంలో ఆటోన్‌కి మంచి పేరుంది.

యువ డాక్టరు, అతని పక్కనే ఉన్న ముసలావిడ సహాయంతో బాలిక ఒంటిమీదున్న దుస్తుల్ని ఆటోన్ వేగంగా తొలగించాడు. పాలిపోయిన ఒక చిన్న శరీరం రక్తం ఓడుతూ అక్కడ నగ్నంగా పడి ఉంది.

కారు బలంగా ఢీకొట్టడం వల్ల ఆమె ఒళ్ళంతా గాయాలతో రక్తసిక్తంగా ఉంది. ఆమె తొడదగ్గర నుంచీ మోకాలివరకూ రక్తంతో తడిసిపోయి ఉంది.

"కుడికాలు" ఆటోన్ యువడాక్టరుతో అన్నాడు. ఆమె కుడిపాదం మెలితిరిగి లోపలికి ముడుచుకుపోయింది. ఎముక విరగడంతో ఎడమకాలికన్నా చిన్నగా అనిపిస్తోంది.

"తొడ ఎముక విరిగింది" యువ డాక్టర్ అన్నాడు.

ఆటోన్ సమాధానం చెప్పకుండా ఆలోచిస్తూ ఉండిపోయాడు.

"అదొక్కటే కాదు. అంతకన్నా బలమైన దెబ్బ ఇంకేదో ఉంది. అదేమై ఉండొచ్చు" అంటూ అతను

బాలిక మీదకు వంగి మోకాలి దగ్గర్నుంచీ తొడ వరకూ మెల్లగా వేళ్ళతో నొక్కుతూ వచ్చాడు. మోకాళ్ళకు కొన్ని అంగుళాలపైన తొడ లోపలి భాగం నుంచీ ఒక్కసారిగా బుడబుడమని రక్త ప్రవాహం బైటికొచ్చింది.

"ఇదిగో ఇదే కారణం" ఆటోన్ అన్నాడు.

"తుంటి ధమని" యువ డాక్టర్ అన్నాడు.

ఆటోన్ వేగంగా లేచి నిలబడ్డాడు. అతని బుర్ర చురుగ్గా పనిచేస్తోంది. ఏదో ఒక నిర్ణయం తీసుకోవాలి. "బాలికకు ఆపరేషన్ చెయ్యాలి. అయితే ఆమెను ప్రాణాలతో హాస్పిటల్‌కు తీసుకువెళ్ళే అవకాశం లేదు. మరేం చేయడం? ఆపరేషన్ ఎవరు చేయాలి? ఇంకెవరు చేస్తారు? నేనే. అంతకుమించి ఇంకో ప్రత్యామ్నాయం లేదు" అతని ఆలోచన ఓ కొలిక్కి వచ్చింది.

"గాయానికి కట్టుకడతారా?" యువడాక్టర్ అడిగాడు. అయితే ఆటోన్ ఆ ప్రశ్నను అంత పట్టించుకోలేదు. "అవును, గాయానికి కట్టుకట్టాలి. ఏ మాత్రం ఆలస్యం చేయకూడదు. ఇప్పటికే సమయం మించిపోయింది. గాయానికి కట్టుకట్టాలి. అయితే దేనితో..." అతని కళ్ళు గది నలుమూలలా కలియ చూశాయి. ఆ యువతి బెల్టు పెట్టుకుని లేదు. కర్టెన్‌కు తాళ్ళుకూడా లేవు. ఏదన్నా ఎలాస్టిక్ లాగా సాగేది కావాలి. ఆటోన్ వెంటనే కోటుకి ఉన్న టై విప్పి బాలిక మీదకు వంగి గాయాన్ని దానితో గట్టిగా కట్టాడు.

"ఒక్క రెండు నిమిషాలు ఊపిరి పీల్చుకోవచ్చు" అంటూ అతను పైకిలేచాడు. అతని నుదుటి మీంచీ చెమట ధారలు కట్టి కారుతోంది. అందరి కళ్ళూ తనమీదే ఉన్నాయని ఆటోన్‌కు తెలుసు.

"వెంటనే ఆపరేషన్ చేయాలి. అదొక్కటే ఆమెను బతికించగలదు" ఆటోన్ స్థిరంగా చెప్పాడు.

మంచం చుట్టూరా నిలబడ్డ వాళ్ళంతా ఒక్కసారి ఉలిక్కిపడినట్టు తెల్లమొహాలు వేశారు. ఆటోన్ పళ్ళు బిగించి తీవ్రంగా ఆలోచిస్తూ ఉండిపోయాడు.

"ఆపరేషన్‌కి టేబుల్ కావాలి. ఎలా?" అతని బుర్ర ఆలోచిస్తోంది. అతనికి భోజనాల బల్ల గుర్తుకొచ్చింది.

"దీపం తీసుకురా" అతను గులాబీరంగు దుస్తుల యువతివైపు చూసి అరిచాడు. "నువ్వు నాతోరా" అంటూ డాక్టర్‌ను వెంటపెట్టుకుని ఆటోన్ పక్క గదిలోకి వెళ్ళాడు. అవును. ఇదే ఆపరేషన్ థియేటర్" అతను మనసులో అనుకున్నాడు.

వెంటనే అతను టేబుల్‌మీద ఉన్న పళ్ళాలు అన్నిటినీ తీసి ఒకదానిపై ఒకటి పేర్చి "ఇది దీపం కోసం" అంటూనే బాలిక ఉన్న గదిలోకి వెళ్ళాడు. మిగిలిన ఇద్దరూ అతన్ని అనుసరించారు.

"ఆమెను నేను మోసుకువస్తాను. నువ్వు కాళ్ళు పట్టుకోవాలి" అంటూనే ఆటోన్ బాలికను రెండు చేతులతో ఎత్తుకుని టేబులు దగ్గరకు తీసుకువచ్చాడు. ఆమె చిన్నగా మూలిగింది. ఆటోన్ యువతి చేతిలో ఉన్న దీపం తీసుకుని పేర్చిన పళ్ళాలమీద ఉంచాడు. అక్కడి దృశ్యాన్నంతా ఒకసారి కలియచూశాడు. గదిలోని వేడి, ఆందోళన కారణంగా ఆటోన్ నుదురు చెమటతో తడిసిపోయింది.

'ఆమె ఇదంతా తట్టుకుని బతికి బట్టకడుతుందా" అతని మనసులో లీలగా ఆలోచన మెదిలింది. అయితే అతనిలో నమ్మకం చెక్కుచెదరలేదు. అతనిలో ఎప్పుడూ ఇంత ఆత్మవిశ్వాసం కనిపించలేదు.

ఆటోన్ మందులపెట్టె చేతిలోకి తీసుకుని క్లోరోఫామ్, గాజుగుడ్డ బైటకు తీసి క్లోరోఫామ్‌ను యువడాక్టరుకు ఇచ్చాడు.

"క్లోరోఫామ్ సీసాను తెరు, కుట్లువేసే పరికరాన్ని, మిగిలినవాటిని అన్నిటినీ తీసి బైటపెట్టు" అని డాక్టరుకి చెప్పాడు. అతను ఆ మాట అంటూనే గదిలో ఉన్న రెండు ముసలి ఆకారాల్ని చూస్తూ,

"ముందు మీరు బైటకు వెళ్ళండి" అంటూ గద్దించాడు. వాళ్ళతోపాటు బైటకు వెళ్ళబోతున్న యువతిని చూసి "నిన్ను కాదు" అంటూ కోపంగా అతను క్లోరోఫామ్ సీసా యువతికి అందిస్తూ చెప్పాడు.

క్లోరోఫామ్ వాసనతో గదిలోని గాలి బరువుగా మారింది. బాలిక ఒకసారి చిన్నగా మూలిగి, గట్టిగా ఊపిరి పీల్చి కదలకుండా ఉండిపోయింది. ఆటోన్ చుట్టూచూశాడు. అంతా సరిగ్గానే ఉంది. ఇక మిగిలిందల్లా ఆపరేషన్ చేసే డాక్టర్ నైపుణ్యం.

మందులపెట్టెలోని పరికరాలన్నిటినీ యువ డాక్టర్ అప్పటికే బైటకుతీసి ఉంచాడు. ఆటోన్ వాటిని పరిశీలించాడు. స్కాల్‌పెల్, ఫోర్‌సెప్స్, గాజుగుడ్డ, దూది ఉండ, అయోడిన్ టింక్చర్, ఆల్కహాల్.

"సరే! ఇంక మొదలు పెడదామా" ఆటోన్ యువడాక్టర్ వంక చూశాడు. అతని మాటల్లో కొట్టొచ్చే విశ్వాసం అతనిలోని శక్తి అంతా ఒకేచోట కేంద్రీకరించినట్టయింది. అతడు తలెత్తి యువ



అరిచాడు. ఆమె వెనుదిరిగింది. దీపపుకాంతి ఆమె మొహంపై పడింది. గుండ్రంగా, బొద్దుగా ఉన్న ఆమె అందమైన మొహంపై అతని దృష్టి పడింది. ఆమె ప్రవర్తన హుందాగా ఉంది. ఆమెలోని మానసిక పరిణతి అతన్ని ఆకర్షించింది.

"ఆ బాలిక మీ అమ్మాయా?" ఆటోన్ అడిగాడు.

"కాదు" ఆమె తల అడ్డంగా ఊపింది.

"సరే మంచిది" అతను మాట్లాడుతూనే గాజుగుడ్డని క్లోరోఫామ్‌తో తడిపి దాన్ని బాలిక ముక్కు దగ్గర పెట్టాడు.

"ఇక్కడ నిలబడి దీన్ని పట్టుకో. నేను చెప్పినప్పుడల్లా కొంచెం గాజుగుడ్డపై పోస్తూ ఉండు" డాక్టర్ కళ్ళలోకి ఒక నిమిషం చూసి "నువ్వు ధైర్యంగా ఉన్నావా? ఎందుకంటే ఇది కొంచెం కష్టమైన పని" అన్నాడు.

యువడాక్టర్ మాట్లాడకుండా ఉండిపోయాడు. అతను ఆటోన్ కదలికలన్నిటినీ మంత్రముగ్ధుడిలా చూస్తున్నాడు. ఈ ఆపరేషన్‌లో ఆశ అనేది రేఖామాత్రమేనని అతనికి తెలుసు. అతను ఒక్కడే సాహసం చేయలేడు. ఆటోన్ పక్కన ఉంటే అది వేరు. అప్పుడు అసాధ్యం అనేదే ఉండదు.

"ఈ యువకుడు పరవాలేదు. బాగానే ఉన్నాడు. చూద్దాం. అదృష్టం ఎలాఉందో" అనుకుంటూ ఆటోన్ అయోడిన్ సీసా తీసుకుని చేతుల్ని తడుపుకుని

"నువ్వు కూడా ఆ పనిచేయి" అంటూ సీసా డాక్టర్‌కి అందిచ్చాడు. అతను బాలిక దగ్గర నిలబడి గాయాన్ని అన్నివైపుల నుంచీ పరిశీలించాడు. తర్వాత యువతివైపు తిరిగి "కొంచెం క్లోరోఫామ్... ఊ. చాలు" అన్నాడు. ఆమె అతని ఆజ్ఞ పాటించడం చూసి ఆటోన్ ముచ్చటపడ్డాడు. తర్వాత బాలిక తొడభాగాన్ని చూస్తూ స్కాల్‌పెల్ చేతిలోకి తీసుకున్నాడు. "ఇదిగో ఇక్కడ" అంటూ ఒకచోట సుతారంగా చర్మాన్ని కత్తిరించాడు. "దూది" డాక్టర్‌ను అడుగుతూ "అబ్బ, ఈ పిల్ల ఎంత సన్నగా ఉందో" అని మనసులో అనుకున్నాడు. "ఇప్పుడు కాలుని వెనక్కువంచు, రక్తాన్ని దూదితో తుడిచెయ్యి" అతను ఆజ్ఞలు జారీచేస్తూ పోతున్నాడు.

రక్తాన్ని దూదితో తుడవగానే గాయం పూర్తిగా కనబడింది. అతని వేళ్ళు చకచకా పనిచేస్తున్నాయి. అతను ఫోర్‌సెప్స్ అందుకున్నాడు. గాయం నుంచి రక్తప్రవాహం తగ్గింది. గదిలో కత్తెర చేస్తున్న సున్నితమైన చప్పుళ్ళు మినహా ఇంకే విధమైన శబ్దమూ లేదు. అతని కళ్ళు గాయం చుట్టూ వేగంగా కదులుతున్నాయి. అతని మనసు స్థిమితంగా ఉంది. అకస్మాత్తుగా అతని మొహం పాలిపోయింది.




"ఛ. రాక్షసి" అతను మెల్లగా గొణుక్కున్నాడు. బాలిక ఊపిరి పీలుస్తున్న ఛాయలు కనిపించ లేదు. అతను బాలిక గుండెవద్ద చెవి ఆనించి వింటుండి పోయాడు. మిగిలిన ఇద్దరూ అతని వంకే కన్నార్పకుండా చూస్తున్నారు.

"లేదు. ఇంకా ప్రాణం ఉంది" అతడు గొణిగాడు.

అతను బాలిక చేతిని పట్టుకుని నాడి చూశాడు. నాడి బలహీనంగా ఉండీలేనట్టు కొట్టుకుంటోంది. ఆటోన్ బరువుగా ఊపిరి పీల్చి వదిలాడు. అతని నుదుటిమీద చెమట ఇంకా ఎక్కువయింది.

"డాక్టర్, ఫోర్‌సెప్స్ తీసేసి గాయానికి కట్టు కట్టు. ఇదిగో మేడమ్ మిమ్మల్నే. నాకు అర్జెంటుగా ఈ ఇంజెక్షన్లు కావాలి. ఇంకా తొమ్మిదే అయింది. షాపులు తెరిచే ఉంటాయి. త్వరగా".

ఆ యువతి తన దుస్తుల వంక చూసుకుంది. ఇంట్లో ఉన్నప్పుడు వేసుకునే దుస్తులు. అయితే డాక్టరు ఆమెకు అవకాశం ఇవ్వకుండా ఇంజెక్షన్ పేరు రాసిన కాగితాన్ని ఆమెకు అందిస్తూ, "ఎంత త్వరగా తేగలిగితే అంత త్వరగా" అన్నాడు.

"ఒకవేళ షాపు మూసి ఉంటే" ఆమె సందేహంగా అడిగింది.

"తలుపులు గట్టిగా బాదు. తెరిచేవరకూ బాదుతూనే ఉండు" ఆమె వెళ్ళిన తర్వాత అతను డాక్టరువైపు చూశాడు.

"బాలికకు సెలైన్ ఎక్కించాలి. నరాల ద్వారా ఎక్కించాలి. అదే చివరి ఆశ" అంటూనే ఆమెకు వెంటనే ఒక ఇంజెక్షన్ ఇవ్వు. చూద్దాం ఏమవుతుందో. పాపం దురదృష్టవంతురాలు" ఆటోన్ అన్నాడు.

బాలిక ఇంకా బలహీనంగా ఊపిరి తీస్తూనే ఉంది. డాక్టరు ఇంజెక్షన్లు చేస్తుంటే ఆటోన్ నిరాశగా బాలికవైపు చూస్తూ ఉండిపోయాడు.

బాలిక మొహం క్షణక్షణానికీ పాలిపోతూ ఉంది. ఆమె చనిపోబోతూ ఉందని ఆటోన్‌కి అర్థమయింది. అయితే ఇంకా ఊపిరి ఉంది.

అప్పుడే తలుపు తీసుకుని ఆ యువతి వగరుస్తూ వచ్చింది. ఆటోన్ ఆమె చేతిలోంచి ఇంజెక్షన్ల సంచి దాదాపు లాక్కుని "వేడినీళ్ళు" అంటూ అరిచాడు. అతను ఇంజెక్షన్ సీసా పగలగొట్టే లోపలే ఆమె వేడినీళ్ళు తీసుకొచ్చింది. రబ్బరు గొట్టం ద్వారా ఆమెకు సెలైన్ ఎక్కడానికి ఏర్పాట్లు చేసి, బాలిక దగ్గరకు వచ్చాడు ఆటోన్. సెలైన్ నెమ్మదిగా ఎక్కుతోంది.

"సెలైన్ ఎక్కుతోంది. ఒకసారి పల్స్ చూడు" ఆటోన్ అరిచాడు.

పది నిమిషాలపాటు ఎవరూ మాట్లాడకుండా మౌనంగా ఉండిపోయారు. ఆటోన్ తలెత్తి "ఎంత సెలైన్ ఎక్కింది" అని అడిగాడు.

"పావు భాగం" డాక్టర్ చెప్పాడు.

"నాడి?"

డాక్టర్ మౌనంగా ఉండిపోయాడు. మరో ఐదు నిమిషాలు గడిచాయి. ఆటోన్ తిరిగి "ఎంత ఎక్కింది" అని అడిగాడు.

"సగం" డాక్టర్ చెప్పాడు.

"నాడి"

"కచ్చితంగా చెప్పలేను. కానీ నాడి తిరిగి కొట్టుకుంటున్నట్టుగా ఉంది"

"లెక్కపెట్టగలవా?"

"లేదు."

"నాడి తిరిగి కొట్టుకోవడం మొదలుపెడితేనే ఏదైనా.." ఆటోన్ నిట్టూర్చాడు. "ఈ చిన్నిపాప శరీరానికి ప్రాణం ఇవ్వడానికి నా ఆయుష్షులో పది సంవత్సరాలు ఇవ్వడానికైనా సిద్ధం. ఆమె వయసు ఎంతై ఉండొచ్చు? బహుశా ఏడేళ్ళు. ఈ పేద వాతావరణంలో ఇలాగే ఉంటే ఇంకో పదేళ్ళకి ఆమెకు క్షయవ్యాధి వచ్చినా రావచ్చు. అయినప్పటికీ ఆమెను కాపాడగలిగితే... నేను చేయగలిగినదంతా చేశాను. ఇంక చేయడానికి ఏమీలేదు. వేచి చూడడం తప్ప" అతను మనసులో అనుకున్నాడు. అకస్మాత్తుగా అతనికి బాలిక ఊపిరి పీల్చినట్టు అనిపించింది. ఒక నిమిషం తర్వాత అది మరింత స్పష్టంగా కనిపించింది.

"సెలైన్ ఇంకా ఎంత మిగిలి ఉంది?"

"దాదాపు అయిపోవచ్చింది".

"నాడి కొట్టుకుంటోందా?"

"కొట్టుకుంటోంది"

"లెక్కపెట్టగలవా?"

"దాదాపు నూట నలభై" ఒక నిమిషం మౌనం తర్వాత డాక్టర్ చెప్పాడు.

ఆటోన్ తేలిగ్గా నిట్టూర్చాడు. జరిగిన అద్భుతం అతని ఊహకు కూడా అందలేదు. అతనికి సంతోషంతో ఈల వేయాలని అనిపించింది. చిన్నగా ఈలవేస్తూ పాడడం మొదలుపెట్టాడు కూడా.

"సెలైన్ అయిపోయింది" డాక్టర్ చెప్పాడు.

అప్పుడు బాలిక చిన్నగా కదిలింది. ఆమె వంకే కళ్ళార్పకుండా చూస్తున్న ఆటోన్ యువతి వైపు సంతోషంగా చూశాడు.

"ఊ.... ఇప్పుడింక ఫరవాలేదు. ముందు కొంచెం వేణ్ణీళ్ళు కావాలి. బాలిక పాదాలు వెచ్చచేయాలి" ఆటోన్ అన్నాడు. ఆమె కళ్ళు ఆనందంతో మెరిశాయి. ఆమె గదిలోంచి వెళ్ళగానే ఆటోన్ ముందుకు వంగి జాగ్రత్తగా సూదిని తొలగించాడు. డాక్టరుని బాలికకు మరో ఇంజెక్షన్ చేయమని చెప్పి యువతి తీసుకువచ్చిన వేడిపాత్రతో బాలిక పాదాలు వత్తాడు.

"పాప బతికినట్టేనా?" యువతి అడిగింది.

"ఒక గంట గడిచిన తర్వాత చెబుతాను" ఆటోన్ అన్నప్పటికి అతని గొంతుపలికిన తీరుకి ఆమెకు విషయం అర్థమయింది. అతని వంక మెరుస్తున్న కళ్ళతో మెచ్చుకుంటున్నట్టు చూస్తుండిపోయింది. ఆటోన్‌కు బైట ఉన్నవాళ్ళ సంగతి గుర్తొచ్చింది.

"పాప సంగతి చెప్పి వాళ్ళను వెళ్ళి నిద్ర పొమ్మను. నువ్వు కూడా యువతితో అంటూనే 'పాపను మంచం మీదకు చేరుద్దామా" అని ఆటోన్ డాక్టరుని అడిగాడు. "ఇందాకటిలాగే కాళ్ళను జాగ్రత్తగా పట్టుకో. దిండు తీసేయి. తల పల్లంలో ఉండడం మంచిది. అన్నట్టు కాలుని కొంచెం సాగదీయడం మంచిది కదూ" ఆటోన్ అన్నాడు.

యువడాక్టర్ ఆటోన్‌వైపు ఆరాధనగా చూశాడు. లాజరస్ సమాధి నుంచీ లేచి వచ్చినపుడు మార్త లోకరక్షకుడిని ఎలా చూసిందో అలా ఉంది ఆ చూపు.

"నేను.. నేను మీ పరికరాలన్నీ సర్దనా" అతను ఆటోన్‌ని అడిగాడు. అతని గొంతులో ధ్వనించిన అంకిత భావం, అభిమానం ఆటోన్ గుండెని

కూడా తాకింది.

"నువ్వు అద్భుతంగా పనిచేశావోయ్" ఆటోన్ డాక్టర్ కళ్ళల్లోకి చూస్తూ భుజాన్ని తట్టాడు. డాక్టరు ఊపిరి పీల్చడం మరిచిపోయాడు.

"ఇక నువ్వు ఇంటికి వెళ్ళిపోవచ్చు. ఇప్పటికే ఆలస్యం అయింది. ఇప్పుడు ఇంక ఇద్దరు డాక్టర్ల అవసరం లేదు. ఆమె గట్టెక్కిందనే అనుకుంటు న్నాను. ఎందుకైనా మంచిది నేను రాత్రంతా ఇక్కడే ఉంటాను. అదీ నువ్వు ఒప్పుకుంటేనే! నువ్వు ఒప్పుకుంటే అని ఎందుకంటున్నానంటే ఆమె నీ పేషెంట్ కాబట్టి. నేను కేవలం సహాయం చేశాను. అంతే. రేపట్నుంచీ ఆమెను నీకే వదిలిపెడతాను. నువ్వే చూడాల్సి ఉంటుంది. ఆమెను సమర్థవంత మైన డాక్టర్ చేతుల్లో పెడుతున్నానన్న నమ్మకం నాకుంది. అయితే ఒక మాట. రేపు మధ్యాహ్నం నువ్వు ఒకసారి ఇక్కడికి రాగలవా? హాస్పిటల్ నుంచి నేను నేరుగా ఇక్కడికే వస్తాను. తర్వాత చేయాల్సిన చికిత్స గురించి మాట్లాడదాం" ఆటోన్ అన్నాడు.

"డాక్టర్, మీరు నాకు మరీ గౌరవం ఇస్తు న్నారు"... యువడాక్టర్ నసిగాడు.

"నేను గొప్ప డాక్టరునని నువ్వేదో భ్రమలో ఉన్నావు. అదేం లేదు. నేను కూడా నీలాగే ఇంకా నేర్చుకునే దశలోనే ఉన్నాను. అంతే" ఆటోన్ అన్నాడు.

డాక్టర్ వెళుతుండగానే మెట్లమీద అడుగుల చప్పుడు వినిపించింది. గదిలోకి వచ్చిన యువ తిని చూసి డాక్టర్ కళ్ళు మెరిశాయి.

"నువ్వింకా నిద్రపోలేదా?"

"లేదు డాక్టర్"

బాలిక చిన్నగా మూలిగింది. ఆటోన్ ఆమె నాడి పట్టుకుని చూసి "ఊ... డెడెట్టి మంచి అమ్మాయి. నాడి నూట ఇరవైకి వచ్చింది. అంటే ఇంక గట్టెక్కామని అనుకోవచ్చన్నమాటే" అని యువతివైపు తిరిగి అన్నాడు. ఆమె మౌనంగా చూస్తూ ఉండిపోయింది.

"నువ్వు ఇక్కడ ఎందుకున్నట్టు?"

"నేను కింద ఐదో అంతస్తులో ఉంటాను. వీళ్ళకు బంధువుని కూడా కాదు".

"మరి ఆమె తల్లి ఎవరు? నాకు తలాతోకా అంతుబట్టడం లేదు".

"ఆమె తల్లి చనిపోయింది. ఆమె షాల్ ఇంట్లో పనిచేసే అలైన్ మేనకోడలు".

వాళ్ళిద్దరూ బాలిక దగ్గరే కూర్చుని చిన్నగా మాట్లాడుకుంటున్నారు. ఆటోన్‌కు ఆమె మొహాన్ని, పెదాల్ని ఇంకా దగ్గరగా చూసే అవకాశం లభిం చింది. ఆమె సాన్నిహిత్యం అతనికి బాగా నచ్చింది. అతని శరీరం అలసటతో ఊగిపోతున్నట్టుగా ఉంది. బాలిక నిద్రలో చిన్నగా కదిలింది.

"రాచెల్" బైట నుంచి గుసగుసగా వినిపించింది.

"అలైన్ అనుకుంటాను. బాలికను చూడ డానికి" యువతి నవ్వుతూ అంది.

"అయితే నీ పేరు రాచెల్ అన్నమాట. సరే ఆవిడను రమ్మను" ఆటోన్ అన్నాడు. దీపకాంతి రాచెల్ మీద పడింది. ఆ వెలుగులో ఆమె మొహం అతనికి మరింత మనోహరంగా అనిపించింది.

"ఆమె తలను సరిచేయి. తలను నిటారుగా పెట్టు" దీపం కాంతిలో రాచెల్‌ను చూస్తూ చెప్పాడు. రాచెల్‌ను చూస్తున్నకొద్దీ ఆటోన్‌కు ఆమెను ముద్దా డాలని కోరికగా అనిపించింది. ఆమెను అలా చూస్తూనే అతను పక్కనే ఉన్న చిన్న పడకపైకి ఒరిగిపోయి నిద్రపోయాడు. నిద్రలో అతనికి రాచెల్ గురించి రకరకాల కలలు వచ్చాయి. ఆమె తనకు సన్నిహితంగా ఉన్నట్టు, ఆమె శరీరం తన శరీ రానికి తగులుతూ వెచ్చదనాన్ని ఇస్తున్నట్టు అతను అనుభూతి చెందాడు.

నిదానంగా అతనికి మెలకువ వచ్చింది. అతను కల అనుకున్నది నిజమే. రాచెల్ అతనికి ఆనుకొని కూర్చుని నిద్ర పోతోంది. ఆమె శరీరం నుంచి తగులుతున్న వెచ్చదనాన్ని, కమ్మదనాన్ని అనుభవిస్తూ అతను కదలకుండా అలాగే ఉండిపోయాడు.

రాచెల్ అకస్మాత్తుగా మేల్కొని చేతులు జాడించి అతన్నుంచి దూరం జరిగి లేచి కూర్చుంది. ఆమె కదలికలకి నిద్ర లేచినట్టు అతను కూడా కళ్ళు తెరిచి చూశాడు.

"నేను నిద్రపోయాను" ఆమె సిగ్గుపడుతూ చెప్పింది.

"నేను కూడా" అతనన్నాడు.

"తెల్లారిపోయింది" ఆమె గుసగుసగా అంది.

ఆటోన్ టైము చూశాడు. నాలుగైంది. బాలిక కదలకుండా పడుకునే ఉంది. గాయం నుంచి ఒక్క చుక్క రక్తం కూడా కారడం లేదు. ఆమె నాడి చూశాడు. నూట పది. ఇంక ఫరవాలేదన్నట్టు తలాడించాడు.

"నేను ఇంటికి వెళ్తున్నాను. ఏమైనా అవసరం అయితే వెంటనే పిలు" ఆమె అలైన్‌కి చెప్పి డాక్టర్ వైపు చూడకుండానే వెళ్ళిపోయింది.

ఆమె వెళ్లగానే ఆటోన్‌కి కూడా ఉండబుద్ధి కాలేదు. ఇంటికి వెళ్ళి స్నానం చేసి బట్టలు మార్చుకుని హాస్పిటల్‌కి వెళ్ళాలి అనుకున్నాడు. అలైన్‌ని పిలిచి తను వచ్చేలోగా తీసుకో వలసిన జాగ్రత్తలు చెప్పాడు. షాల్‌కోసం చూస్తే అతను గురకలుపెట్టి నిద్రపోతూ కనిపించాడు. అతను ఇంక ఆగదలచుకోలేదు.

మెట్లు దిగుతుండగా అతనికి అకస్మాత్తుగా గుర్తొచ్చింది రాచెల్‌ది కింది అంతస్తేనని. అడు గుల చప్పుడు విని రాచెల్ గుమ్మంలోకి వచ్చింది.

"ఇంట్లోకి రండి డాక్టర్. ఏమన్నా తీసుకుని వెళుదురు గాని" అని ఆహ్వానించింది. ఆమె అప్ప టికే స్నానం చేసి తెల్లటి దుస్తులు ధరించి ఉంది.

"ఈ అవతారంతోనా? మరోసారి వస్తాను" డాక్టరు తన శరీరం వంక చూసుకుంటూ కరచా లనం కోసం చేయి చాపాడు.

"అలా అయితే కరచాలనం కూడా వద్దు లెండి" అంటూనే ఆమె చిలిపిగా నవ్వింది. నవ్వు తూనే అతని చేయి అందిపుచ్చుకుని లోపలికి లాగి, కాలితో తలుపును నెట్టి మూసివేసింది. మూసిన తలుపుల వెనుక ఇద్దరూ ఒకరి వంక ఒకరు చూసుకుంటూ నిలబడ్డారు.

ఆమె జుట్టునుంచి వస్తున్న పర్ఫ్యూమ్ పరి మళం అతని చుట్టూ అలుముకుంది. అతను కావాలనే తన మొహాన్ని ఆమె మొహానికి దగ్గ రగా తెచ్చాడు. ఆమె వెనక్కి తగ్గకుండా తన పెదాలని అతని పెదాల దగ్గరికి చేర్చి ముద్దు పెట్టింది. తర్వాత అతి కష్టమ్మీద అతని నుంచి దూరం జరిగి తలవంచుకుని నవ్వింది.

నవ్వుతూనే "నిన్నరాత్రి అంత అద్భుతం చేసి నందుకు" అంటూ గుసగుసలాడింది.

తెరిచిన తలుపుల గుండా, అతనికి దూరాన గదిలో ఉన్న మంచం, మంచం మీద ఆమె ధరిం చిన గులాబీరంగు దుస్తులు కనిపించాయి. అప్పుడు తూరుపు తొలిరేకలు విచ్చుకోసాగాయి.

అనువాదం: **జి.లక్ష్మి** e-mail: guttalakshmi62@gmail.com

## నిత్యకు కష్టకాలం?



*నిత్యామీనన్... మంచి నటి. ఇది అందరూ అంగీకరించే నిజం! ఇంత మంచి నటికి కూడా కష్టకాలం ప్రారంభమైందంటున్నారు టాలీవుడ్ జనాలు. కొత్తగా వస్తున్న హీరోయిన్లు గ్లామర్ పేరుతో విపరీతంగా ఎక్స్‌పోజింగ్ చేయడం, సీన్ డిమాండ్ పేరుతో లిప్‌లాక్‌లకు ఓకే చెప్పడం వంటివి దర్శకనిర్మాతలకు వరంగా మారితే నిత్యాకు మాత్రం శాపంగా మారాయంటున్నారు. నిత్యా ఇప్పుడున్న పోటీని చూస్తూ కూడా మడి కట్టు కునే కూర్చుంటాను అంటూ భీష్మించడంతో ఆమెకు అవకాశాలు క్రమేపీ తగ్గిపోతున్నాయి. ఆమెను దృష్టిలో పెట్టుకుని రాసుకున్న కథలకు మాత్రమే ఆమెను తీసుకుంటున్నారు. మిగతా కమర్షియల్ సినిమాల్లో ఆమెను దూరం పెట్టేస్తున్నారట! దాంతో గతంలో లాగా నిత్యా బిజీ బిజీగా సిని మాలు చేయడం లేదట! పరిస్థితిని గమనించి అయినా నిత్యా తన పద్ధతి మార్చుకుంటే మంచి దని అంటున్నారు ఆమె శ్రేయోభిలాషులు.*

# మనవళ్ని తీర్చిదిద్దే మలితరం పాత్రే కీలకం

**వారసుడు పుట్టినప్పుడు తల్లిదండ్రులకంటే ఎక్కువగా గర్వించేది గ్రాండ్ పేరెంట్సే! నా మనవడు, నా మనవరాలు..., నా రక్తం...! అంటూ మీసం మెలేసేది తాతయ్యలూ, మాతామహులే. మా భడవ ఎంత అల్లరి చేస్తాడో అని ముచ్చటపడిపోయేది అమ్మమ్మలూ బామ్మలే. అది వారి హక్కు. వారికి ఆత్మవిశ్వాసాన్నిచ్చేది అలాంటి కబుర్లే.**

**తల్లిదండ్రులిద్దరూ ఉద్యోగ బాధ్యతల్లో బిజీగా మారిపోతున్న ఈ కాలంలో గ్రాండ్ పేరెంట్సే వారి ఆలనాపాలనా చూస్తున్నారు. ఆ అవకాశం లేని కుటుంబాలవారు తమ పిల్లల్ని కేర్‌టేకర్లకు అప్పగిస్తున్నారు.**

మరి ఈ సందర్భంలో చిన్నారుల బాధ్యతలన్నీ చేపట్టి వారిని ఆదర్శవంతంగా తీర్చిదిద్దే బృహత్తరకార్యాన్ని ఓపిక ఉన్నంతవరకు బామ్మా తాతలే భుజానమోస్తున్నారు. తల్లిదండ్రులకు, పిల్లలకు మధ్య వారే వారధిగా వ్యవహరిస్తూ అంతరాలను తగ్గించే బాధ్యత కూడా నిర్వర్తిస్తున్నారు. కానీ ఆ బాధ్యతలకు దూరంగా మీ బాధలు మీరు పడండంటూ దూరంగా బతికే గ్రాండ్‌పేరెంట్స్ కూడా లేకపోలేదు.

పిల్లల్ని కనిపెంచి, పెద్దవాళ్లను చేసి ఓ ఇంటివాళ్ళను చేయడంతో బాధ్యత తీరిపోయిందనుకుంటే పొరబాటే. ఎందుకంటే కేవలం తల్లిదండ్రులుగానే కాదు, గ్రాండ్ పేరెంట్స్‌గా కూడా చేయాల్సిన కొన్ని బాధ్యతలుంటాయి. మనవళ్లు, మనవరాళ్లతో సరదాగా గడుపుతూ వారికి సలహాలివ్వడం, పిల్లలకు భవిష్యత్తుపై చక్కటి అవగాహన కల్పించడంతో పాటు మరెన్నో గొప్ప అనుభూతుల్ని సంపాదించుకునే అవకాశం గ్రాండ్ పేరెంట్స్‌గా మనకు ఉంటుంది. ఈ క్రమంలో మన మనవల పట్ల మనం ఎలా ఉండాలో ఓసారి గుర్తుచేసుకుందాం!

### పెద్దలు దగ్గరుంటేనే మేలు

పిల్లలు తల్లిదండ్రుల దగ్గర పెరగడమే అన్ని రకాలుగా మంచి పద్ధతి. కానీ అలా వీలుకాని పక్షంలో కేర్‌టేకర్స్ కంటే, తాతా బామ్మలుగా మన సమక్షంలో పిల్లలు ఉండటమే మంచిది. ఎందుకంటే కేర్ టేకర్ సెంటర్లు ఎన్ని ఉన్నా కేవలం సంరక్షణతప్ప పిల్లల పెంపకానికి అంతగా తోడ్పడవు. పైగా ఆ కేంద్రాలపై పూర్తి విశ్వాసాన్ని ఉంచలేం. అందుకే వారిని బామ్మ, అమ్మమ్మ, తాతయ్యల దగ్గర ఉంచడం వల్ల వారి ఎదుగుదల సక్రమంగా ఉంటుంది. పైగా పిల్లల్ని తీర్చిదిద్దడంలో వారికున్న అపారఅనుభవం, జీవిత పాఠాలతో వాళ్లు నేర్చుకున్న జ్ఞానం పిల్లలకు ఎంతగానో ఉపయోగపడుతుంది.



### బంధాల విలువ తెలిసేలా

ఈ తరం పిల్లలకు బంధాలు, బంధుత్వాల విలువలు, సంస్కృతీ, సంప్రదాయాల గురించి అంతగా తెలియడంలేదు. అంతేకాదు, అలాంటి విషయాలు పిల్లలకు నేర్పించడానికి, వివరించడానికి తల్లిదండ్రులకు సమయం ఉండట్లేదు. మరి పిల్లల సందేహాలు ఎవరు తీరుస్తారు? అని ప్రశ్నించుకుంటే, ఇంట్లో పెద్దవాళ్ళే ఆధారం. కుటుంబ చరిత్ర, బంధుత్వాలు, మన గ్రామాలు, సంస్కృతి సంప్రదాయ పద్ధతులు, అలవాట్లను పెద్దలుగా మనమే వివ

రించాలి. ఫలితంగా అప్పటితరం గురించి తెలియడంతో పాటు సంబంధబాంధవ్యాల గురించి కూడా పిల్లలకు ఓ అవగాహన వస్తుంది. ఇలా ఆ కుటుంబానికి సంబంధించిన పాతతరం విషయాలను పిల్లలకు వివరించడం వాటిపై పూర్తి అవగాహన కల్పించడం వంటి బాధ్యతలన్నీ మనకంటే బాగా ఎవరు నిర్వహిస్తారు చెప్పండి.

### తప్పుపట్టేముందు..

మనవరాళ్ళు, మనవళ్ళ సంరక్షణ మన చేతుల్లోనే ఉందనే విషయాన్ని గుర్తుంచుకుని ప్రవర్తించాలి. ఎప్పుడైనా పిల్లలను ఏదైనా విషయంలో తప్పుపట్టే సందర్భాలలో ఆ సమయంలో చిన్నారులు ఉన్నారా లేదా అనే విషయాన్ని చూసుకోవాలి. ఎందుకంటే వారిముందే వారి తల్లిదండ్రులను తిట్టడం వల్ల వారికి తల్లిదండ్రులు అంటే లోకువ భావన ఏర్పడవచ్చు లేదా మనపట్ల దురభిప్రాయమూ కలగవచ్చు. అంతే కాదు ప్రతి విషయాన్ని పిల్లలు ఇట్టే పట్టేస్తారు. పరిశీలనాశక్తి పిల్లలకే ఎక్కువ. మనం ఏం చేస్తే వారూ అదే చేయాలన్న తపనతో ఉంటారు. అందుకే ఏం చేసినా ఇంట్లో చిన్నారులను దృష్టిలో పెట్టుకుని చేయాలి.

### సహనం ముఖ్యం

ఈ కాలం పిల్లలు చాలా స్పీడ్. విపరీతమైన ప్రశ్నలతో ఎప్పుడూ విసిగిస్తూ అడిగిందే అడుగుతూ ఉంటారు. మనం ఏదోచెప్పి వదిలేద్దాం అనుకుంటే కుదర్దు. ఎందుకంటే ఈ కాలం పిల్లలు ఆవలిస్తే పేగులు లెక్కబెట్టేంత తెలివైన వాళ్లు. టెక్నాలజీ సహాయంతో అన్నీ నేర్చుకోగల సమర్థులు. అందుకే ఎదిగే వయసులో వారిని చాలా జాగ్రత్తగా చూసుకోవాలి. అలాగే పిల్లలందరూ ఒకేలా ప్రవర్తించరు. ఒక్కొక్కరూ ఒక్కోలా ఉంటారు. ఈ క్రమంలో పిల్లల ప్రవర్తనలో ఏ మాత్రం తేడా కనిపించినా అంటే దురుసుగా వ్యవహరించినా తిరగబడుతున్నా వీలైనంత వరకు వారు ఎందుకలా ప్రవర్తిస్తున్నారో కనుక్కోవడానికి ప్రయత్నించాలి. మనవల్ల చేతనైనదంతా చేయాలి. లేదా ఆ విషయాన్ని వెంటనే తల్లిదండ్రుల దృష్టికి తీసుకెళ్ళాలి. అప్పుడే వారి విపరీత ప్రవర్తనలను సరిదిద్దడానికి వీలు కలుగుతుంది.

### ప్రోత్సహించండి

చిన్నారుల ముందు ఎవరినైనా పొగడాల్సి వస్తే పొగిడేయండి. ఎందుకు పొగిడామో వారికి విడమరిచి చెప్పాలి. ఫలితంగా మంచి పనులు చేయడంవైపే వాళ్ళు దృష్టి మరలిస్తారు. అనుక్షణం మనం ఇచ్చే ప్రోత్సాహం, మన మాటలే వారిని ముందుకు నడిపిస్తాయని మరిచిపోకూడదు. అందుకే వాళ్ళు ఏ చిన్న మంచిపని చేసినా ప్రశంసలతో ముంచెత్తాలి. ఒకవేళ ఏదైనా తప్పు చేస్తే అది తప్పు అని వివరించి చెప్పాలి. కానీ అందరిముందు ఎత్తి చూపకూడదు. వారు చేసింది ఎందుకు తప్పో, ఎలా చేస్తే ఒప్పు అవుతుందో విడమర్చి చెప్పాలి. ఇలా పిల్లలకు సానుకూలంగా ఆలోచించడం అలవాటు చేయాలి.



## ఆటపాటలతో ఆనందం

ఆటల విషయంలో పిల్లలు వారి స్నేహితుల తర్వాత ఆసక్తి చూపించేది ఇంట్లో ఉండే బామ్మ, తాతయ్యలపైనే. తల్లిదండ్రులు ఉద్యోగాల హడావిడిలో పడి పిల్లలతో ఎక్కువ సమయం గడపలేకపోతే ఆ లోటును తీర్చడంలో గ్రాండ్ పేరెంట్స్ పాత్ర ఎంతో కీలకం. తల్లి ఉద్యోగానికి వెళ్ళాక పుట్టినప్పటి నుంచి వారిని కంటికి రెప్పలా కాపాడుతూ పెంచి పెద్ద చేసి విద్యాబుద్ధుల్లోనూ వారికి తెలిసిన విషయాలు బోధించడం, పిల్లల దగ్గర నుండి కొత్త విషయాలు నేర్చుకోవడం, రోజూ వారితో ఆడుకోవడానికి సమయం కేటాయించడం, వారికి తెలిసిన కొన్ని ఆటలు పిల్లలకు నేర్పించడం ఇలా పిల్లలు ఎదిగే క్రమంలో మలితరం పాత్ర నిజంగా మరువలేనిదని చెప్పవచ్చు.



## మీరే మార్గదర్శకులు

తల్లిదండ్రులు ఉద్యోగ పనులతో బిజీగా ఉన్న పరిస్థితుల్లో వారికి సున్నితంగా సునిశితంగా బోధించే నైపుణ్యాలు కలిగిన వ్యక్తులు తల్లితండ్రుల తర్వాత మలితరం వారే. ఈ క్రమంలో మనవళ్ళు, మనవరాళ్ళకు వారితరంలో జరిగిన కొన్ని సంఘటనల్ని ఉదాహరణలుగా వివరించడం, అప్పటి పరిస్థితుల్ని ఎదుర్కొన్న తీరు, పిల్లలు వారి భవిష్యత్తును మరింత అందంగా తీర్చిదిద్దుకోవడానికి అవసరమైన గుణాలు, స్వభావాలు ఇలా ఎన్నో విషయాలు పిల్లలకు సవివరంగా చెప్పడానికి వీలుంటుంది. కాబట్టి జీవితానికి సంబంధించిన పాఠాలు నేర్పడంలోనూ మలితరంపాత్ర కీలకమే అనడంలో ఎలాంటి సందేహంలేదు.

### అర్థమయ్యేలా చెప్పాలి

పిల్లలకు తల్లిదండ్రులతో ఆడుకోవాలనే కోరిక ఉంటుంది. కానీ ఆఫీసు పనులతో బిజీగా గడిపే తల్లిదండ్రుల్ని చూసి ఏం చేయాలో అర్థం కాక దిగాలుగా ఉంటారు. అటు తల్లిదండ్రులకు కూడా పిల్లలతో గడిపే సమయం చాలా తక్కువగా ఉంటుంది కాబట్టి వారిద్దరి మధ్య అంతరం పెరగకుండా ఇంటి పెద్దలుగా మనమే జాగ్రత్తలు తీసుకోవాలి. తగినంత సమయం గడపడానికి తల్లిదండ్రులకు ఎందుకు వీలుకుదరడం లేదో చిన్నారులకు వివరించి చెప్పాలి. మనవల్ని మీరే పెంచుతున్నప్పటికీ వాళ్ళ బాధ్యత ఎంతో కొంత తల్లిదండ్రులకు కూడా ఉంటుందిగనుక వాళ్ళ అంగీకారంతోనే పిల్లలకు సంబంధించిన విషయాల్లో కల్పించుకోవడం మంచిది.

### అప్పుడప్పుడు బయటకు

తాతాబామ్మలుగా, అమ్మమ్మా తాతయ్యలుగా మన సంరక్షణలో పిల్లలు ఎంత చక్కగా పెరిగినా తల్లిదండ్రులకూ పిల్లలకీ మధ్య ఎక్కువ దూరం పెరగకుండా ఎప్పటికప్పుడు జాగ్రత్త పడాలి. అందరూ కలిసి విహారయాత్రలకు వెళ్లడం, సరదాగా కలిసి భోజనం చేయడం వంటివాటివల్ల పిల్లలకు అనుబంధాల విలువ తెలుస్తుంది. అంతేకాదు పలు ప్రాంతాల చరిత్ర తెలుసుకుంటారు. ఈ విధంగా కూడా కొన్ని నైపుణ్యాలు కొత్త విషయాలు పిల్లలకు తెలిసే అవకాశం ఉంటుంది. ఏదైనా ఫంక్షన్లకు, పార్టీలకు వెళ్ళేటప్పుడు మనవళ్ళు, మనవరాళ్ళను తోడుగా తీసుకెళ్ళడంవల్ల మన సంస్కృతికి సంబంధించిన వేడుకలు, అక్కడి మనుషులు, బంధుత్వాల గురించి కూడా వారికి ఒక అవగాహన కలుగుతుంది.

చక్కటి కథలు చెబుతూ వాళ్ళ వెన్నంటే ఉంటూ వారిని ఎప్పటికప్పుడు కంటికి రెప్పలా జాగ్రత్తగా చూసుకోవాలి. అప్పుడే మనం బెస్ట్ గ్రాండ్ పేరెంట్స్ కాగలుగుతాం!

### తోడుగా ఉండండి

జీవితానికి సంబంధించిన ఎన్నో విషయాలను బోధించే క్రమంలో కొన్ని అత్యవసర సందర్భాల్లో పిల్లలకు అండగా నిలబడేది గ్రాండ్ పేరెంట్సే. ఒక్కోసారి పిల్లలు తెలిసో తెలియకో చిలిపి పనులు చేసి తల్లిదండ్రులకు కోపం రప్పించిన సమయాల్లో వారిని వెనుకేసుకొచ్చేది గ్రాండ్ పేరెంట్సే కదా! ఓ వైపు అమ్మానాన్నలకి సర్దిచెబుతూనే మరో వైపు సున్నితంగా హెచ్చరించి పిల్లల్ని బుజ్జగించి సరైన మార్గంలో నడిపించడానికి తాపత్రయపడేది వాళ్ళే. అయితే అన్ని విషయాల్లోనూ పిల్లలు చేసే పనుల్ని వెనకేసుకురాకుండా జాగ్రత్త పడడం కూడా అవసరమే!

- విజేత




# అనుమానితులు ఫుల్.. ఆధారాలు నిల్!

**'కేసు క్లిష్టంగా ఉంది బాస్' నిస్పృహతో చేతిలో ఫైలు టేబుల్‌పై విసిరికొట్టి లేచాడు అసిస్టెంట్ రాము.**

**నవ్వాడు డిటెక్టివ్ శరత్. 'పరిశోధన అంటే సినిమాల్లో చూపించినట్టు సాహసచర్యకాదు. ఓపికతో ఇసుకరేణువుల్ని పరిశీలిస్తూ ఎడారిలో సూదిని వెతికిపట్టుకోవటం' అన్నాడు.**

**'ఇది దొరికే సూది కాదు. ఎందుకంటే ఈ ఎడారిలో ఇసుకరేణువుల కన్నా సూదులే ఎక్కువ' అన్నాడు రాము.**

'అలాంటప్పుడు అసలు సూదిని వెతికి పట్టుకోవాలి' నవ్వుతూ అన్నాడు.

వాళ్లిద్దరూ మాట్లాడుతున్నది విశ్వేశ్వరరావు కేసు గురించేనని గదిలో అడుగుపెట్టిన ఇన్‌స్పెక్టర్ విజయ్ వెంటనే గ్రహించాడు.

'ఎంతవరకూ వచ్చింది పరిశోధన?' అడిగాడు.

'అనుమానితులు ఫుల్! ఆధారాలు నిల్' అంటూ నవ్వాడు రాము.

'రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో తన భర్త గుసగుసగా పిలిచినట్టు అనిపించి బైటకు వచ్చి చూసింది విశ్వేశ్వరరావు భార్య పద్మజ. ఇంటిముందు ఆగి ఉన్న కారు డ్రైవింగ్ సీటులో భర్త వాలిపోయి ఉన్నాడు. ఇద్దరు గూండాలు దారికాచి నన్ను కాల్చారు అని ఆమెకు చెప్పి అతను స్పృహతప్పిపోయాడు. ప్రస్తుతం హాస్పిటల్‌లో ప్రమాదం అంచున ఉన్నాడు. దారికాచి అతన్ని చంపాలనుకున్నది ఎవరు? విశ్వేశ్వరరావును చంపమని ఎవరైనా గూండాలను నియమించారా? అన్నది పరిశీలిస్తున్నాం' చెప్పాడు శరత్.

'విశ్వేశ్వరరావుకు అమ్మాయిలపిచ్చి. అతని మీద కసి తీర్చుకోవాలని ఎదురుచూస్తున్న అమ్మాయిల సమాచారమే ఈ ఫైలులో ఉన్నదంతా! వీళ్లల్లో ఎవరయినా కాల్పులు జరిపి ఉండవచ్చు' అన్నాడు రాము.

తల ఊపాడు శరత్. 'నిజమే, విశ్వేశ్వరరావు హత్యలో అనుమానితులు బోలెడంతమంది. అతనితో సంబంధం ఉన్న ప్రతి యువతిని అనుమానించవచ్చు. లేదా ఇతడివల్ల భంగపడ్డ యువతి బాయ్‌ఫ్రెండ్, అన్న, భర్త ఎవరోఒకరు ప్రతీకారం తీర్చుకుని ఉండవచ్చు. అతడు రాత్రి పూట ఆ దారిలో ఎందుకు వెళ్లాడు? అతని వెంట ఎవరయినా అమ్మాయి ఉన్నదా? ఆ గూండాలు ఆ అమ్మాయికి సంబంధించిన వాళ్లా? అనే విషయాలు తెలియాలి' చెప్పాడు శరత్.

'అతడి కాల్ రికార్డ్స్ ఆధారంగా నెల రోజులుగా అతడు మాట్లాడిన వారందరి జాబితా తయారుచేశాను. కలిశాను. అతడు మనిషా? మహిళల వెంటపడే యంత్రమా? అనిపిస్తోంది. నెల రోజుల్లో యాభై మంది యువతులతో రొమాన్స్ చేశాడు. వాళ్లతో మాట్లాడుతూ టెక్స్ట్ మెసేజీలు ఇస్తూ గడిపాడు. రోజుకి ఇద్దరు ముగ్గురితో గడిపేవాడు. వాళ్లల్లో పెళ్లైన వాళ్లు, కాని వాళ్ళూ ఉన్నారు. ఆ అమ్మాయిల్లో కొందరికి బాయ్‌ఫ్రెండ్స్ ఉన్నారు. ఈ కేసులో ఎంతమంది కదలికలను పరిశీలించాలి? ఎంతమంది ఫోన్లు టాప్ చేయాలి?' అన్నాడు రాము.

ఇన్‌స్పెక్టర్ విజయ్‌వైపు తిరిగాడు శరత్. 'విజయ్, కేసు పరిశోధన సరిగ్గా సాగుతున్నట్టులేదు. మళ్లీ మొదటి నుంచి ఆరంభిస్తా' అన్నాడు.

'నీ ఇష్టం' అన్నాడు విజయ్.

●●●

'కాల్పులు జరిగాక విశ్వేశ్వరరావు ఏ దారిలో వెళ్ళాడో, ఏ దారిలో వచ్చాడో, ఎంత దూరం ప్రయాణించాడో సర్వేలెన్స్ కెమెరాల్లో చూసి వివరాలు సేకరించు. ఈలోగా నేను కారును మరోసారి పరిశీలిస్తాను' అని రామూకి చెప్పి విజయ్‌తో కలిసి బయల్దేరాడు శరత్.

●●●

కారును అణువణువు తనిఖీ చేశాడు. కారు క్రిందకు దూరి పరిశీలించాడు. ఎండినఆకులతో ఉన్న కొమ్మభాగం అతుక్కుని కనిపించింది. జాగ్రత్తగా దాన్ని బైటకుతీసి వెలుతురులోకొచ్చి చూశాడు. 'మనకు దగ్గరలో పొద్దుతిరుగుడు పువ్వు తోటలున్నాయా?' అడిగాడు.

'ముంబాయి హైవే పక్కన ఉంటాయి. రొమాన్స్ చేయటానికి ఆ ప్రాంతాన్ని వాడుతుంటారు. అది ప్రమాదకరమనీ, దోపిడీ దొంగలు దాడులు చేస్తున్నారనీ హెచ్చరిక చేశాక జంటలు అటువైపు వెళ్ళడం తగ్గింది' అంటూ శరత్‌వైపు చూశాడు విజయ్.

'మొదటి ఆధారం లభించింది' అన్నాడు శరత్.

●●●

'ఈ మధ్య కాలంలో మీ తోటలో అసాధారణ సంఘటన ఏదైనా జరిగిందా? అంటే ఏదైనా కారు తోటలోకి చొచ్చుకు రావటం...తుపాకీ శబ్దాలు వినబడటం.. తోట యజమానిని అడిగాడు శరత్.

'ఆ మధ్య ఓ రాత్రి తుపాకులు పేలిన శబ్దం వినిపించింది. నేను పరుగెత్తుకువచ్చి చూస్తే ఓ కారు తోటలోకి దూసుకొచ్చింది. మళ్లీ రోడ్డువైపు వెళ్ళిపోయింది. తాగుబోతులెవరో నడిపి ఉంటారు'

'కారులో ఎవరున్నారో చూశారా? నెంబరు గుర్తుందా?'

'అంతాచీకటి' అన్నాడు యజమాని.

'పోనీ తుపాకులెవరు కాల్చారో చూశారా?'

'అది తెలియదుగానీ పక్కతోటలో ఎవరిదో శవం దొరికిందని విన్నాను. పోలీసులు వచ్చారు' చెప్పాడతడు.

●●●

'అవునండి. ఎవరిదో యువకుడి శవం. రెండు గుళ్ళు గుండెలోంచి దూసుకుపోయాయి. అన్ని పోలీస్‌స్టేషన్లకు మెసేజీ ఫ్లాష్‌చేశాం. అతడెవరో తెలియదు' ఫోటోలు అందిస్తూ చెప్పాడు ఇన్‌స్పెక్టర్.

వాటిని చూసి విజయ్‌కి ఇస్తూ, టీవీల్లో ఇతని ఫోటో చూపించండి' అన్నాడు శరత్.

'సార్... ఏదోకారు తన తోటను ధ్వంసం చేసిందని ఆరోజు పక్కతోట యజమాని కూడా ఫిర్యాదు చేశాడు. టైర్ల గుర్తుల ఫోటోలు ఇదిగో' అందించాడు. వాటిని అందుకున్నాడు శరత్. 'విశ్వేశ్వరరావు కారు టైర్లతో వీటిని సరిపోల్చండి' అన్నాడు శరత్ లేస్తూ.

●●●

'మీరు టీవీలో చూపిస్తున్న యువకుడు, జహీరాబాద్‌కు సమీపంలోని హుగ్గెళ్ళి గ్రామంలో ఉంటాడు. పేరు తెలియదు. అతడి అడ్రసు రాసుకోండి' ఫోనులో మాటలు వింటూనే రాముకు సంజ్ఞ చేశాడు శరత్. రాము పెన్ను, పేపరు అందించాడు.

అడ్రసు రాసుకున్నాడు శరత్.

'నీకో విషయం చెప్పాలి శరత్. మనకు దొరికిన యువకుడి శరీరంలో దొరికిన తుపాకీగుళ్ళు,

**అతడికి అమ్మాయిల పిచ్చి. ఒక్క నెలలోనే యాభైమందితో రొమాన్స్ చేశాడు. ఎవరో అతడిపైన కాల్పులు జరిపి మృత్యుముఖంలోకి నెట్టారు. కేసు డిటెక్టివ్ శరత్ టేకప్ చేశాడు. అనుమానితులు చాలామంది ఉన్నారుగానీ, ఒక్క ఆధారం కూడా కనిపించడం లేదు. ఇది పథకం ప్రకారం జరిగిందా? లేక కాకతాళీయంగా జరిగిందా? ఈ కేసును డిటెక్టివ్ ఎలా పరిష్కరించాడు?**



విశ్వేశ్వరరావు తుపాకీ నుంచి వెలువడినవే. సో మన పరిశోధన సరైన దారిలోనే ఉంది' అన్నాడు విజయ్.

'ఐతే ఆ తుపాకీ ఎవరిదగ్గరుందో వెతికి పట్టుకోవాలి' అన్నాడు శరత్.

●●●

'హుగ్గెళ్ళి' గ్రామంలో అడ్రసు ఈజీగానే దొరికింది.

'ఇతడి పేరు హబీబ్. మా ఇంట్లోనే పై గదిలో ఒంటరిగా అద్దెకు ఉండేవాడు. అతడితో ఎక్కువ పరిచయం లేదు. కొన్నిరోజులుగా ఇంటికి రావటం లేదు' చెప్పాడు ఇంటి యజమాని ఈశ్వర్.

'మా అమ్మ నాన్న ఊరెళ్లారు. ప్రస్తుతం ఒక్కడినే ఉన్నాను' హబీబ్ గది తలుపుతీస్తూ చెప్పాడు ఈశ్వర్.

గదిలో సామాన్లేమీ లేవు.

చుట్టచుట్టి ఉన్న పరుపు తెరవగానే దానిలో తుపాకీ కనిపించింది. గ్లవ్స్ తొడిగిన చేతులతో దాన్ని తీశాడు శరత్. చూడగానే అది నాటు తుపాకీ అని అర్థమవుతోంది.

'విజయ్, ఇది విశ్వేశ్వరరావును కాల్చిన తుపాకీనో కాదో తెలుసుకో' అన్నాడు శరత్.

'ఏమైంది సార్ హబీబ్‌కు?' అడిగాడు ఈశ్వర్.

'హబీబ్‌ను ఎవరో కాల్చి చంపారు' చెప్పాడు శరత్ బయటకు నడుస్తూ.

●●●

'బాస్. హబీబ్ నిరుద్యోగి. పెద్దగా చదువు లేదు. అల్లరి చిల్లరి తిరుగుళ్ళు చిల్లర ఉద్యోగాలు. నేరచరిత్ర లేదుగానీ మంచివాడేం కాదు' చెప్పాడు రాము.

ఇంతలో శరత్‌కు ఫోను వచ్చింది. 'శరత్ విశ్వేశ్వరరావును కాల్చి చంపింది ఆ తుపాకీతోనే' చెప్పాడు విజయ్.

ఒక్కసారిగా శరత్ ముఖంలోకి రక్తం పొంగుకు వచ్చింది. 'విజయ్ మనవల్ల పొరపాటు జరిగింది. ఈశ్వర్‌పై నిఘా పెట్టలేదు. వాడిని బంధించమని కబురుపెట్టు" గబగబా చెప్పాడు శరత్.

'ఎందుకు?' అడిగాడు విజయ్.

'ఎందుకేమిటి? ఈ తుపాకీతోనే విశ్వేశ్వరరావు హత్య జరిగితే, హంతకుడిగా భావిస్తున్న హబీబ్ అక్కడే పడి మరణిస్తే ఈ తుపాకీ హబీబ్ ఇంట్లో పరుపులోకి ఎలా వచ్చింది? విశ్వేశ్వరరావు తనపై ఇద్దరు దాడి చేశారని చెప్పాడు. ఒకడు హబీబ్. రెండవ వాడు ఈశ్వర్. విశ్వేశ్వరరావుని చంపి ఏమీ ఎరగనట్టు ఇంటికివచ్చి తుపాకీ హబీబ్ ఇంట్లో దాచి ఉంటాడు. తుపాకీపై వేలిముద్రలు, ఈశ్వర్ వేలిముద్రలతో పోలిస్తే నేర నిరూపణ జరుగుతుంది. చలో' అంటూ లేచాడు శరత్.

●●●

'హుగ్గెళ్ళి' గ్రామంలోకి శరత్ కారు ప్రవేశించగానే అక్కడున్న కానిస్టేబుల్ చెప్పాడు, 'ఈశ్వర్ పారిపోయాడు. బీదర్ వెళ్ళే బస్సు ఎక్కాడని తెలిసింది' అని.

కారు వెనక్కి తిప్పి బీదర్ రోడ్డుపైన దూకించాడు శరత్.

'అనాలోచితంగా ప్రవర్తించి, చేతికి అందిన వాడిని వదిలేశాం?' దారిలో అన్నాడు విజయ్.

శరత్ మాట్లాడలేదు. చివరికి అన్నాడు. 'ఆ తుపాకీ హత్యకు వాడిందని నిర్ధారణయ్యేవరకూ మనకు ఈశ్వర్‌మీద అనుమానంవచ్చే వీలు లేదు. వాడు పారిపోతేనేకదా మనకు డౌట్ క్లియరయ్యేది. వాడు 'నాకేం తెలియదు' అంటే మనం చేసేదేం లేదు'.

కారు బీదర్ చేరింది. అప్పటికే రాము, అతడి అనుచరులు బీదర్‌లో ఈశ్వర్‌కోసం గాలిస్తున్నారు.

'బాస్... ఇక్కడ గురుద్వారాలో ఈశ్వర్‌ను పోలిన యువకుడు కనిపించాడు. మన వాళ్లు అతడిని వెంబడిస్తున్నారు. ఊరంతా బలాదూర్ తిరుగుతున్నాడు. లంగర్‌లో మేస్తున్నాడు' చెప్పాడు రాము.

'గురుద్వారా వెళ్దాం' అన్నాడు శరత్. కారును ఆవైపు మళ్లిస్తూ.

●●●

భోంచేసి లంగర్ నుంచి బయటకు వస్తున్న ఈశ్వర్‌ను సులభంగా గుర్తించారు. భోంచేసి వచ్చి అక్కడఉన్న బెంచీపై కూచుని గురుద్వారాకేసి చూస్తున్నాడు ఈశ్వర్. శరత్, విజయ్‌లు వెళ్లి అతడికి చెరోపక్కన కూర్చున్నారు. 'విశ్వేశ్వరరావుపై ఎందుకు హత్యాయత్నం చేశావు?' సూటిగా అడిగాడు శరత్.

'నేను కాదు హబీబ్ కాల్చాడు'.

'మరి తుపాకీ తెచ్చి హబీబ్ ఇంట్లో దాచింది ఎవరు?' అడిగాడు శరత్.

'పథకం అంతా హబీబ్‌దే. తుపాకీతో బెదిరించి అమ్మాయిని అనుభవిద్దాం. ఎవ్వరూ కిక్కురుమనరు అన్నాడు. ఆరోజు మేం ఎదురు చూస్తుంటే ఈ కారు వచ్చింది. వాళ్లిద్దరూ రొమాన్స్ ఆరంభించగానే తలుపు తట్టాం. అయితే విశ్వేశ్వరరావు తుపాకీ తీసి హబీబ్‌ని కాల్చాడు. భయంతో నేనూ అతడిపై కాల్చాను. కారు స్టార్ట్ చేసి వెళ్లిపోయాడు. గురితప్పిందనుకుని నేను ఇంటికి వచ్చేశాను. ఏమీ కాలేదనుకున్నాను. కానీ ఇదంతా హబీబ్ పథకమే. నేను వెంట వెళ్ళానంతే'.

శరత్ ఫోనుమోగింది. "బాస్ విశ్వేశ్వరరావు చచ్చిపోయాడు' చెప్పారు.

'సరే, కారులో విశ్వేశ్వరరావు పక్కనున్న అమ్మాయిని నువ్వు చూశావా?' 'సరిగ్గా కనబడలేదు. నేను కావాలని నేరం చెయ్యలేదు..' ఏడవటం ఆరంభించాడు ఈశ్వర్.

●●●

కేసు పరిష్కారమైంది కానీ బాస్.. ఆ రోజు కారులో విశ్వేశ్వరరావుతో ఉన్న అమ్మాయి ఎవరో తెలియటం లేదు' అన్నాడు రాము.

శరత్ మాట్లాడలేదు. విశ్వేశ్వరరావు మరణవార్త తెలిసిన గంటలోగా అతడి సెక్రటరీ ఆత్మహత్య చేసుకుందన్న వార్తను రాముకు చెప్పలేదు.

**-కస్తూరి మురళీకృష్ణ**
**సెల్: 98496 17392**



**చుట్టూ అంతా చీకటిగా ఉంది. రోడ్డుమీద వాహనాలు అప్పుడప్పుడూ ఒకటీ అరా వెళ్తున్నాయి. బ్యాగ్ తీసి అందులో నుంచి నేవీ బ్లూ కలర్ డ్రస్ తీసి వేసుకున్నాడు. బ్యాగ్ సర్దుకుని భుజానికి తగిలించుకుని సమయం చూశాడు. రాత్రి తొమ్మిది కావస్తోంది.**

**మెల్లగా కొండ దిగడం ప్రారంభించాడు. దిగి బస్టాప్ వరకూ వెళ్ళి అక్కణ్ణుంచి హవేలీ వైపు అడ్డదారిలో బయలుదేరాడు. తనవద్ద ఉన్న సెల్‌టార్చ్ అప్పుడప్పుడూ ఉపయోగిస్తూ దారి చూసుకుంటూ ముందుకు అడుగులేశాడు. హవేలీ పరిసరాలకు చేరుకునే సరికి సమయం తొమ్మిదిన్నర. బాగా వెన్నెలగా ఉంది.**

వెన్నెల్లో నేల మీద పచ్చిక కాస్త స్పష్టంగానే కనిపిస్తోంది. పచ్చికతో బాటు రాళ్ళురప్పలు కూడా ఉన్నాయి. కొంతదూరం వెళ్ళేసరికి మామిడి తోపు మొదలైంది. తోపు లోపలినుంచి నడక ప్రారంభించాడు. కొంతదూరం వెళ్ళాక సుమారు వంద అడుగుల దూరంలో ఏదో కాలిబాటలా కనిపించింది. మెల్లగా అక్కడికి చేరుకున్నాడు.

అది ఒక జంక్షన్‌లా ఉంది. కాలిబాట ఒక వైపు హవేలీకి మరోవైపు గ్రామంలోనికి వెళ్తుంది. మూడోవైపు కొండమీదికి వెళ్తుంది. బహుశా టూరిస్టు బస్సులు ఆ దారి గుండానే ఆ జంక్షన్ వరకూ వస్తాయేమో అనిపించింది. హవేలీవైపు వెళ్ళే బాట కాస్త వెడల్పుగా, వాహనాలు కూడా పోయేందుకు అనువుగా ఉంది.

కాలిబాట ఇంచుమించు మట్టిరోడ్డులా ఉంది కానీ మట్టిరోడ్డు కాదు. ఎడ్లబండ్లు నడిచినట్టు ఉంటుంది. విరగ కాచిన వెన్నెల్లో దారి మరింత స్పష్టంగా కనిపించింది.

విష్ణు ఆ కాలిబాటలో హవేలీవైపు అడుగులు వేశాడు. అప్పుడు గమనించాడతను ఒక వింత! అదే ఆ బాటలోని టైర్ గుర్తులు! బహుశా ఏ టాటాసుమో, స్కార్పియో లేక క్వాలిస్ టైరు గుర్తుల్లా ఉన్నాయి. అవి కూడా చాలా తాజాగా కనిపిస్తున్నాయి. ఆశ్చర్యంతో వాటినే అనుసరిస్తూ ముందుకు సాగాడు. ఐదు నిమిషాల నడక అనంతరం అవి నేరుగా వెళ్ళి హవేలీ ప్రహరీ ద్వారానికి సుమారు వంద అడుగుల దూరంలో ఆగిపోయాయి. ఆ తరువాత గేటువరకూ తారు రోడ్డు కనిపించింది. గేటు వద్దకు చేరుకున్నాడు విష్ణు. హవేలీ ఇనుపగేటు దాదాపు పన్నెండు అడుగుల ఎత్తులో ఉంది. ఈ మధ్యకాలంలో తీసినట్టు లేదు. అందువల్ల గేటు చుట్టూ పిచ్చి మొక్కలు ఏపుగా పెరిగి ఉన్నాయి. ప్రహరీ గోడను ఆనుకుని ఒక పెద్ద వేపచెట్టు, ఒక మామిడిచెట్టు ఉన్నాయి. నిజంగానే అక్కడ జన సంచారం ఉన్నట్టు అనిపించలేదు. కానీ గోపాల రావు చెప్పిన ప్రకారం దాదాపు ఏడాదిగా ఈ భవంతి పరిసరాల్లో జనసంచారం లేదంటే, మరి ఈ టైర్ గుర్తులెక్కడివి?

ఆలోచిస్తూ మెల్లగా గేటు వద్దకు చేరుకుని నిశితంగా పరిశీలించాడు. లోపలికి వెళ్ళడానికి అదొక్కటే మార్గం. అది తాళం వేసి ఉంది. ఇక గేటెక్కి దూకితేనే లోపలికి వెళ్ళగలమనుకుని దానికే సిద్ధమయ్యాడు. అంతలో దూరంగా ఏదో అలికిడైంది.

ఒక్కసారిగా అతనిలో భయం ఆవహించుకుంది. తానెవరి కంటైనా పడితే తనకన్నా ముందు గోపాలరావు, రాధలకు ఇబ్బంది. అది తలుచుకుని వెంటనే పక్కనే ఉన్న పెద్ద మామిడిచెట్టు చాటుకు పిల్లిమొగ్గ వేశాడు విష్ణు. ఆ వెంటనే సమయం చూశాడు. రాత్రి పది గంటలు దాటింది.

సుమారు పది నిమిషాల వరకూ అక్కడే చెట్టుచాటున నక్కి కూర్చున్నాడు. వెన్నులో సన్నగా వణుకు ప్రారంభమైంది. తాను విన్న అలికిడికి సంబంధించి ఏదైనా జరుగుతుందేమో అనుకుంటే ఆ ప్రదేశమంతా ప్రశాంతంగా నిశ్శబ్దంగా అయిపోయింది.

ఎవరో వస్తున్నారనుకుంటే ఎవరూ రాలేదే అనుకుంటూ చెట్టుచాటు నుంచి మెల్లగా బయటికి వచ్చి ప్రహరీగేటును సమీపించాడు. ఎక్కి దూకాలని ఇదివరకే నిర్ణయించుకున్నందువల్ల దానికి సిద్ధమై గేటెక్కాడు. సగం ఎక్కేలోపే మళ్ళీ

# హవేలీ




-ఎస్. ఘటికాచలరావు సెల్:90031 41474



ఏదో అలికిడి! ఈసారి మరింత స్పష్టంగా, మరింత దగ్గరగా! దాదాపుగా ప్రహరీగేటుపైకి పూర్తిగా ఎక్కేసిన అతను ఒక్కసారిగా పదడుగుల ఎత్తు నుంచి కిందికి దూకి మళ్ళీ అదేచెట్టు చాటుకు పిల్లిమొగ్గ వేశాడు.

ఐదు నిమిషాల తరువాత కొద్దిదూరంలో రెండు మానవాకారాలు అటువైపుగా వస్తూ కనిపించాయి. విష్ణుకు కొద్దిగా గగుర్పాటు కలిగింది.

ఆ రెండు మానవాకారాలు సరాసరి గేటు వద్దకు వచ్చి నిలిచాయి. అందులో ఒక ఆకారం గేటుపక్కనే ఉన్న చెత్త చెదారాలను, ముళ్ళపొదను చేత్తో తొలగించింది. మరో ఆకారం బహుశా అక్కడ నేలమీద శుభ్రం చేస్తున్నట్టుంది. దూరంగా ఉన్న విష్ణుకు ఆ ఆకారాలు ఏం చేస్తున్నాయో సరిగ్గా కనిపించడం లేదు. మరి కాసేపటికి ఆ రెండు ఆకారాలూ గేటుపక్కన భూమిలోనికి ఇంకిపోయాయి. కళ్ళు నులుముకుని చూశాడు విష్ణు. ఆకారాలు కనబడలేదు. చూస్తే ముళ్ళపొద యథాస్థానంలో ఉంది.

ఏదో పాతకాలం నాటి విఠలాచార్య సినిమా చూస్తున్న అనుభూతి కలిగింది విష్ణుకు. చెట్టు చాటు నుంచి బయటికి వచ్చిన విష్ణు వేగంగా గేటువద్దకు వచ్చాడు.

ఆ ఆకారాలు తొలగించిన ముళ్ళపొదను జాగ్రత్తగా పరికించి చూశాడు. ఏమీ కనబడలేదు. ఆ ఆకారాలు భూమిలోనికి ఎలా ఇంకిపోయాయి. అంటే అక్కడేదైనా సొరంగ మార్గం ఉందా? ఆలోచించుకోడానికి సమయం లేదు అనుకుని వెంటనే గేటు ఎక్కి లోపలికి మెల్లగా దిగాడు. అక్కణ్ణుంచి హవేలీ ముఖద్వారానికి సుమారు వంద అడుగుల దూరం ఉంటుంది. మెల్లగా అడుగులో అడుగేస్తూ అటువైపు నడక సాగించాడు విష్ణు.

సరిగ్గా సగం దూరంలోకి రాగానే హఠాత్తుగా మళ్ళీ తనకు కొద్ది దూరంలో భూమిలోనుంచి ఆ రెండు ఆకారాలు పైకి వచ్చాయి. ఉలిక్కిపడ్డ విష్ణుకు దాక్కునేందుకు స్థలం కనబడలేదు. వెంటనే చప్పున నేలపై బోర్లా పడుకున్నాడు. అక్కడ

### జరిగిన కథ

*అరకులోయ మార్గంలో ఉన్న కుగ్రామానికి వెళ్ళే తోవలోనే ఉంది పాడుబడిన హవేలీ. ప్రశాంత వాతావరణంలో చదువుకుని ఐపీఎస్ పరీక్షకు సిద్ధమయ్యేందుకు ఆ ఊరికొస్తాడు విష్ణు. హవేలీ పూర్వకథ తెలుసుకుంటాడు. రాజా విజయేంద్రవర్మ, అతడి నమ్మినబంటు, అతడి కూతురు, రాజావారి కుమారుడు.. ఇలా ఒకరి తరువాత ఒకరు ఆ ప్యాలెస్ నుండి అదృశ్యమైపోతారు. ఆ పాడుబడిన ప్యాలెస్ నుండి అర్ధరాత్రిళ్ళు ఆర్తనాదాలు వినిపిస్తూ ఉంటాయి. ఆ మిస్టరీని కనిపెట్టాలని నిర్ణయించుకుంటాడు విష్ణు. సొంత ఊరికి వెళుతున్నట్టు అబద్ధం చెప్పి తనకు ఆశ్రయం ఇచ్చిన ఎస్సై ఇంట్లోంచి చీకటి వేళ హవేలీ వైపు బయలుదేరతాడు.*

*ఆ తర్వాత.....*

ఉన్న తారురోడ్డు. అతని డ్రస్ నేవీబ్లూ రంగు. దాంతో అతను అక్కడున్నట్టు కనబడలేదు.

ఆ రెండు ఆకారాలూ మెల్లగా ముఖద్వారం తెరుచుకుని లోపలికి ప్రవేశించాయి. వాళ్ళు ప్రవేశించిన ఐదు నిమిషాలకు అతను కూడా ముఖద్వారం వద్దకు చేరుకున్నాడు. మెల్లగా ముఖద్వారాన్ని తోశాడు. తెరుచుకోలేదు. లోపలివైపు నుంచి గడియపెట్టి ఉంది.

మారు ఆలోచన లేకుండా వెంటనే పక్కకు వెళ్ళి పక్కనే ఉన్న పైప్ పట్టుకుని హవేలీ పైకి ఎగబాకాడు. మేడమీదికి వెళ్ళి అక్కడున్న గవాక్షాల ద్వారా లోపలికి చూశాడు. అంతా చీకటిగా ఉండడం వల్ల ఏమీ కనబడటం లేదు. పోనీ లోపలికి ప్రవేశించడానికి వేరే మార్గాలుంటాయేమోనని అక్కడంతా చూసి నిరాశచెందాడు. మేడ మొత్తం తిరిగి అక్కడున్న గవాక్షాల ద్వారా కింద ఏ ఏ గదులున్నాయో చూశాడు.

ఎక్కడా వెలుతురులేని కారణాన లోపల ఏమున్నాయో అస్సలు కనబడలేదు. మొత్తం దాదాపుగా ఇరవై గవాక్షాల ద్వారా చూశాడు.

అలా చూస్తూ పోగా హఠాత్తుగా ఒక గదిలో కొద్దిగా వెలుగు కనిపించింది. అది కొవ్వొత్తి వెలుగు! ఆశ్చర్యపోయాడు. హవేలీలోకి ప్రవేశించిన ఆ రెండు ఆకారాలూ అక్కడున్నాయి. అంతకన్నా ఆశ్చర్యం కలిగించే విషయం అక్కడ మరో ఆకారం కూడా కనిపించింది. అక్కడే కూర్చుని గవాక్షం ద్వారా వాళ్ళేం చేస్తున్నారో గమనించాడు.

కళ్ళకు గంతలు కట్టబడి ఉన్నాయి. ఇద్దరూ కలిసి తాము తెచ్చిన మనిషిని ఇదివరకే కట్టేసి ఉన్న మనిషి ఎదురుగా నిలబెట్టారు.

అక్కడ జరుగుతున్నదంతా ఏదో ఒక సినిమా చూస్తున్న అనుభూతి కలుగుతోంది విష్ణుకు.

**ధైర్యం సడలిపోకుండా పైపులైను పట్టుకుని పైకెగబాకి మహలులోకి ప్రవేశించాడా యువకుడు. లోపల చిమ్మచీకటి. ఒక్కొక్క గదీ వెతుకుతూ వెళుతున్న యువకుడికి ఒక గదిలో దూరంగా వెలుగు కనిపించింది! దిగ్భ్రాంతికి గురయ్యాడతను. మహలులోకి ప్రవేశించేముందు అతడికి గగుర్పాటు కలిగించిన దృశ్యం ఆ క్షణంలో గుర్తొచ్చిందతనికి. అంతలోనే దూరంగా ఏవో ఆకారాలు కనిపించాయి! ఏమిటా ఆకారాలు? మనుషులా? దయ్యాలా?**

మూడో ఆకారం స్తంభానికి కట్టేయబడి ఉంది. ఎవర్నో అలా కట్టి పడేసినట్టున్నారు. వాళ్ళిద్దరూ ఆడా మగా అన్న విషయం మాత్రం స్పష్టం కాలేదు. నీడలను, శరీర ఆకృతిని బట్టి చూస్తే ఒకటి ఆడగానూ మరొకటి మగగానూ అనిపించింది. కట్టేయబడ్డ ఆకారం మాత్రం మగ మనిషి లాగే ఉన్నాడు. నేలమీదే కూర్చుని ఉన్నాడతను. ఆ రెండు ఆకారాల్లో ఒక ఆకారం తన వెంట తెచ్చిన క్యారియర్ విప్పి స్తంభానికి కట్టేసిన ఆకారం ముందుంచింది.

అంతా మసకగానే ఉంది. ఏదీ స్పష్టంగా కానరావడం లేదు. మసక వెలుతురులోనే ఆ ఆకారాలను గుర్తించేందుకు ప్రయత్నించాడు. అయినా తన ఊహను దాటి ముందుకు వెళ్ళలేకపోయాడు. ఒక ఆడ, ఒక మగ ఆకారాలులాగే అనిపించాయి. ప్రస్తుతానికి అలాగే నిర్ణయించుకుని అక్కడేం జరుగుతోందో గమనించడంలో నిమగ్నమయ్యాడు.

అందులో ఒక ఆకారం తుపాకీని ఆ కట్టిపడేసినవాడి కణతకు గురిపెట్టి, “ఊ తిను” అంటూ బలంగా నొక్కింది. మెల్లగా మాట వినబడడం వల్ల ఆకారం మగ అన్నది ప్రస్తుతానికి స్పష్టమైంది. స్తంభానికి కట్టేయబడ్డ మనిషి గబగబా తన ముందున్న కంచంలోని అన్నం పూర్తిగా తినేశాడు. తిని ముగించేలోపు అక్కణ్ణుంచి ఆ మగ ఆకారం గది బయటికి వెళ్ళి భుజం మీద ఏదో ఒక మూటను తెచ్చి అతని ముందు పడేసింది. మూట విప్పితే అందులో కూడా ఎవరో మరో మనిషి ఉన్నట్టు అర్థమైంది.

నిజమే. అది కూడా మరో మనిషి! కొవ్వొత్తి కాంతిలో ఆ మనిషి ఆకారం మసగ్గా కనిపించింది. ఆ వ్యక్తి

అతను వెంటనే తన జేబులో నుంచి సెల్‌ఫోన్ తీసి ఏవో నంబర్లు చకచకా నొక్కాడు. తరువాత కాసేపటికి ‘ఓకే’ బటన్ నొక్కి జేబులో ఉంచుకున్నాడు.

జేబులో నుంచి హ్యాండ్ ఫ్రీసెట్ తీసి చెవిలో ఉంచుకున్నాడు. ఏవో మాటలు వినబడసాగాయి. అయితే మాటల్లో కూడా ఏమీ స్పష్టత లేదు.

మరికాసేపటికి ఇదివరకే స్తంభానికి కట్టేయబడి ఉన్నతని కళ్ళకు కూడా గంతలుకట్టి, నోట్లో గుడ్డలుకుక్కి అతని చేతిలో సైలెన్సర్ అమర్చిన రివాల్వర్ ఉంచి అప్పుడే తెచ్చిన వ్యక్తిని పాయింట్ బ్లాంక్ రేంజ్‌లో నిలబెట్టి “ఊ, కాల్చు” అన్నాడు.

తల అడ్డంగా ఊపాడా వ్యక్తి. వెంటనే మగ ఆకారం తన చేతిలోని కత్తిని అతని భుజం మీద గుచ్చింది. విపరీతమైన బాధ కలిగినా నోటిలో గుడ్డలుకుక్కి ఉన్నందువల్ల గట్టిగా అరవలేక విలవిలలాడాడు ఆ వ్యక్తి.

వాళ్ళ మాటలు అస్పష్టంగానే వినబడుతున్నాయి. “ఎలాగూ నా చేతిలో నీ చావు తప్పదు. కానీ ముందుగా నీ స్నేహితులందరి చావు నీ చేతిలోనే. అంతటి పవిత్రమైన స్నేహం మీది. అప్పటివరకూ నువ్వు బతికే ఉండాలి. ఆ తరువాతే నీవంతు వస్తుంది. ఊ, కాల్చు” అంటూ అరవడం వినిపించింది. ఈసారి కత్తి అతని కాలిలో దిగబడింది.

మరుక్షణం స్తంభానికి కట్టిపడేసినవాడి చేతిలో తుపాకి నిశ్శబ్దంగా బుల్లెట్ కక్కింది. అతనికి



## రష్మి పెంచేసింది

చిట్టిపొట్టి డ్రస్సులతో బుల్లితెరకు గ్లామర్ సొగసులద్దిన రష్మి అదే సంప్రదాయాన్ని వెండితెర మీద కొనసాగిస్తోంది. శక్తిమేర ఎక్స్‌పోజింగ్ చేసి సినిమాకు లాభాల పంట పండిస్తోంది. ఏ మాత్రం అంచనాల్లేని ‘అంతం’ సినిమాకు వస్తున్న కలెక్షన్లు రష్మి పుణ్యమే అన్న సంగతి అందరూ అంగీకరిస్తున్నారు. దీంతో రష్మికి తన అందచందాల మీద నమ్మకం బాగా పెరిగిపోయింది. దాంతోపాటే రెమ్యునరేషన్ కూడా పెంచేసిందట! గతంలో ఇచ్చిన దానికన్నా రెట్టింపు డిమాండ్ చేస్తోందని టాలీవుడ్ జనాలు అంటున్నారు. దాంతో ఇప్పుడు ఆమెతో సినిమా చేయాలనుకున్న దర్శకనిర్మాతలు వెనకడుగు వేస్తున్నారన్నది తాజా సమాచారం.

ఎదురుగా నిలబడి ఉన్న వ్యక్తి తలవాల్చేశాడు. ఆ తతంగమంతా ముగిసేవరకూ అక్కడే కూర్చొని మళ్ళీ సెల్ తీసి 'స్టాప్' బటన్ నొక్కేసి అక్కణ్ణుంచి లేచాడు.

మేడ మొత్తానికి నైరుతిమూలలో రెండో అంతస్తు ఉంది. మసకచీకట్లో అప్పుడు చూశాడ తను అక్కడ ఒక చిన్నద్వారం, కొద్దిగా తెరిచి ఉన్నట్టు కనిపించింది.

దగ్గరకెళ్ళి కొద్దిగా తోయగానే మెల్లగా తెరుచుకుంది. చేతిలోని సెల్‌టార్చ్ ఒకసారి చిన్నగా ఫ్లాష్ చేశాడు. అక్కడ మెట్లు చూసి ఆశ్చర్యపోయాడతను.

'అంటే ఆ ద్వారం దాదాపుగా సంవత్సరం నుంచీ తెరిచే ఉందన్నమాట' అనుకుంటూ పర్యవసానాలకు వెరవకుండా అడుగు ముందుకేసి లోపలికి ప్రవేశించాడు. మెల్లగా తడుముకుంటూ మెట్లు దిగి ఒక గదిలోకి చేరుకున్నాడు. తను మానవాకారాలను చూసిన గది ఎక్కడుందో చూచాయగా ఊహించుకుంటూ ఆ దిక్కుగా కదిలాడు.

సరిగ్గా పాతిక అడుగులు వేయగానే సన్నని వెలుగురేఖ కనబడింది. ఠక్కున ఆగి మెల్లగా నేలమీద పడుకుని, పాకుతూ ఆ దిక్కుగా ముందుకు జరిగాడు విష్ణు. తాను చూసిన వెలుగురేఖ వాళ్ళ చేతిలో ఉన్న కొవ్వొత్తిగా గ్రహించాడు.

తమమధ్య దూరం చాలా ఎక్కువగా ఉన్నందు వల్ల ముఖాలు స్పష్టంగా కనబడక విష్ణు తీవ్ర అసహనానికి గురయ్యాడు. ఎలాగైనా వాళ్ళ ముఖాలు కనిపెట్టాలనుకుంటే కుదిరేట్టు లేదు. ఏం చెయ్యాలి? అంటూ మథనపడిపోయాడు.

ఆ ఇద్దరూ ఆడ మగ అన్న విషయం స్పష్టమైనా, పూర్తిగా వాళ్ళ ముఖాలు గుర్తించలేకపోతున్నాడు.

కాసేపటికి ఆ ఇద్దరు మనుషులు గదినుంచి బయటికి వచ్చారు. అప్పటికి విష్ణు సందేహం తీరింది. వాళ్ళిద్దరిలోనూ ఒకరు ఆడ, మరొకరు మగ అని రుజువైంది. ఆడ ఆకారం చేతిలో కొవ్వొత్తి ఉంది.

హఠాత్తుగా భీకరంగా అరుపు వినిపించింది. ఉలిక్కిపడ్డాడు విష్ణు. ఆ అరుపు ఏ దిక్కునుంచి వచ్చిందో అర్థం కాలేదు. కనిపించే దూరంలోనే వాళ్ళిద్దరూ ఉన్నారు. మరి ఆ అరిచిందెవరు? అనేక ప్రశ్నలకు బదులు దొరకలేదు. ఆలోచనలు మాని, ముందుగా వాళ్ళిద్దరినీ ఫాలో అయితే అన్ని ప్రశ్నలకూ సమాధానం తెలుస్తుంది అనుకుని అడుగు ముందుకు వేశాడు విష్ణు.

కొవ్వొత్తి వెలుగులో ఆ వ్యక్తుల ముఖాలు కూడా కనిపిస్తాయేమోనని చూశాడు. తను ఊహించింది నిజమే. ఆ మరొక వ్యక్తి వయసు మళ్ళిన వాడిలా ఉన్నాడు.

వెంటనే తన బ్యాగ్‌లో నుంచి కెమెరా తీసి సాధ్యమైనంతగా జూమ్‌చేసి క్లిక్‌మనిపించాడు విష్ణు. అంతలోనే ఉలిక్కిపడ్డాడు. అప్పటికే ఆలస్యం అయిపోయింది.

కెమెరా క్లిక్‌మన్న శబ్దం చేసింది. అదేసమయంలో బయట చెట్టుమీదనున్న గబ్బిలాలు ఒక్కసారిగా కీచుమని అరుస్తూ ఎగరడంతో ఆ అరుపులో కెమెరా క్లిక్‌శబ్దం కలిసిపోయింది. తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు విష్ణు.

కానీ ఆ తీసిన ఫోటో తాననుకున్నంత స్పష్టంగా రాలేదు. ముఖాలు ఏ మాత్రం గుర్తుపట్టే విధంగా లేవు. ఫ్లాష్ ఉపయోగించే పరిస్థితిలో తను లేడు. అక్కడున్న మసక వెలుతురులో అంతకన్నా స్పష్టత ఆశించడం సబబు కాదనిపించింది.

గది బయటికి వచ్చిన ఆ ఇద్దరూ మళ్ళీ ముఖద్వారం వద్దకు వెళ్ళసాగారు.

పిల్లిలా అడుగులు వేస్తూ మెల్లగా అంతక్రితం వాళ్ళున్న గది వద్దకు వచ్చాడు. గదిలోనికి తొంగిచూస్తే అక్కడ స్తంభానికి కట్టేసిన వ్యక్తి తలవాల్చేసి ఉన్నాడు. అతని ఎదురుగా మరొక వ్యక్తి నేలమీద పడిపోయి ఉన్నాడు.

వాళ్ళముందున్న కొవ్వొత్తి అదే క్షణంలో ఆరిపోయింది. ఆ చీకట్లోనే కాస్త బాగా పరికించి చూస్తే అక్కడ నేలమీద కొవ్వొత్తుల మరకలు

## మనమీదేనట్రోయ్!

సరసి





చాలానే కనిపించాయి.

కొద్ది క్షణాలు ఏం చెయ్యాలో తోచలేదు. వాళ్ళను అనుసరించాలా, ఈ ఇద్దరి గురించిన సమాచారం సేకరించాలా అన్న విషయమై మనసులో తర్జనభర్జన జరిగింది.

వెంటనే వాళ్ళిద్దరినీ ఫాలో అవడమే సబబనిపించి తన పరిశోధన అక్కడికి ఆపి, వెళ్ళిపోతున్న వాళ్ళిద్దరి వెనకే తగినంత దూరం మెయిన్‌టెయిన్ చేస్తూ వేగంగా అడుగులు వేశాడు.

అంతలోనే ముఖద్వారం తెరుచుకుని ఆ ఇద్దరూ బయటికి వెళ్ళిపోయారు. ఒక్క నిమిషం తరువాత తలుపువద్దకు చేరుకొని లాగిచూస్తే బయట గడియపెట్టి ఉంది. నిరాశచెందిన అతను క్షణకాలం కంటే ఎక్కువ ఆలోచించకుండా వేగంగా మళ్ళీ తను వచ్చిన దారినే మేడమీదికి వెళ్ళి అక్కణ్ణుంచి పైప్ ద్వారా కిందికి దిగాడు.

అప్పటికే వాళ్ళిద్దరూ ఆ పరిసరాల్లో కనబడలేదు. నిస్పృహతో గేటు వద్దకు వచ్చాడు. అంతలో గేటు పక్కన అలికిడైంది. చప్పున నేలపై బోర్లా పడుకున్నాడు విష్ణు.

హఠాత్తుగా ప్రహరీగేటు భూమిలో నుంచి




వాళ్ళిద్దరూ బయటికి వచ్చారు. నేలమీద పడుకునే వాళ్ళిద్దరినీ గమనించసాగాడు విష్ణు. వాళ్ళు సుమారు యాభై అడుగులు వెళ్ళాక లేచి నిలబడ్డాడు. అప్పటికే వాళ్ళు చాలాదూరంగా వెళ్ళిపోయారు. అయితే వాళ్ళు గ్రామం వైపు కాక కొండవైపు వెళ్ళడం గమనించాడు. అతని మెదడులో ఏదో లాజిక్ దెబ్బతిన్నది. కాసేపాగి మళ్ళీ గేటెక్కి దిగి సాధ్యమైనంత వేగంగా వాళ్ళను వెంబడించాడు. అప్పటికే ఆ పరిసరాల్లో ఎక్కడా వాళ్ళు కనబడలేదు. అప్పుడు సమయం అర్ధరాత్రి పన్నెండు గంటలు.

ఇంతరాత్రివేళ ఎక్కడికెళ్ళాలో తెలియలేదు. కాస్త నిస్సత్తువగా అనిపించింది. మళ్ళీ గేటు వద్దకు వచ్చాడు. గేటు పక్కన ఉన్న పొద దగ్గరికి వచ్చి, అక్కడున్న ఆకులు, గడ్డి కాస్త మేరకు చదునుగా చేశాడు. తన వద్ద ఉన్న సెల్ టార్చ్‌తో అక్కడ లైట్ వేసి చూశాడు. ప్రహరీగేటు స్తంభం పక్కనే నేలకు కొద్దిగాపైన చిన్నమీట ఒకటి కనిపించింది. ఆశ్చర్యంతో దాన్ని మెల్లగా నొక్కాడు.

వెంటనే నిశ్శబ్దంగా నేల పక్కకు జరిగినట్టనిపించింది.

అక్కడ అదొక సొరంగ మార్గం! లోపల మెట్లున్నాయి. అంతకంతకూ ఆశ్చర్యం అధికమవుతుండగా మెల్లగా వాటిమీదుగా కిందికి దిగాడు. కొంతదూరం వెళ్ళాక మెట్లు ముగిసి నేల చదునుగా కనిపించింది. కాస్త దూరంలో మళ్ళీ పైకెక్కేందుకు మెట్లు కనిపించాయి. ఎక్కి పైకివెళ్తే అక్కడ మరొక మీట కనిపించింది. దాన్ని నొక్కగానే అక్కడున్న పలక పక్కకు జరిగింది. పైకి వచ్చాడు.

వెనక్కు తిరిగి చూస్తే సుమారు యాభై అడుగుల దూరంలో ప్రహరీ ద్వారం కనిపించింది. ఆశ్చర్యం మనసులోనే దాచుకుని ముందుకు నడిచాడు.

ఈసారి ముఖద్వారం వద్దకు వెళ్ళి తలుపు మెల్లగా తీసి లోపలికి ప్రవేశించాడు. అంతలోనే అతనికి గదిలో స్తంభానికి కట్టిపడేసిన మనిషి గుర్తుకొచ్చాడు. కనీసం వాణ్ణయినా పలకరిస్తే ఏదైనా సమాచారం దొరుకుతుందని నేరుగా ఆ గదికి వెళ్ళాడు.

ఆశ్చర్యంగా అక్కడ స్తంభానికి కట్టిపడేసిన మనిషి ఇప్పుడు లేడు. అంతేకాక అతను తుపాకితో కాల్చిన మరొక వ్యక్తి కూడా అక్కడ లేడు. కట్టిపడేసినవాడు, చంపబడ్డవాడు అక్కడ లేకుండాపోవడానికి ఆస్కారమే లేదు. మరైతే ఎక్కడికెళ్ళినట్టు? నేలమీద మాత్రం రక్తపుమరకలు ఇంకా తడి ఆరకుండా అలాగే ఉన్నాయి. పైగా టార్చ్ వెలుతురులో ఎవరో ఆ ఇద్దరినీ లాక్కుంటూ వెళ్ళిన ఆనవాళ్ళు కనిపిస్తున్నాయి. అంటే బయటికి వెళ్ళినట్టు కనిపించింది ఆ ఇద్దరూ కాదా? వేరే ఎవరైనా ఇక్కడున్నారా? లేక ఆ ఇద్దరే బైటికి వెళ్ళినట్టే వెళ్ళి మళ్ళీ లోపలికి వచ్చారా? ఒకవేళ వాళ్ళు తనను గమనించారా? గమనిస్తే వెంటనే దాడిచేయకుండా ఏమీ ఎరగనట్టుగా ఎందుకున్నారు? ప్రతి విషయమూ నర్మగర్భంగానూ, విచిత్రంగానూ, ఆశ్చర్యకరంగానూ అనిపించింది.

అప్పటివరకూ అతని మనసులో గూడుకట్టుకున్న నిస్తేజం, అలసట ఒక్కసారిగా పటాపంచలయ్యాయి. ఒక్కసారి తల గట్టిగా విదిలించాడు.

ఇక అప్పటినుంచి ఉదయం సుమారు ఐదు గంటల వరకూ తనవద్ద ఉన్న పెన్‌టార్చ్ సహాయంతోనే ఆ హవేలీలోని ప్రతి అంగుళాన్ని పట్టిపట్టి చూశాడు విష్ణు.

దాదాపు పాతికవరకూ ఉన్నాయి గదులు. కొన్ని గదులు తాళం వేసి ఉన్నాయి. మరికొన్ని తెరిచే ఉన్నాయి. పెన్‌టార్చ్ వెలుతురులో ఏవీ సరిగ్గా కనబడ్డం లేదు. సెల్‌టార్చ్ ఎక్కువసేపు ఉపయోగిస్తే మళ్ళీ ఫోన్ చెయ్యడానికి బ్యాటరీ ఉండదన్న కారణాన దాన్ని మితంగానే ఉపయోగించాల్సి వచ్చింది. దానికిబదులుగానే తనవద్ద ఉన్న పెన్‌టార్చ్ ఉపయోగించుకున్నాడు. ఎంత చూసినా, ఎంత వెదికినా అంతక్రితం అక్కడున్న ఆ ఇద్దరిజాడ మాత్రం తెలియలేదు. దాని వెనుక మర్మమూ తెలియరాలేదు.

ఉదయం ఐదుగంటల తరువాత, ఇక తెల్లవారుతుందనగా, కాస్త చీకటి ఉండగానే మళ్ళీ సొరంగమార్గం ద్వారానే బయటికి వచ్చి వేగంగా కొండవైపు వెళ్ళిపోయాడు.

రాత్రంతా నిద్రలేమి వల్ల శరీరమంతా అదోలా ఉంది. ఒళ్ళు తూలుతూ ఉంది. కాసేపు నడుం వాల్చితే బాగుంటుందన్న ఆలోచన ఉంది. దానికి అనువైన స్థలం మాత్రం లేదు. ఊరినుంచి ఫోన్ వచ్చిందనిచెప్పి బయటపడ్డ తను ఈ పరిస్థితిలో మళ్ళీ వెంటనే గ్రామంలో వాళ్ళ ఇంటికి వెళ్ళలేడు.

మనసులో హవేలీలో చూసిన సంఘటనల తాలూకు అనేక ఆలోచనలు ముసురుతుండగా కొండమీది పాకలో టీ తాగి సరిగ్గా ఆరు గంటలకు అరకువెళ్ళే బస్సెక్కి ముందుకు సాగిపోయాడు విష్ణు.

•••

అరకులో ఒక చిన్న పార్కులాంటి ప్రదేశం. అక్కడ పిట్టగోడ మీద ముగ్గురున్నారు.

"హలో!..."

అవతలివైపు నుంచి ఏ విధమైన సమాధానమూ లేదు.

"హలో, హలో" అంటూ రెట్టించాడు ఫోన్ వంక అసహనంగా చూస్తూ.

"పది గంటలకు ఇక్కడికి వచ్చెయ్" అన్న మాటలు వినవచ్చి ఫోన్ కట్ అయ్యింది.

ఫోన్ వంక ఉత్సాహంగా చూశాడతను. అతను రాఘవ. గ్రానైట్ క్వారీ యజమాని దివాకర్‌రెడ్డి కొడుకు. అతని పక్కనున్న మిగతా ఇద్దరూ ఏమిటని కళ్ళెగరేశారు.

"బకరాగాడు రమ్మంటున్నాడు. సరుకు రెడీ అట" అన్నాడు విలాసంగా నవ్వుతూ.

మిగతా ఇద్దరు కూడా ఆ నవ్వుకు శ్రుతి కలిపారు.

"మరో గంటలో బయలుదేరాలి. సోంబాబును బండి సిద్ధం చెయ్యమని చెప్పరా" అని పార్కు పిట్టగోడ మీది నుంచి కిందికి దూకాడు రాఘవ.

అతని స్నేహితులిద్దరూ లోకేశ్, త్రిలోక్ తలూపి అక్కణ్ణుంచి వెళ్ళిపోయారు.

**(ఇంకావుంది)**

# వంటలు

## స్పైసీ తందూరి గోబీ



**కావలసిన పదార్థాలు:** కాలీఫ్లవర్: మీడియం సైజుది, పనీర్: పావుకిలో, పెరుగు: రెండు స్పూన్లు, నూనె: తగినంత, నిమ్మ రసం: రెండు స్పూన్లు, కారం: తగినంత, ఉప్పు: రుచికి సరి పడ, అల్లం ముక్కలు: స్పూను, ఎండుద్రాక్ష: ఎనిమిది, గరం మసాలా పొడి: టేబుల్ స్పూను, దాల్చినచెక్క: చిన్న ముక్క, యాలకులు: మూడు లేక నాలుగు, లవంగాలు: మూడు, బిర్యానీ ఆకు: కొద్దిగా, కొత్తిమీర: కొద్దిగా.

**తయారీ విధానం:** మందపాటి గిన్నెలో నీరు పోసి అందులో దాల్చినచెక్క, లవంగాలు, యాలకులు, బిర్యానీ ఆకు వేసి కొద్దిగా తెర్లనిచ్చి, నీటిలోంచి తీసి పక్కన పెట్టుకోవాలి. ఇప్పుడు అదే నీటిలో కాలీఫ్లవర్‌ను కావల్సిన సైజులో ముక్కలుగా చేసుకొని ఉడికించి నీరంతా వంపేసి పక్కన పెట్టు కోవాలి. మరొక గిన్నెలో పెరుగు, నిమ్మరసం, కారం, ఉప్పు, ఎండుద్రాక్ష, గరంమసాలా కొద్దిగా నూనె పనీర్ ముక్కలు అన్నీ వేసి బాగా కలుపుకోవాలి. ఈ మిశ్రమాన్ని కొద్దిగా నాననిచ్చి అనంతరం ఉడి కించిన మసాలా దినుసులు, కాలీఫ్లవర్ ముక్కలను కూడా వేసి బాగా కలిపి కొద్దిసేపు నాన బెట్టాలి.అనంతరం బాండీలో తగినంత నూనె వేసి వేయించుకోవాలి. దించే ముందు కొత్తిమీర చల్లుకోవాలి. ●

## వెజిటబుల్ నవరతన్ కుర్మా



**కావలసిన పదార్థాలు:** బీన్స్, క్యారట్, పచ్చిబఠాణీలు, బంగాళాదుంపలు, కాలీఫ్లవర్: కప్పు చొప్పున(ఇవన్నీ ఉడి కించి నీరంతా వంపేసి పక్కన పెట్టుకోవాలి), టమోటా ముక్కలు: రెండు కప్పులు, ఉల్లిపాయ ముక్కలు: రెండు కప్పులు, ఎర్ర క్యాప్సికమ్: కప్పు, జీడిపప్పు: కప్పు, ఎండు ద్రాక్ష: అరకప్పు, కారం: తగినంత, గరంమసాలా పొడి: అర టీస్పూను, జీలకర్ర పొడి: అర టీ స్పూను, క్రీమ్: రెండు స్పూన్లు, ఉప్పు: తగినంత.

**తయారీ విధానం:** బాండీలో కొద్దిగా నూనె పోసి కొన్ని టమోటాలు, కొన్ని ఉల్లిపాయలు, జీలకర్ర, అల్లం వెల్లుల్లి పేస్ట్ వేసి వేయించుకుని వీటికి జీడిపప్పు కలిపి ముద్దగా చేసుకోవాలి. ఇప్పుడు బాండీలో నూనె వేసి అందులో మిగిలిన ఉల్లిపాయలు, టమోటా ముక్కలు వేసి బాగా వేయిం చాలి. ఇప్పుడు ఉడికించుకున్న కూరగాయల ముక్కలు, క్యాప్సికమ్, ఎండు ద్రాక్ష, కారం, ఉప్పు వేసి కొద్దిగా నీరు పోసి ఉడికించాలి. నీరు ఇంకిపోతున్న సమయంలో రెడీ చేసి పెట్టుకున్న మసాలా ముద్ద కూడా జతచేసి మరికొంతసేపు ఉడికించాలి. చివరగా కొత్తిమీరతో సర్వ్ చేయాలి. ●

## బెండి కురి కురి

**కావలసిన పదార్థాలు:**

బెండకాయలు: పావుకిలో, కారం: తగినంత, ఉప్పు: తగినంత, పసుపు: కొద్దిగా, గరం మసాలా పొడి: ఒకటిన్నర స్పూను, జీలకర్ర పొడి: పావు టీ స్పూను, చాట్ మసాలా: ఒకటిన్నర స్పూను, శనగపిండి: మూడు టేబుల్ స్పూన్లు, మొక్కజొన్న పిండి: రెండు టీ స్పూన్లు, నిమ్మరసం: టేబుల్ స్పూను, నూనె: తగినంత



**తయారీ విధానం:**

బెండకాయలను కావలసిన సైజులో తరి గిన తరువాత వాటికి ఉప్పు, కారం, పసుపు, మొక్కజొన్న పిండి, శనగపిండి, గరంమసాలా పొడి కొద్దిగా నూనె జత చేసి బాగా ముక్క లకు పట్టే విధంగా కలిపి పక్కన పెట్టుకోవాలి. ఇప్పుడు బాండీలో నూనెపోసి కొన్ని కొన్ని ముక్కల చొప్పున వేయించుకోవాలి. చివరగా నిమ్మరసం చల్లుకుంటే సరిపోతుంది. ●

## పనీర్ కోకనట్ గ్రేవీ

**కావలసిన పదార్థాలు:** పనీర్: మూడు వందల గ్రాములు, ఉల్లిపాయలు: నాలుగు (ముక్కలు చేసుకోవాలి), అల్లం ముక్కలు: టేబుల్ స్పూను, టమోటాలు: ఐదు(ముక్కలు చేసుకోవాలి), ఎండు మిర్చి: నాలుగు లేక ఐదు, జీలకర్ర: టేబుల్ స్పూను, ధనియాల పొడి: టేబుల్ స్పూను, కారం: సరిపడ, పంచదార: టేబుల్ స్పూను, వేరుశనగపప్పు(పల్లీలు): పావుకప్పు (పొడిచేసి పెట్టుకోవాలి), పాలు: కప్పు, నిమ్మరసం: టేబుల్ స్పూను, వెన్న లేదా నెయ్యి: మూడు స్పూన్లు, కొబ్బరి చిప్ప: ఒకటి.

**తయారీ విధానం:**

ఉల్లిపాయలు, టమోటా ముక్కలు కొన్ని, అల్లం వెల్లుల్లి ముద్ద వేసి మెత్తగా రుబ్బుకోవాలి. పనీర్‌ను కావలసిన సైజులో కట్ చేసుకోవాలి. వేరుశనగలు కూడా



ముద్దగా చేసి పక్కన పెట్టుకోవాలి. కొబ్బరి తురుముకుని పాలను తీసుకోవాలి. ఇప్పుడు బాండీలో నెయ్యి లేదా వెన్న వేసి కాగిన తరువాత ఎండుమిర్చి, ఉల్లిపాయ ముక్కలు, జీలకర్ర వేసి దోరగా వేయించుకోవాలి. ఇప్పుడు టమోటాలు కూడా వేసుకొని మెత్తగా ఉడికించాలి. అన్నీ ఉడికిన తరువాత కొబ్బరిపాలు, ఉప్పు, కారం, గరంమసాలా పొడి, చిటికెడు చక్కెర వేసుకోవాలి. కొద్ది సేపటి తరువాత పనీర్ ముక్కలు వేసి మరికొద్దిసేపు ఉడికించుకోవాలి. చివరగా కొత్తిమీర చల్లుకోవాలి. ●




# రామ రావణుల ప్రథమయుద్ధం

**సైన్యాధ్యక్షుడు ప్రహస్తుని మరణంతో రావణుడే యుద్ధానికి సిద్ధమయ్యాడు. ఉత్తరద్వారం నుంచి యుద్ధరంగంలోనికి ప్రవేశించాడు. రత్నకుండలాలు, ఉజ్వలకిరీటం, చంద్రుడిలాంటి ఛత్రం నీడలో వింధ్యాచలంలా దృఢంగా కనిపిస్తున్న రావణుణ్ణి చూసి ఆశ్చర్యపోయాడు రాముడు. దేవ అసురగణాల్లో ఇంతటి తేజోవంతుడు లేడు అనుకున్నాడు. సుగ్రీవ, ఋషభ, జ్యోతిర్ముఖ, గవాక్షాది వానరవీరులను కోలుకోలేకుండా కొట్టి సింహనాదం చేశాడు రావణుడు. అది చూసి, రావణుణ్ణి ఎదిరించేందుకు తనకు అవకాశం కలుగజేయమని రాముణ్ణి వేడుకున్నాడు లక్ష్మణుడు. కాదనలేదు రాముడు. వెళ్ళి రమ్మని ఆశీర్వదించాడు.**

మేఘంలా గర్జిస్తూ ముందుకు ఉరికాడు రావణుడు. వేలాదిమంది వానరులను బాణాలతోనూ, ఖడ్గంతోనూ తెగటారుస్తూ ఆనందించసాగాడు. వానరుల శిరస్సులు తెగిపడుతోంటే చూసి తట్టుకోలేకపోయాడు లక్ష్మణుడు. ఆగ్రహోదగ్రుడయ్యాడు. అన్నాడిలా.

"రావణా! అమాయకులైన వానరుల్ని చంపడం కాదు. దమ్మూ, ధైర్యం ఉంటే నన్ను ఎదిరించు. నీ అంతు చూస్తాను."

లక్ష్మణుణ్ణి ఆపాదమస్తకం గమనించాడు రావణుడు. రాకుమారుడు లక్ష్మణుడై ఉంటాడని గ్రహించాడు. నవ్వాడు.

"రాకుమారా! నీ రోజులు తీరి నాతో తలపడుతున్నావు. రా! నిన్ను యమపురికి పంపించిగాని నిద్రపోను." అన్నాడు రావణుడు. గురిపెట్టి ఒక్కసారిగా ఏడు బాణాలను ప్రయోగించాడు. వాటిని తుత్తునియలు చేశాడు లక్ష్మణుడు. బాణాలను మళ్ళీ సంధించకుండా రావణునిపై అనేక బాణాలను ప్రయోగించాడు లక్ష్మణుడు. అయితే అతని ఆలోచనకు భిన్నంగా ఎప్పుడు ప్రయోగించాడో ఏమో! లక్ష్మణుని బాణాలన్నిటినీ తన బాణాలతో ముక్కలు ముక్కలు చేశాడు రావణుడు. ఆపై బ్రహ్మ వరంగా అందజేసిన ఒకానొక బాణాన్ని ప్రయోగించి, లక్ష్మణుని నుదుటన గాయం చేశాడు. పట్టించుకోలేదది లక్ష్మణుడు. తెగించి పోరాడాడు. ఓ బాణంతో రావణుని విల్లు విరిచాడు. తర్వాత ఒక్కసారిగా మూడు బాణాలు ప్రయోగించి, ఆ మూడు బాణాలూ రావణుని గుండెల్లో గుచ్చుకునేటట్టు చేశాడు. గుండెల్లో గుచ్చుకున్న బాణాలకు తీవ్రంగా గాయపడ్డాడు రావణుడు. గుండెల్లోంచి ధారకట్టి ప్రవహిస్తున్న రక్తాన్ని చూశాడు. స్పృహ కోల్పోయాడు. అంతలోనే కోలుకున్నాడు. బ్రహ్మ ప్రసాదించిన అమోఘమైన శక్తిని లక్ష్మణునికి గురిపెట్టి ప్రయోగించాడు. వస్తున్న శక్తిని అడ్డుకునేందుకు అనేక బాణాలను ప్రయోగించాడు లక్ష్మణుడు. అయితే ఏ బాణమూ శక్తిని అడ్డుకోలేకపోయింది. పైగా శక్తి చెరుగుతున్న నిప్పుల్లో లక్ష్మణుని బాణాలన్నీ కాలి బూడిదైపోయాయి. ఆశ్చర్యంగా చేష్టలుడిగి చూడసాగాడు లక్ష్మణుడు. అదే అదనుగా ఆ శక్తి లక్ష్మణుని గుండెల్లోకి చొచ్చుకునిపోయింది. అతన్ని స్పృహ కోల్పోయేలా చేసింది. చూశాడది రావణుడు. గొల్లున నవ్వాడు. పిడికిలి బిగించి, వీరత్వాన్ని ప్రదర్శించాడు. స్పృహ లేక పడి ఉన్న లక్ష్మణుణ్ణి లంకకు ఎత్తుకుపోవాలనుకున్నాడు రావణుడు. భుజబలం అంతా ఉపయోగించి లక్ష్మణుణ్ణి పైకి లేపేందుకు ప్రయత్నించాడు. కాని అది అతని వల్ల కాలేదు. లక్ష్మణుణ్ణి అంగుళం ఎత్తు కూడా లేపలేకపోయాడు.

దూరం నుంచి రావణుని ప్రయత్నాన్ని గమనించాడు హనుమ. పరుగుదీశాడక్కణ్ణుంచి. లక్ష్మణుణ్ణి లేపడం తన వల్ల కాకపోవడంతో ఏం చెయ్యాలో తోచక రథాన్ని అధిరోహించాడు రావణుడు. కళ్ళు మూసుకుని ఆలోచించసాగాడు. పరుగున వచ్చిన హనుమ, అదే అదనుగా చేతిని పిడికిలి చేసి, దానితో రావణుని రొమ్మున గట్టిగా పొడిచాడు. ఆ దెబ్బకి రావణుడి మొహంలోంకి రక్తం తన్నుకొచ్చి, కళ్ళల్లోంచి, ముక్కులోంచి, చెవుల్లోంచి ధారాపాతమైంది. ధారకట్టి ప్రవహిస్తున్న రక్తాన్ని చేతితో తీసి చూసుకున్నాడు రావణుడు. దిగ్భ్రాంతి చెందాడు. మూర్ఛిల్లాడు. రథంలోనే కుప్పకూలిపోయాడు. కాసేపటికి తేరుకున్నాడు. తేరుకున్నా ముందు ఉన్న స్థితికి రాలేకపోయాడు. రథం మీద తూలిపోతూ నిల్చున్న రావణుణ్ణి చూశాడు హనుమ. ఇప్పుడప్పుడే అతడు బలాన్ని సంతరించుకోలేడని తెలుసుకున్నాడు. ప్రమాదం లేదని భావించాడు. వెళ్ళి, స్పృహకోల్పోయి నేల మీద పడి ఉన్న లక్ష్మణుణ్ణి జాలిగా చూశాడు. బాధపడ్డాడు. చేతుల్లోకి తీసుకున్నాడతన్ని. తీసుకుని పరుగులాంటి నడకతో రాముణ్ణి సమీపించాడు. అతని కాళ్ళ దగ్గర లక్ష్మణుణ్ణి ఉంచాడు. సమీపంలో నిల్చున్న రాముణ్ణి చూసి బ్రహ్మశక్తి వినయంగా తొలగిపోయింది. దాంతో లక్ష్మణుడు తేరుకున్నాడు. స్వస్థుడయ్యాడు. ఇక్కడ లక్ష్మణుడు తేరుకోగానే అక్కడ రథం మీద రావణుడు కూడా తేరుకున్నాడు. నిలదొక్కుకుని చుట్టూ చూశాడు. సమరాంగణాన చితికిలపడటం సిగ్గుచేటనిపించిందతనికి. వెంటనే శరాన్ని సంధించి యుద్ధానికి సిద్ధమయ్యాడు.

రావణుని చేతిలో హతమైన అనేకమంది వానరవీరుల్ని చూసి బాధపడ్డాడు రాముడు. కన్నీరుపెట్టుకున్నాడు. తర్వాత కళ్ళెర్ర చేసి, ఆగ్రహోదగ్రుడయ్యాడు. రావణుణ్ణి చూశాడు. తేరుకున్న లక్ష్మణుడు యుద్ధానికి సిద్ధమైతే వారించాడతన్ని. పక్కకు నెట్టాడు. యుద్ధానికి తానే సిద్ధమై బలంగా ముందడుగు వేశాడు రాముడు. రావణునితో రాముడు యుద్ధం చేయబోతున్నాడని గ్రహించి ఆనందించాడు హనుమ. అన్నాడిలా.

"రామా! ఆ దుర్మార్గుడితో పోరాడేందుకు నువ్వు నా భుజాన్ని అధిరోహించు! గరుడుడిపై మహావిష్ణువులా, నా భుజంపై నువ్వుంటే మనిద్దరికీ శుభం."

సరేనన్నట్టుగా తలూపాడు రాముడు. హనుమ భుజాన్ని అధిరోహించాడు. నిప్పులుకక్కుతూ రావణుణ్ణి చూశాడు. అతనితో అన్నాడిలా.

"రావణా! జనస్థానంలో నీ పద్నాలుగువేల మంది సైన్యాన్నీ మట్టుబెట్టిన రాముణ్ణి నేనే! రా! నన్ను ఎదుర్కో."

నీలమేఘశ్యాముడు నిప్పుబొమ్మలా ఉన్నాడు. చూసి ఆశ్చర్యపోయాడు రావణుడు.

"నా సీతను అపహరించి, నువ్వు చెయ్యరాని నేరం చేశావు. అందుకు తగిన ఫలితం అనుభవించాలి. మహేంద్ర యమ వరుణ బ్రహ్మ రుద్ర ఆదిత్యుల్ని నువ్వు శరణుజొచ్చినా నిన్ను నేను వదలను. అలాగే దిక్కులన్నిటికీ పరిగెత్తినా నిన్ను విడువను. నిజంగా నువ్వు ధీరుడివైతే, శూరుడివైతే రా! నాతో యుద్ధం చెయ్యి." అన్నాడు రాముడు. ధనుష్టంకారం చేశాడు. అమ్ములు కూర్చాడు.

రెచ్చగొడుతున్న రాముణ్ణి తుత్తునియలు చేయాలనిపించింది రావణునికి. ఆ కోపాన్ని హనుమ మీద చూపించాడతను. అగ్నిశిఖల్లాంటి బాణాలు ప్రయోగించి, హనుమను తీవ్రంగా గాయపరిచాడు. ఆ గాయాలకు హనుమ ఏ మాత్రం చలించలేదు. పైగా మరింతగా వేగాన్ని పుంజుకున్నాడు. రక్తం స్రవిస్తున్నా పట్టించుకోక, తనని యుద్ధానికి ప్రోత్సహిస్తున్న హనుమ వీరత్వానికి ముగ్ధుడయ్యాడు రాముడు. తర్వాత తన బంటును దెబ్బ తీసిన రావణుణ్ణి క్షమించకూడదనుకున్నాడు. వింటినారిని చెవి కొన వరకూ లాగి, శరపరంపర కురిపించాడు రాముడు.



వాటికి రావణుని గుర్రాలు నేలకూలాయి. ధ్వజం చిరిగి పీలికలైంది. సారథి మరణించాడు. శ్వేత చ్ఛత్రం నిలువునా మండిపోయింది. ఆయుధా లతో నిండిన రథం ఆనవాలు లేకుండా పోయింది.

రథం లేదు. బాణాలు లేవు. ఏ రకమైన ఆయుధాలూ లేవు. ఉన్నదొకటే, విల్లు. దాన్ని పట్టుకుని నేల మీద నిస్సహాయంగా నిలబడ్డాడు రావణుడు. అదే అవకాశంగా రాముడు పిడుగు ల్లాంటి బాణాలు ప్రయోగించాడతని మీద. ఆ బాణాలు రావణుని భుజాల్ని చీల్చి వేశాయి. మాంసాన్ని తొలచి, ముద్దలు ముద్దలుగా కింద పడవేశాయి. తట్టుకోలేకపోయాడు రావణుడు. భయం భయంగా అరవసాగాడు. ఇంద్రుని వజ్రా యుధాన్ని కూడా లెక్క చెయ్యని రావణుడు, రామ బాణానికి నిలువునా వణకిపోయాడు. చేతిలో విల్లుంటే రాముడు తనని వదలడుగాక వదలడు. విల్లుని వదిలేస్తే రాముడు తనని వదిలేస్తాడను కున్నాడు రావణుడు. వెంటనే చేతిలోని విల్లుని జారవిడిచాడు. రావణుడు విల్లు జారవిడవడం, రాముడు అర్ధచంద్రాకారబాణం రావణుని మాణిక్య కిరీటాన్ని నేల పాలు చెయ్యడం రెండూ ఒక్క సారే జరిగాయి. కిరీటం కోల్పోయి, చల్లారిన అగ్నిలా నిలబడ్డాడు రావణుడు. నిరాయుధుణ్ణి చంపడానికి క్షణకాలం చాలు! అయితే శత్రువు దుర్బలతను ఆసరా చేసుకుని అంతమొందించడం వీరుడి లక్షణం కాదని రాముడు శాంతించాడు. చేష్టలుడిగి నిల్చున్న రావణుణ్ణి చూశాడు. అన్నా డిలా.

“రావణా! యుద్ధం చేసి చేసి, వానరవీరుల్ని కూల్చి కూల్చి బాగా అలసిపోయావు. పైగా నిరాయు ధుడవు. ఆపై భయంతో వణకిపోతున్నావు. నేను శస్త్రరహితుణ్ణీ, భయంతో ఉన్నవాణ్ణీ చంపను.

**గరుడుడిపై మహావిష్ణువులా హనుమ భుజాన్ని అధిరోహించి రావణుడితో యుద్ధానికి తలపడ్డాడు రాముడు. ఆ శరాఘాతాలకు రావణుని గుర్రాలు నేలకూలాయి. సారథి మరణించాడు. రథం ఆనవాలు కోల్పోగా, కిరీటం నెత్తుటి బురదలో కూరుకుపోయింది. ఆ దృశ్యాలు తిలకిస్తూ నేలపై నిస్సహాయంగా నిలబడిపోయాడు రావణుడు. భయవిహ్వలుడు, శస్త్రరహితుడైన రావణుణ్ణి చూసి రాముడేమన్నాడు? ఆ మాటలకు రావణుడేమనుకున్నాడు?**

కాబట్టి నువ్వు లంకకు వెళ్ళిపోయేందుకు అను మతి ఇస్తున్నాను, వెళ్ళిపో!”

ఇందాక కిరీటం కాదు, రాముని బాణానికి తల తెగిపడితే బాగుణ్ణనిపించింది రావణునికి. రాముడి మాటలకి అంతలా బాధపడ్డాడు రావ ణుడు. తనని తానే అసహ్యించుకున్నాడు.

“రాక్షసరాజా! చెప్పింది విను, లంకకు వెళ్ళి అలసట తీర్చుకో! రేపు రథికుడివై మళ్ళీ యుద్ధా నికి రా! నా పౌరుష ప్రతాపాలు చూద్దువుగాని.” అన్నాడు రాముడు. వెనక్కి మరలమన్నట్టుగా హనుమను చూశాడు. రామునిసహా హనుమ గాలిలో వెనక్కి దూసుకుపోయాడు.

యుద్ధరంగాన్ని విడచి వెళ్ళిపోతున్న రాముణ్ణి చూశాడు రావణుడు. తర్వాత నిస్సహాయంగా నిల్చున్న తనని తాను చూసుకున్నాడు. ఆ తర్వాత కింద పడి ఉన్న మాణిక్యకిరీటాన్ని చూశాడు. శిరసును అలంకరించాల్సిన కిరీటం నెత్తుటిబుర దలో కూరుకుపోవడాన్ని తట్టుకోలేకపోయాడతను. అందుకుని జాలిగా చూశాడు దాన్ని. నేల మీద జారవిడిచిన విల్లు చచ్చినపాములా ఉంది. అందుకుందామని అంతలోనే మనసు మార్చుకు న్నాడు రావణుడు. దాన్ని వదిలేశాడలా. చచ్చి పడిన గుర్రాలు, చనిపోయిన సారథి, విరిగిపడిన రథం, గాయాలై నొప్పులు పుట్టిస్తున్న భుజాలు... ధైర్యం కోల్పోయాడు రావణుడు. భయంతో వణకి పోయాడు.

“లంకకు వెళ్ళి అలసట తీర్చుకో! రేపు రథికుడివై యుద్ధానికిరా! నా పౌరుష ప్రతాపాలు చూద్దువు గాని.” రాముడి మాటలు పదేపదే వినవస్తోంటే భరించలేనన్నట్టుగా పెద్దగా రోదించాడు రావణుడు. ఆ రోదన దేవ ఋషి గణాలకు వినవచ్చింది. విని వారు ఎంతగానో సంతోషించారు. తమ కష్టాలు తీరే సమయం వచ్చిందని హర్షించారు. పరుగున వచ్చి ఆకాశం పైనుంచి, మబ్బులమాటు నుంచి కిందికి ఆనందంగా చూశారు. సిగ్గుతో కుంచించుకుపోతూ రావణుడు అడుగులో అడుగు వేసుకుని లంక వైపు మరలడాన్ని చూసి మురిసి పోయారు.

తన సైన్యాన్ని చేరుకున్నాడు రాముడు. గాయాలపాలై బాధపడుతున్న వానరవీరుల్ని పరామర్శించాడు. ఆపై లక్ష్మణునిసహా దగ్గరుండి చికిత్సలందిస్తూ అందరినీ ఓదార్చసాగాడు. రాముని మాట చాలు, ఎంతటి గాయమైనా మానిపోతుంది. రాముని స్పర్శ చాలు, శరీరం వజ్రకవచమవుతుంది. వీరులకి అంతకంటే కావాల్సింది లేదు. ధైర్యంగా విశ్రాంతి తీసుకోసాగారంతా.

**-అరణి**

# సౌభాగ్య చక్రం

జులై 27 నుంచి ఆగస్టు 2 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)**

విద్యా విషయాలు, వేడుకలు, పొదుపు పథకాలు, ప్రేమానుబంధాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో ఆర్థిక పరిస్థితి నిరుత్సాహకరంగా ఉంటుంది. చిన్నారుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 29,30 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 31,1 తేదీల్లో కుటుంబ సభ్యుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరంగా ఉంటుంది. 2న ప్రేమానుబంధాలు బెడిసికొట్టే ప్రమాదం ఉంది. చిన్నారులు, ప్రియతముల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి.



**వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, విద్యా విషయాలు, బదిలీలు, నిర్మాణాలు, ఇంట్లో వేడుకల అంశాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో బదిలీలు, మార్పులు, చేర్పులు అసౌకర్యం కలిగిస్తాయి. కుటుంబ వ్యవహారాలపై దృష్టి సారిస్తారు. 29,30 తేదీల్లో ఆర్థిక విషయాలకు సంబంధించి స్పష్టమైన నిర్ణయాలు తీసుకుంటారు. రియల్ ఎస్టేట్ రంగంలోనివారికి శుభప్రదం. 31,1 తేదీల్లో సన్నిహితుల వైఖరి కలవరపెడుతుంది. కీలకమైన పత్రాలు అందుకుంటారు. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. 2న బదిలీలు, మార్పులు అసౌకర్యం కలిగిస్తాయి. రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాలవారు ఆచితూచి వ్యవహరించాలి.



**మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)**

విద్యా విషయాలు, పెట్టుబడులు, షాపింగ్, సోదరీసోదరుల వ్యవహారాలు, బదిలీలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో విద్యార్థులకు నిరాశ ఎదురయ్యే అవకాశం ఉంది. ప్రయాణాలు, చర్చల్లో జాగ్రత్తలు పాటించాలి. సినీ, రాజకీయ రంగాల వారికి శుభప్రదం. 29,30 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రయాణాలపై దృష్టి పెడతారు. 31,1 తేదీల్లో పెట్టుబడులకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు. ఆర్థిక విషయాల్లో సన్నిహితుల నుంచి ఒత్తిడి రావచ్చు. 2న ప్రయాణాలు, చర్చల్లో నిదానం అవసరం. వాగ్వాదాలకు దూరంగా ఉండాలి. విద్యార్థులు లక్ష్య సాధనకు పట్టుదలతో కృషి చేయాలి.



**కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, పొదుపు పథకాలు, షాపింగ్, కీలక నిర్ణయాలు, ఫీజుల చెల్లింపులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో పెట్టుబడుల్లో తొందరపాటు తగదు. ఖర్చులు అంచనాలు మించుతాయి. బృంద కార్యక్రమాల్లో పాల్గొంటారు. 29,30 తేదీల్లో దీర్ఘకాల పెట్టుబడులు లాభిస్తాయి. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అవసరమైన నిధులు సమకూర్చుకుంటారు. 31,1 తేదీల్లో పెట్టుబడులకు సంబంధించిన నిర్ణయాలు వాయిదావేయడం మంచిది. రుణాలు, పొదుపు పథకాలకు సంబంధించి ఆరా తీస్తారు. 2న ఆర్థిక విషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. షాపింగ్‌లో నాణ్యత గమనించాలి.



**సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)**

సమావేశాలు, దూరప్రయాణాలు, కీలక నిర్ణయాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఉద్యోగ ప్రయత్నాలు ఫలించకపోవచ్చు. పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. వ్యాపారంలో ప్రోత్సాహకరం. 29,30 తేదీల్లో బృంద కార్యక్రమాల్లో పాల్గొంటారు. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. 31,1 తేదీల్లో దూరప్రయాణాలు, ఉన్నత విద్యా విషయాల్లో అనుకోని ఆటంకాలు ఎదురవుతాయి. ఆత్మపరిశీలన చేసుకుంటారు. యోగధ్యానాలకు అనుకూలం. 2న ముఖ్యమైన నిర్ణయాలు తీసుకునేందుకు ఇది తగిన సమయం కాదు. కొత్త ప్రాజెక్టులు, ప్రయత్నాలకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది.



**కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)**

వృత్తి, వ్యాపారాలు, ప్రముఖుల కలయిక, ప్రయాణాలు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. రాజకీయ, సినీ రంగాల వారు శుభవార్త అందుకుంటారు. 29,30 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. ప్రముఖులను కలుసుకుంటారు. 31,1 తేదీల్లో ఆర్థిక విషయాల్లో అనుకోని అవాంతరాలు ఎదురవుతాయి. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. 2న ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. అవాంతరాలు ఆటంకాల కారణంగా మనశ్శాంతి లోపిస్తుంది. ఒక సమాచారం కలవరపెడుతుంది.



**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)**

సమావేశాలు, వృత్తి, వ్యాపారాలు, బంధుమిత్రుల కలయిక, ఆర్థిక వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. పెట్టుబడుల్లో నిదానం అవసరం. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 30, 1 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ప్రయాణాలు ఉల్లాసం కలిగిస్తాయి. 31,1 తేదీల్లో సమావేశాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. బృందకార్యక్రమాల్లో కీలక పాత్ర పోషిస్తారు. వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా కొంత నిరుత్సాహకరంగా ఉంటుంది. 2న ఆర్థిక విషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. బంధుమిత్రుల నుంచి మాటపడాల్సి రావచ్చు. స్పెక్యులేషన్లకు దూరంగా ఉండాలి.



**వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)**

ఆర్థికపరమైన సమావేశాలు, వృత్తి వ్యాపారాలు, పెద్దలు, బంధుమిత్రుల కలయికపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో శ్రీవారు, శ్రీమతి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. సమావేశాల్లో మాటపడాల్సి వస్తుంది. జనసంబంధాలు విస్తరిస్తాయి. 30,1 తేదీల్లో పెద్దల ఆరోగ్యం మెరుగవుతుంది. బీమా, గ్రాట్యుటీ పనులకు అనుకూలం. 31,1 తేదీల్లో సమావేశాల్లో పెద్దల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. 2న లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. పైఅధికారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. గౌరవ, ప్రతిష్ఠలకు భంగం కలిగే ప్రమాదం ఉంది.



**ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)**

భాగస్వామ్యాలు, ఆర్థిక వ్యవహారాలు, ప్రయాణాలు, వేడుకలు, వృత్తి, వ్యాపార విషయాలపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధ, గురువారాల్లో వృత్తి వ్యాపారాల్లో లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపుతారు. 29,30 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. శ్రీమతి, శ్రీవారి వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. 31,1 తేదీల్లో ఆర్థికపరమైన సమావేశాలు ఫలించకపోవచ్చు. విద్య, సమావేశాలకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. 2న ప్రయాణాల్లో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. విద్యా సంస్థల ఎంపిక విషయంలో తికమక పడతారు. శ్రమాధిక్యం తప్పకపోవచ్చు.



**మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)**

ఆరోగ్యం, స్పెక్యులేషన్లు, పెట్టుబడులు, బీమా, రుణప్రయత్నాలు, ఫీజులు, బిల్లుల చెల్లింపులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో చిన్నారులు, ప్రియతముల కోసం ఖర్చులు అంచనాలు మించుతాయి. పెట్టుబడుల్లో తొందరపాటు తగదు. విలువైన వస్తువులు సేకరిస్తారు. 29,30 తేదీల్లో ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపిస్తారు. సహోద్యోగుల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. 31,1 తేదీల్లో స్పెక్యులేషన్లలో ఆచితూచి వ్యవహరించాలి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 2న ఖర్చులు అంచనాలు మించుతాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. బీమా, గ్రాట్యుటీ, క్లెయిముల వ్యవహారాలకు అనుకూలం.



**కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)**

ప్రేమానుబంధాలు, స్పెక్యులేషన్లు, భాగస్వామికి సంబంధించిన అంశాలు, క్రయవిక్రయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో కుటుంబ సభ్యుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి శుభప్రదం. 29,30 తేదీల్లో వివాహ నిర్ణయాలకు అనుకూలం. ప్రియతములతో ఉల్లాసంగా గడుపుతారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 31,1 తేదీల్లో భాగస్వామి సహకారంతో వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. బంధుమిత్రులతో విందు వినోదాల్లో పాల్గొంటారు. 2న స్పెక్యులేషన్లలో ఆచితూచి వ్యవహరించాలి. పందాలు, పోటీలకు దూరంగా ఉండండి. భాగస్వామి వైఖరి ఆవేదన కలిగిస్తుంది.



**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)**

విందు వినోదాలు, విద్యా విషయాలు, వృత్తి, వ్యాపారాలు, భాగస్వామి వ్యవహారాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఇంటర్వ్యూలలో పరాజయం ఎదురయ్యే అవకాశం ఉంది. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 29, 30 తేదీల్లో కుటుంబ సభ్యులతో ఉల్లాసంగా గడుపుతారు. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి శుభప్రదం. 31,1 తేదీల్లో చిన్నారులు, ప్రియతముల ఆరోగ్యం కలవరం కలిగిస్తుంది. సృజనాత్మకంగా వ్యవహరించి వృత్తి వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. 2న ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. విందు వినోదాల్లో పరిమితి పాటించండి. లక్ష్య సాధనకు పట్టుదలతో కృషి చేయాలి.




## రాజుగారి నమ్మకం ఖరీదు 17 కోట్లు



'జనతా గ్యారేజ్' విడుదల తేదీ వెనక్కి పోతున్న కొద్దీ సినిమా మీద క్రేజ్ మరింత పెరుగుతోంది. తాజాగా ఈ సినిమా నైజాం హక్కులను దిల్‌రాజు 17కోట్లు వెచ్చించి సొంతం చేసుకున్న సంగతి టాలీవుడ్‌లో హాట్ టాపిక్ అయింది. కొరటాల మీద నమ్మకం, ఎన్టీఆర్ స్టామినా మీద ఉన్న కాన్ఫిడెన్స్ దిల్ రాజు చేత ఇంత మొత్తం పెట్టించాయని టాలీవుడ్ జనాలు అంటున్నారు. ఎన్టీఆర్ కెరీర్‌లో నైజాం హక్కులు ఇంత పెద్ద మొత్తంలో అమ్ముడుపోవడం ఇదే మొదటిసారి. ఈ సినిమా వ్యాపార పరంగా రోజుకో సెన్సేషన్ క్రియేట్ చేస్తోంది. విడుదల తరువాత కూడా ఈ అద్భుతాలు ఇలాగే కొనసాగితే కలెక్షన్లను తిరగరాయడం ఖాయం అంటున్నారు ఎన్టీఆర్ అభిమా

## అత్తకు మరో బంపర్ ఆఫర్



నదియా సెకండ్ ఇన్నింగ్స్ బ్రహ్మాండంగా సాగుతోంది. హీరోయిన్‌గా చేసినప్పటి కన్నా మంచి మంచి ఆఫర్లు అందుకుంటోంది. అత్త, అమ్మ, వదిన, అక్క పాత్రలకు నదియా మంచి ఆప్షన్ అవుతోంది. ఆమె సమకాలీనులు సెకండ్ ఇన్నింగ్స్ మొదలెట్టినా ఆమెలా మాత్రం క్లిక్ కాలేదు. ఇప్పుడు ఇంత సమాచారం ఎందుకంటే నదియా మహేష్ బాబుకి అమ్మగా చేయబోతోందట! సినిమా దర్శకుడు మురుగదాస్ ఆమె కోసం ఓ ప్రత్యేక పాత్ర సృష్టించడం, ఆ పాత్ర నదియాకి నచ్చడం, ఓకే చెప్పడం వెంట వెంటనే జరిగిపోయాయట! త్వరలోనే షూటింగ్‌లో కూడా పాల్గొనబోతోందట.

## అద్భుతాల బిచ్చగాడు



'బిచ్చగాడు' సినిమా విడుదలైనప్పుడు ఎవరూ పెద్దగా పట్టించుకోలేదు. దానికి ఓ బలమైన కారణం ఉంది. ఇది అనువాద సినిమా. సినిమాలోని నటీనటులెవ్వరూ తెలుగువారికి పెద్దగా పరిచయం లేదు. దాంతో మొదట్లో బిచ్చగాడిని లైట్ తీసుకున్నారు కానీ, రోజులు గడిచేకొద్దీ బిచ్చగాడి విలువ తెలియడం మొదలుపెట్టింది. కేవలం మౌత్ పబ్లిసిటీతోనే ఈ సినిమా ఇప్పటి దాకా 25కోట్లకు పైగా వసూలు చేసింది. అనువాద సినిమాలు ఇంత మొత్తం వసూలు చేయడం దక్షిణాదిన మొదటి సారి అంటున్నారు సినీ జనాలు. ఈ సినిమా తరువాత వచ్చిన సినిమాలు బాక్సాఫీసు వద్ద బోల్తా పడడం బిచ్చగాడికి కలిసొచ్చిన అదృష్టం. ఈ సినిమా పూర్తి స్థాయిలో 30 కోట్లు వసూలు చేసినా ఆశ్చర్యపోనక్కర్లేదని అంటున్నారు సినీ జనాలు. మొత్తానికి ఈ 'బిచ్చగాడు' టాలీవుడ్‌లో అద్భుతాలను సృష్టిస్తున్నాడు.

## సల్మాన్ ఖాన్ @ 1000 కోట్లు



బాలీవుడ్‌లో స్టార్ హీరోల సంపాదన ఏ స్థాయిలో ఉంటుందో చెప్పడానికి ఇదొక మచ్చుతునక మాత్రమే! సల్మాన్‌ఖాన్ ఓ టీవీ ఛానల్‌తో కుదుర్చుకున్న ఒప్పందం ఖరీదు అక్షరాలా వెయ్యికోట్లు. దీనికి సంబంధించి షరతులూ, వగైరా అన్నీ ఉంటాయి. 2018 వరకూ సల్మాన్ సినిమాల రైట్స్ ఈ ఛానల్‌కి మాత్రమే సొంతం అవుతాయి. అంతేకాదు ఈ ఛానల్‌లో నిర్వహించే కొన్ని అవార్డు కార్యక్రమాలకూ, మరికొన్ని ప్రమోషన్ ఈవెంట్లకూ సల్మాన్ హాజరు కావలసి ఉంటుంది. కొన్ని రోజుల క్రితం హృతిక్ రోషన్‌తో ఇదే ఛానల్ వారు 550 కోట్ల డీల్ కుదుర్చుకున్నారు. ఇప్పుడు ఈ డీల్‌ని తలదన్నే డీల్ సల్మాన్‌తో చేసుకోవడం బాలీవుడ్‌లో హాట్ టాపిక్ అయింది.

## ఆ డైరెక్టర్‌తో టచ్‌లో ఉన్నారట



మాటల మాంత్రికుడు త్రివిక్రమ్ మాయలో పడని వారంటూ ఉండరేమో! అందుకే అలనాటి హీరోయిన్లు మధుబాల, సిమ్రాన్, సాక్షిశివానంద్ లాంటి వాళ్ళు ఆయన చుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నారట! 'అత్తారింటికి దారేది'తో నదియాకు ఎంత పేరు వచ్చిందో అందరికీ తెలిసిందే! అంత పేరు రావడానికి వెనుక కారణం త్రివిక్రమ్ అని ఈ సీనియర్లు గట్టిగా నమ్మి, తమను దృష్టిలో పెట్టుకుని కథలు రాయమని ఆయన వెంట పడుతున్నారట! ఏదో ఒకరిద్దరికంటే రాయొచ్చు కానీ ఏకంగా నలుగురు సీనియర్ల కోసం కథలు తయారు చేయడం కష్టమే కదా అంటున్నారు సినీ జనాలు. ఆయనేమీ కథల ఫ్యాక్టరీ పెట్టుకోలేదు కదా...అడగ్గానే అందరికీ స్టోరీలు తయారుచేసి ఇవ్వడానికి అని కూడా సెటైర్లు వేస్తున్నారు.

# ఆయన పేరు సీక్రెట్

## -హన్సిక

**సిమ్లా ఆపిల్‌లా ఉండే హన్సిక ఇటీవలి కాలంలో స్ట్రెయిట్ తెలుగు సినిమాలో నటించింది లేదు. 'కళావతి'గా భయపెట్టినా, 'పులి'తో సందడి చేసినా అవన్నీ తమిళ డబ్బింగ్ సినిమాలే! అచ్చ తెలుగు కథతో హన్సికను వెండితెర మీద చూసి చాలా రోజులై పోయింది. తెలుగు ప్రేక్షకులకు ఆ కొరత తీర్చడానికి గోపీచంద్‌తో జత కట్టబోతోంది హన్సిక. తమిళంలో కొద్దిగా సినిమాలు తగ్గించుకుని తెలుగు వైపు దృష్టి సారిస్తున్న హన్సికతో....**

**తొలిసారి గోపీచంద్‌తో జత కట్టబోతున్నట్టున్నారు?**

అవును. తన సినిమాలు చాలా చూశాను. టాలీవుడ్‌లో ఎనర్జీ ఉన్న హీరోలలో గోపీచంద్ కూడా ఒకరు. తనతో చేయడం చాలా సంతోషంగా ఉంది.

**తెలుగులో ఇంత గ్యాప్ తీసుకోవడానికి కారణం?**

అందరికీ తెలిసిందే! నా మొదటి సినిమా తరువాత కోలీవుడ్‌లోనే నాకు ఎక్కువ అవకాశాలు వచ్చాయి. టాలీవుడ్ మీద ఉన్న అభిమానంతో వీలున్నప్పుడల్లా తెలుగు సినిమాలు చేస్తూనే ఉన్నాను. ఈసారి ఇంత గ్యాప్ రావడానికి కారణం నాకు నచ్చిన కథ దొరకక పోవడమే! మంచి కథతో తెలుగు ప్రేక్షకుల ముందుకు రావాలన్న ఉద్దేశంతోనే ఆగిపోయాను. ఇక నుంచి కోలీవుడ్‌లో డేట్లు అడ్జస్ట్ చేసుకుని వీలైనన్ని తెలుగు సినిమాలు చేయాలని నిర్ణయించుకున్నాను.

**హన్సిక దయ్యం సినిమాల మీదే దృష్టి పెట్టిందంటున్నారు. దయ్యాలు ఉన్నాయని నమ్ముతారా?**

దయ్యం సినిమాలే ఎక్కువ చేస్తున్నాను అనడంలో అర్థం లేదు. నచ్చిన పాత్ర రావడంతో చేశాను. అంతే తప్ప దయ్యం పాత్రలు కాబట్టి చేశాను అనడం తప్పు. దయ్యాలు ఉన్నాయా? లేవా? అనేది చాలా పెద్ద డిబేట్. దీని మీద ఎవరి అభిప్రాయాలు వారికుంటాయి. మనకు తెలియకుండానే ఓ పవర్ ఫుల్ శక్తి మన చుట్టూ తిరుగుతూ ఉంటుంది. అదే మనల్ని నడిపిస్తూ ఉంటుంది అని నమ్ముతాను.

**కోలీవుడ్‌లో స్పీడు తగ్గించడానికి కారణం?**

నేను స్పీడుగా సినిమాలు చేస్తున్నానని ఎప్పుడూ అనుకోలేదు. ఒప్పుకున్న సినిమాల షూటింగ్‌లు ఒకదాని తరువాత ఒకటి మొదలు కావడం, వరుసగా విడుదల కావడంతో హన్సిక కోలీవుడ్‌లో బిజీ అన్న వార్తలు వచ్చాయి.

**కోలీవుడ్‌లో నెంబర్ వన్ పొజిషన్ దక్కినట్టేనా?**

ఈ పొజిషన్లు అన్నీ కల్పితాలే! ఒక్క కోలీవుడ్ అనే కాదు. ఏ భాషలోనైనా సరే ఎవరి అవకాశాలు వారికి ఉంటాయి. ఎవరికి వారు పోటీగా భావిస్తారు తప్ప, మరొకరికి పోటీ అనుకోరు. ఇది నా అభిప్రాయం మాత్రమే.

**శింబుతో నటించను అనడానికి కారణం?**

అవన్నీ కల్పితాలే! శింబు సినిమాలో నటించమని నన్ను ఎవరూ అడగలేదు. ఒకరితో నటిస్తాను, మరొకరితో నటించను అనడానికి ఇక్కడ నాకు శత్రువులు ఎవరూ లేరు. అందరూ మంచి స్నేహితులే! శింబుతోనే కాదు, ఎవరితోనైనా నటిస్తాను.

**మీ రియల్ లైఫ్ హీరో ఎవరు?**

ఆయన పేరు టాప్ సీక్రెట్! ఎవరికీ చెప్పను. ఒక్క మా మదర్‌కి తప్ప.

**జయం రవితో మూడు సార్లు జతకట్టడానికి కారణం?**

కారణాలు ఏమీ లేవు. మా పెయిర్ అలా సెట్ అయింది అంతే! జయం రవి చాలా మంచి వ్యక్తి. నాకు మంచి స్నేహితుడు.

**ట్విట్టర్లో మీ ఫాలోయర్ల సంఖ్య చాలా ఎక్కువంటారు నిజమేనా?**

అన్ని భాషల్లోనూ నాకు అభిమానులున్నారు. వారందరూ ట్విట్టర్ ఫాలో అవుతూనే ఉంటారు. నా మీద ఇంత అభిమానం చూపించే వారికి కృతజ్ఞతలు చెప్పుకోవడం తప్ప ఇంకేం చేయగలను?

**సడెన్‌గా బాలీవుడ్ మూవీ చేయడంలో ఆంతర్యం?**

అదేం లేదు. మంచి కథ దొరక్క బాలీవుడ్‌లో సినిమా చేయలేదు. బాల నటిగా అక్కడ చేసే దక్షిణాదికి వచ్చానన్న సంగతి మరిచిపోకూడదు. నటికి భాషా భేదం ఉండకూడదు కదా?

**మీ పెయింటింగ్స్ అన్నీ వేలం వేసినట్టేనా?**

లేదు. ఇంకా కొన్ని ఉన్నాయి. పెయింటింగ్స్ ద్వారా వచ్చిన మొత్తం అంతా నా పిల్లలకే ఇస్తున్నాను. వారి కోసమే ఈ వేలం.

**ఇటీవల చెన్నైలో రహస్యంగా దుప్పట్లు, వాటర్ బాటిల్స్ పంచారట కదా?**

రహస్యంగా కాదు. రాత్రి సమయంలో పంచాను. రోడ్డుపక్కన నిద్రించేవారికి ఇవ్వాలని బెడ్‌షీట్లు, వాటర్‌బాటిల్స్ నాతో పాటు షూటింగ్‌కి తీసుకెళ్ళాను. షూటింగ్‌లోనే లేటయిపోయింది. వస్తూ వస్తూ వారికి అవి అందజేసి వచ్చేశాను. నేను వెళ్ళేటప్పటికే అందరూ మంచి నిద్రలో ఉన్నారు. వారిని లేపి మరీ ఇవ్వడం ఎందుకని వారి పక్కన పెట్టేసి వచ్చాను.

**మిమ్మల్ని టైంబాంబ్ అంటారట నిజమేనా?**

టైం పంక్చువాలిటీ అంటే నాకు ప్రాణం. ఏ పనైనా కరెక్ట్ టైముకి చేయాలనుకునే తత్వం నాది. షూటింగ్‌లకి లేటుగా రావడం, వచ్చినా మిగతా పనులు చూసుకోవడం వంటివి నాకు నచ్చదు. ముందు షూటింగ్. ఆ తరువాతే మిగతా పనులు అంటాను. అందుకే కొందరు నాకు టైంబాంబ్ అని నిక్‌నేమ్ పెట్టారు. ఆ సంగతి నాకూ తెలుసు.

**సెలవులకి న్యూయార్క్ ఎందుకు వెడతారు? ఇండియా నచ్చదా?**

అర్థం లేని ప్రశ్న. నా దేశం నాకు ఎందుకు నచ్చదు? పిల్లలకి అమ్మ నచ్చకుండా ఉంటుందా? అలాగే ఇండియా కూడా! ఇక ప్రత్యేకించి న్యూయార్క్ ఎందుకు వెడతానంటే చెప్పడం కష్టం. అక్కడికి వెడితే గొప్ప రిలీఫ్‌గా ఫీలవుతా! అందుకే ఏడాదిలో కనీసం ఓ 20 రోజులన్నా అక్కడ గడిపి వస్తా. ఏడాదంతా పడిన కష్టానికి అక్కడ సేద తీరుతా అంతే!

**మీ బలం, బలహీనతా?**

నా అభిమానులే! వాళ్ళే లేకపోతే ఈ రోజు నేను ఈ స్థాయిలో ఉండేదాన్ని కాదు.

**నటి కాకపోయుంటే....**

ఛాన్సే లేదు. చిన్నతనం నుంచీ నటన అంటే ఇష్టం. అందుకే ఎప్పుడూ మరో ప్రొఫెషన్ గురించి ఆలోచించలేదు.

**ఇటీవలి కాలంలో మీ మార్కెట్ తగ్గిందంటున్నారు ఎంత వరకూ నిజం?**

నేను సినిమాలు తగ్గించుకోవడంతో ఇలాంటి ప్రచారం మొదలు పెట్టారు. ఇప్పటికీ నాతో వరుసగా సినిమాలు చేయడానికి దర్శక నిర్మాతలు రెడీగా ఉన్నారు. నేనే సెలెక్టివ్‌గా చేస్తున్నాను. దానికి నా కారణాలు నాకున్నాయి.

**వృద్ధుల కోసం నిర్మిస్తున్న ఆశ్రమం ఎంత వరకూ పూర్తయింది?**

దాని పనులు జరుగుతున్నాయి. మనం అనుకున్నంత వేగంగా పనులు పూర్తి కావు కదా?

-చిన్ని

## ఈ పిల్లకి ఏమైంది?

'ప్రేమమ్' ద్వారా సాయి పల్లవికి ఎంత పేరొచ్చిందో అందరికీ తెలిసిందే! మరో హీరోయిన్ అయితే నాలుగైదు సినిమాలు చేసేవాళ్ళు. కానీ సాయి పల్లవి అలా చేయలేదు. 'నా రూటే సెపరేటు' అన్నట్లుగా వ్యవహరిస్తోంది. వచ్చిన ప్రతి అవకాశాన్నీ ఏదో ఒక కారణంతో వద్దనేస్తోంది. గతంలో మణిరత్నం పిలిచి అవకాశం ఇస్తే అమ్మో నా డాక్టరు చదువు పరీక్షలు అంటూ ఆయనకు నో చెప్పేసింది. ఇప్పుడేమో కోలీవుడ్ స్టార్ హీరో అజిత్ పక్కన నటించే అవకాశాన్ని కూడా వదులుకుంది. కాకపోతే ఈసారి పరీక్షల సాకు చెప్పలేదు. ఎందుకు చేయడం లేదో కూడా వివరణ ఇచ్చుకోలేదు. దాంతో సాయి పల్లవిది అమాయకత్వమా? లేక తల పొగరా? అన్న చర్చ కోలీవుడ్‌లో జోరుగా సాగుతోంది. ఇప్పటికైనా సాయి పల్లవి తన పద్ధతి మార్చుకోకుంటే అవకాశాలు తగ్గిపోతాయంటున్నారు సన్నిహితులు.

ఇంటర్వ్యూ



# నటనంటే తెలియని వాళ్ళతో డైలాగ్స్ చెప్పిస్తున్నారు

-కిన్నెర

**నంది అవార్డుల నటి కిన్నెర. కూచిపూడి నృత్యకళాకారిణి. నటనే ధ్యేయంగా వెండితెర, బుల్లి తెరలపై రాణిస్తూ ప్రేక్షకులను అలరిస్తున్నారామె. ఆర్టిస్టు ఆర్టిస్టుగా నిలబడాలంటే వారిలోని టాలెంట్‌ను గుర్తించాలని, అప్పుడే నటులందరికీ అన్నంపెట్టి జీవితాన్ని ఇచ్చినవారవుతారనీ దర్శకులకు విజ్ఞప్తిచేస్తున్న కిన్నెర ఇంటర్వ్యూ.....**

తూర్పుగోదావరిజిల్లా రాజమండ్రి నా జన్మ స్థలం. నా అసలు పేరు దేవి. మా నాన్నగారు సి.హెచ్.సత్యనారాయణ. అమ్మ లలితారాణి. ఆమె రంగస్థల, సినీనటి. మేం ముగ్గురు అక్కా-చెల్లెళ్ళం. ఒక అన్నయ్య. అందరిలోనూ నేనే చివరిదాన్ని. నైన్త్ వరకు స్కూల్స్‌లోనే చదివాను. ఆ తర్వాత మెట్రిక్ వరకు ప్రైవేటుగా చదువుకున్నాను. నా ఆరవయేట నుండే కూచిపూడినృత్యం నేర్చుకోవడం ప్రారంభించాను. భరతకళాప్రపూర్ణ కోరాడ నరసింహారావుగారు నా తొలి నాట్యగురువు. తర్వాత మా మామయ్య నన్ను మద్రాసులో వెంపటి చినసత్యంగారి నృత్యాలయంలో చేర్చారు. వారం వారం అక్కడే ఉండి డ్యాన్స్ ప్రాక్టీస్ చేసేదాన్ని. ప్రఖ్యాత నర్తకి శోభానాయుడు ఆసమయంలోనే ఆయన శిష్యరికం చేసేది. ఆవిడకూడా అప్పుడప్పుడు మాకు తరగతులు చెప్పేది. ఆ విధంగా నేను 1979-80 కాలంలో కూచిపూడి నృత్యాన్ని అన్ని హంగులతో సంపూర్ణంగా అభ్యసించి ప్రావీణ్యం సంపాదించాను. నా డ్యాన్స్ చూసి అందరూ ఎంతో మెచ్చుకునేవారు.

### సినీ రంగ ప్రవేశం

పి.వి.రావుగారు మద్రాసు ఫిలిమ్ ఇండస్ట్రీ నట శిక్షణాలయంలో ఇంగ్లీషు లెక్చరర్. ఆయన ఒకసారి రాజమండ్రి వచ్చారు. అదేసమయంలో నేను ఆనంకళాకేంద్రంలో డ్యాన్స్ చేస్తున్నాను. ఆయన కూడా అక్కడికి రావడం, నా నృత్యాభినయం చూసి మెచ్చుకుని మా ఇంటికి రావడం, నన్ను సినిమాల్లో నటించడానికి ప్రోత్సహించమని మా అమ్మానాన్నలను అడగడం వెంట వెంటనే జరిగాయి. మా అమ్మగారు లలితారాణి రంగస్థల నటి. పునాదిరాళ్ళు, స్నేహం, పుట్టినిల్లు మెట్టినిల్లు...ఇలా దాదాపు పదిపదిహేను చిత్రాల్లో నటించారు. రావుగారు, నటిస్తావా? అని అడిగినప్పుడు, ససేమిరా అన్నాను. ఏడ్చాను. కానీ అమ్మ, మామయ్య, రావుగారు కూడా నాకెంతో నచ్చజెప్పారు. రాజమండ్రిలో మాకు ఆస్తులున్నప్పటికీ అంతంతమాత్రంగా ఉన్న ఆర్థికపరిస్థితులు కూడా తోడవటంతో తప్పనిసరై అంగీకరించాను.

### పేకేటి శివరామ్‌గారి పరిచయం

పి.వి.రావుగారికి పేకేటి శివరామ్‌గారు ప్రాణ మిత్రులు. రావుగారు నన్ను, మా మావయ్యను మద్రాసు తీసుకెళ్ళి శివరామ్‌గారికి పరిచయం చేశారు. ఆయన మమ్మల్ని ప్రముఖ నిర్మాత ఎస్.పి.వెంకన్నబాబుగారి దగ్గరకు తీసుకెళ్ళారు. రుస్తుం, ఖైదీ, దొంగమొగుడు...వంటి హిట్ చిత్రాల నిర్మాత ఆయన. నన్ను చూడగానే ఫోటోజెనిక్ ఫేస్, బ్యూటిఫుల్ అంటూ తప్పకుండా అవకాశం ఇస్తానన్నారు.

### భలేమొగుడు

వెంటనే నాకు వెంకన్నబాబుగారి 'భలేమొగుడు' చిత్రంలో సహనటిగా అవకాశం ఇచ్చారు. నాకు జోడీ శుభలేఖ సుధాకర్‌గారు. రాజేంద్రప్రసాద్, రజని, రాళ్ళపల్లి తదితరులు ఈ చిత్రంలో నటించారు. రేలంగి నరసింహారావుగారి దర్శకత్వంలో 1987లో ఈ చిత్రం విడుదలైంది. శభాష్, బాగా నటించావ్ అన్నారాయన. ఈ చిత్రంతోనే నా పేరును వెంకన్నబాబుగారు కిన్నెరగా మార్పు చేశారు. చాలా శాస్త్రోక్తమైన పద్ధతిలో నా నామకరణ మార్పు కార్యక్రమం జరిగింది.

### చెట్టుకింద ప్లీడర్

దర్శకుడు వంశీగారు ప్రత్యేకంగా నన్ను పిలిపించి చెట్టుకింద ప్లీడర్ చిత్రంలో హీరోయిన్‌గా నాతో కామెడీరోల్ చేయించారు. కామెడీకింగ్ రాజేంద్రప్రసాద్‌గారి సరసన పూర్తినిడివి కామెడీ చేయడం మాటలు కాదుకదా? అలాంటిది నన్ను జోడీగా పెట్టి నాతో కామెడీ పండించి, నాకు ఈ చిత్రంతో మంచిపేరు రప్పించారు. వంశీగారికి కూడా దర్శకునిగా ఎంతోమంచి పేరు వచ్చింది. ఇళయరాజాగారి సంగీతసారథ్యంలో ఇదో మ్యూజి

కల్ హిట్ చిత్రం. 1989లో విడుదలైన ఈ చిత్రం లోని పాటల్ని ప్రేక్షకులు బాగా ఆదరించారు. ఈ సినిమా తర్వాత నాకు మంచి పేరు వచ్చినా ఎందుకో నా మైండ్ పూర్తిగా సినిమారంగంలో ఉండాలా? వద్దా? అనే సందిగ్ధంలో పడింది. అందుకే మళ్ళీ రాజమండ్రి చేరుకుని నాట్య ప్రదర్శనల్లో నిమగ్నమయ్యాను. రెండేళ్ళ తర్వాత దర్శకులు వై.నాగేశ్వరరావుగారి దగ్గర నుండి పిలుపు వచ్చింది.

## డాక్టర్ భవాని

వై.నాగేశ్వరరావుగారు నన్ను ప్రత్యేకంగా పిలిపించి 'డాక్టర్ భవాని'లో నాకు అవకాశం ఇచ్చారు. ఈ చిత్రంలో కో డైరెక్టర్ శ్రీనివాసరెడ్డి గతంలో నా చిత్రంచూసి ఎలాగైనా నన్నుతీసుకోమ్మని రికమెండ్ చేశారు. అలా నాకు ఈ చిత్రంలో మంచి పాత్ర లభించింది. ఈ కథంతా నా చుట్టూ తిరుగుతుంది. ఇక అక్కయ్య ఊర్వశి శారద ఈ చిత్రంలో అద్భుతంగా నటించారు. ఆమెతో నేను నాలుగైదు చిత్రాల్లో నటించాను. డైలాగ్స్, నటన, హావభావాల విషయంలో సలహాలిస్తూ ఆమె నన్ను ఎంతో ప్రోత్సహించారు. ఆ అనుభవాలను నిజంగా నా జీవితంలో మరచిపోలేను. మేజర్ చంద్రకాంత్, అక్కమొగుడు, రౌడీ ఇన్‌స్పెక్టర్, టాప్‌హీరో, ఆదిత్య 369, సింహ, శంభోశివశంభో.. చిత్రాల్లో నటించాను. 'దోషి-నిర్దోషి' చిత్రంలో శోభన్‌బాబుగారి కూతురుగా, సర్పయాగంలో సీబీఐ ఆఫీసర్‌గా నటించాను. ఈ రెండు చిత్రాల్లో నాకు మంచి పేరు వచ్చింది.

## బాబాయ్ హోటల్

బాబాయ్ హోటల్ చిత్రంలో అనుకోకుండా అవకాశం వచ్చింది. నిజానికి ఈ పాత్ర యమున చేయాలి. అనివార్యకారణాల వల్ల ఆమె రాలేకపోయింది. ఈ చిత్రంలో బ్రహ్మానందంగారి సరసన నటించాను. కామెడీసీన్‌లు ఉన్నాయి కాబట్టి విభిన్నమైన మాడ్యులేషన్స్‌లో డైలాగ్స్ చెప్పమన్నారు. తొమ్మిది రకాల ఫీలింగ్స్ ఎక్స్‌ప్రెస్ చెయ్యమన్నారు. అందుకు తగినట్టు నేను నటించాను.

నవ్యవీక్లీ చదువుతూ...

'నీతో మా సెడ్డ సిక్కు మారాజా' అనే డైలాగ్ ఈ సినిమాలో బాగా క్లిక్ అయ్యింది. అదీకాకుండా నా గెటప్ చాలా చిత్రంగా ఉంటుంది. చీర మడిచి గోచీ కట్టుకునే సీన్ అందరినీ తెగ నవ్వించింది. అలా బ్రహ్మానందంగారి నటనతో చిత్రం మొత్తం కామెడీ పంట పండింది. 1992లో ఈ చిత్రం విడుదలైంది.

## చెంప బూరెలా వాచిపోయింది!

డాక్టర్ భవానీ షూటింగ్ విజయాగార్డెన్స్‌లో జరుగుతోంది. నటుడు బ్రహ్మాజీ విలన్‌పాత్ర. నా చెంప మీద పంచ్‌ఇచ్చే సీను అది. ఆయన పంచ్ ఇచ్చేసమయంలో నేను చాలా షార్ప్‌గా నా చెంపను పక్కకు తిప్పాలి. కానీ టైమింగ్ తేడా వల్ల నాకు ఆయన గట్టి పంచ్ ఇచ్చాడు. ఎంతో బలంగా తగిలి చెంప బూరెలా వాచిపోయింది. నేను స్పృహ కోల్పోయాను. లేచిచూస్తే హాస్పిటల్‌లో ఉన్నాను. పాపం! బ్రహ్మాజీ కూడా సినిమాకి కొత్తేమరి! కొత్త నటులం గనుక మేం కొన్ని ట్రిక్స్ తెలుసుకోలేకపోయాం. ఫీల్డ్‌కి ఇద్దరం కొత్తే. నెల రోజులకు నొప్పి పూర్తిగా తగ్గిన తర్వాత మళ్ళీ నా షాట్ తీశారు. ఈ విషయంలో భాను చందర్ ఆవేశంతో బ్రహ్మాజీని కొట్టడం కూడా జరిగింది. ఇప్పటికీ అప్పుడప్పుడు బ్రహ్మాజీ ఆ విషయం నాకు గుర్తుచేస్తూ నా చెంపవైపు చూస్తుంటే మేం నవ్వుకుంటూ ఉంటాం.

## ఆ పాత్ర కిన్నెరే చేయగలదు

సినిమా రంగంలో నాకు గురుతుల్యులు ఊర్వశి శారద, పరుచూరి గోపాలకృష్ణ, జంధ్యాల, వంశీగారు. పరిశ్రమ గురించి నెగెటివ్‌గా చెప్పడానికి వీలులేదు. ఎందుకంటే మాలాంటి కళాకారులకు పరిశ్రమ తల్లిలాంటిది. కానీ నటీనటుల విషయంలో ఒకప్పుడు పాత్రల ఎంపికలో ఫలానా వేషాన్ని శారదమ్మగారే చేస్తారు, కృష్ణకుమారిగారే చేస్తారు, షావుకారు జానకే చేస్తారు, కాంచనే చేస్తారు... అది వాళ్ళే చెయ్యగలరు...అనే నమ్మకం దర్శకుల్లో ఉండేది. కానీ ఇప్పుడది లేదనిపిస్తోంది. అసలు నటన అంటే ఏమిటో తెలియనివాళ్ళని పిలిచి ఏదో తూతూ మంత్రంలా డైలాగ్స్ చెప్పిస్తున్నారు. ఎవరి పాత్రకు వారు న్యాయం చెయ్యడం లేదనే అనిపిస్తుంది. ఒకప్పుడు షాట్ వారం రోజుల్లో ఉందనగానే స్క్రిప్ట్ ఇచ్చేవారు. ఇప్పుడు అలాంటిదేం లేదు. ఒక గంటలో షాట్ ఉంటుందనగా ఏవో నాలుగు డైలాగ్స్ చెపుతున్నారు. అనుభవం ఉన్న నటుల విషయంలో పరవాలేదు. కొత్తవారికి ఇది చాలా ఇబ్బంది. లొకేషన్‌కి వచ్చినప్పుడు, డైలాగ్స్ ఇస్తే కనీసం రెండుమూడుసార్లు ప్రాక్టీస్ చేసుకోవడానికి కూడా అవకాశం లేకుండాపోతోంది. కనుక ఈ పద్ధతి మారాలి. దర్శకులను నేను కోరేది ఒక్కటే. అనుభవం ఉన్నవారు కొద్దోగొప్పో ఆన్ ద స్పాట్‌లో డైలాగ్స్ చెప్పగలరు. లేనివారి సంగతి ఏమిటి? ఇక్కడో విషయం గుర్తుచేయాలి. 'టాప్ హీరో' చిత్ర నిర్మాణసమయంలో ఎస్వీ.కృష్ణారెడ్డిగారు ఈ పాత్ర కిన్నెర పోషించగలదు అని గుర్తించి, బలవంతంగా తీసుకొచ్చి మరీ నటింపజేశారు. ఇప్పుడు కూడా పరిస్థితులు అదేవిధంగా ఉన్నట్టయితే, నటులకు అలాంటి అవకాశాలు కలగజేస్తే, ఆర్టిస్టులు ఆర్టిస్టులుగా నిలబడగలుగుతారు. అప్పుడు ఏ కొద్ది చిత్రాలో తప్ప ఫ్లాపులు, అట్టర్ ఫ్లాపు చిత్రాలు అనేవి ఉండవు. నిర్మాతలు, బయ్యర్లు బాగుపడతారు. ఆర్టిస్టుల్లో ఉన్న గొప్పతనాన్ని గుర్తించినపుడు అందరికీ అన్నం పెట్టి లైఫ్ ఇచ్చినవారవుతారు.


కుటుంబసభ్యులతో..

## టీవీ సీరియల్స్

మూడు దశాబ్దాలుగా 80 చిత్రాలుపైగా నటించాను. ఇప్పటివరకు 50 టీవీ సీరియల్స్‌లో నటించాను. నటిగా, సహనటిగా ఎనిమిదిసార్లు రాష్ట్ర ప్రభుత్వం నుండి నంది అవార్డులు అందుకున్నాను. ఈ సీరియల్స్ అన్నీ 1997-2000 సంవత్సరం మధ్యకాలంలో వచ్చినవే. దూరదర్శన్‌లో 'ఓ స్త్రీ సంకెళ్ళు తెంచుకో', పువ్వు సీరియల్స్ ఇతర ఛానల్స్‌లో అంతరంగాలు, విధి, శివరంజని లాంటి సీరియల్స్‌లో నటించాను.

అదేవిధంగా ఎన్నో వేదికలపై 4000కు పైగా కూచిపూడి నాట్య ప్రదర్శనలు చేసి అనేక అవార్డులు, సన్మానాలు అందుకున్నాను. సినీగోయర్స్ అసోసియేషన్‌వారి అవార్డు, సావిత్రి స్మారక అవార్డు, వాణిశ్రీ కళాభినేత్రి అవార్డు, హీరోహోండావారి ప్రత్యేక అవార్డు అందుకున్నాను. ఇవికాక అనేక సంస్థల నుండి అవార్డులు అందుకున్నాను.

## కుటుంబం

2005వ సంవత్సరంలో నా వివాహం జరిగింది. నా భర్త పేరు ఎ.ఫణికుమార్. కంప్యూటర్ హార్డ్‌వేర్‌లో ఉద్యోగం. మాకు ఇద్దరు పిల్లలు. బాబు పేరు జయసూర్య, పాప పేరు జాబిలి.

*-కె.హరనాథ్, సెల్: 97035 42598*

# ఇవన్నీ నిజాలే!

A తొలి శృంగార చిత్రం *Le coucher de la mariee* 1896 నవం బరులో విడుదలైంది. ఈ ఫ్రెంచ్ షార్ట్‌ఫిల్మ్‌లో భార్యాభర్తల మొదటిరాత్రిని ఏడు నిమిషాలపాటు దృశ్యీకరించారు. అయితే 1996లో ఇది పురావస్తుశాఖలో లభించేనాటికి రెండు నిమిషాల నిడివి మాత్రమే మిగిలింది. నటి లూయిస్ విల్లీ ఇందులో నటించింది.

•••

A తోకలేని కోతి (Ape) కంటే పక్షులకే తెలివి తేటలు ఎక్కువ. ఈ కోతుల కంటే పక్షుల మెదడులోనే ఎక్కువ కణాలున్నాయి. ఉప కరణాల సాయంతో నైపుణ్యం ప్రదర్శించగల తెలివితేటలు మాత్రమే కాదు, అద్దంలో తమ ప్రతిబింబాన్ని కూడా అవి గుర్తుపట్టగలవు!

•••

A షార్క్ చేప అర కిలోమీటరు దూరంలో ఉన్న చిన్న శబ్దాల్ని కూడా పసికట్టగలదు.

•••

A శిలాజ శాస్త్రజ్ఞుల పరిశోధనల ప్రకారం కొన్ని డైనోసార్లు 75 నుంచి 300 సంవత్సరాల కాలం జీవించాయి.

•••

A బాంద్రా - వర్లి మధ్య సముద్రంపై వారధి నిర్మాణానికి కార్మికులు రెండు కోట్ల 57 లక్షల పని గంటలు ఖర్చు చేశారు. కాటాలో 50 వేల ఆఫ్రికన్ ఏనుగుల్ని ఒకవైపు, ఈ వంతెనను మరోవైపు పెడితే వీటి బరువు సరిసమానంగా ఉంటుంది! ఈ నిర్మాణం ఓ గొప్ప ఇంజనీరింగ్ అద్భుతం.

•••

A లిప్ లాక్‌కి ఆద్యులు భారతీయులే.

•••

## ఫస్ట్ మోడ్రన్ డైట్ డాక్టర్

A సుమారు 300 సంవత్సరాల క్రితంనాటి స్కాట్లాండ్ ఫిజీషియన్ పేరు George Cheyne. ఆయన స్వీయానుభవాల్ని రంగరించి "ది నేచురల్ మెథడ్ ఆఫ్ క్యూరింగ్ ద డిసీజెస్ ఆఫ్ ద బాడీ అండ్ ద డిజార్డర్స్ ఆఫ్ ద మైండ్" అనే పుస్తకం రాశాడు. ధనవంతులైన స్థూలకాయుల్ని నాజూగ్గా (డైట్ చికిత్స) తయారుచేసే సరికొత్త వ్యాపారం సృష్టించాడు. కనుక ఆయనే ఫస్ట్ మోడ్రన్ డైట్ డాక్టర్ అనుకోవచ్చు!

•••

A రోమన్ మహా సామ్రాజ్యం ఇరవై లక్షల 51 వేల చదరపు మైళ్ళలో విస్తరించి ఉండేది. బాప్‌రే! అనిపిస్తోంది కదూ! కానీ చరిత్రలో ఉన్న మహాసామ్రాజ్యాలలో దీనిది 19వ స్థానం.

•••

A అమెరికా అధ్యక్షుడు జార్జి డబ్ల్యు బుష్ జార్జియా పర్యటనలో ఉండగా, 2005లో ఆయనపై గ్రెనేడ్ విసిరారు. నేరుగా అది ఆయనమీదే పడింది. కానీ అది పేలకపోవడం వల్ల ఆయన మరణించలేదు.

-చిన్నారి

# సుధామ పదగారడి-272

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | h | 3 | 4 | | 5 |
| | h | | h | 6 | h | | h | |
| 7 | | | h | 8 | | 8 | 9 | h |
| | h | 10 | 11 | | h | h | 12 | |
| h | 13 | h | | h | 14 | h | | h |
| 15 | | 15 h | h | 16 h | | 17 h | h | 18 |
| h | 19 | 20 | | | h | 21 | h | |
| 22 h | h | | h | | h | | h | |
| 23 | | | | h | 24 | | | |

## ఆధారాలు

### అడ్డం

1. ఉపాహారంలో దీనికి ఉప్మా జత బెస్టు! (4)
3. టిఫిన్ (4)
7. కలవరము, తొందర (3)
8. ఇలాంటి విత్తనాలు నాటడం వల్ల రైతు నష్టపోతాడు (4)
10. దీపావళికి ఆకాశంలో ఎగిసేవి (3)
12. ఏ.వీ.యస్ తృప్తి (2)
15. పొలము (2)
16. చీకటి (3)
19. పూలపిల్ల!? (4)
21. కంచర జాతి జంతువు (3)
23. తోట (4)
24. ఈనాడు కట్టుకున్న ... కావాలి ముందు ముందు పొదరిల్లు! (4)

### నిలువు

1. వర్షం ముందు ఒక్కసారి ఇది వీస్తుంది (4)
2. మన్మథుడు (4)
4. 'వాడిని ఉప్పు... వేసినా తప్పలేదు'- ఓ ఆగ్రహవాక్యం (3)
5. యావ, ఒకటే ధ్యాస వంటిదే, పోరు (2)
6. గ్రామదేవతకు పళ్ళేరాలలో, కుండలలో పట్టుకెళ్ళేవి (3)
9. ఇదీ మన్మథుడే (3)
11. తలక్రిందయిన గజ్జె (2)
13. స్త్రీలమెడలో ఇది లాగే దొంగలుంటారు (3)
14. .. గాక మోక్షగామి కాడు! (2)
16. స్వాతంత్ర్యం నా జన్మ హక్కు అని నినదించిన లోకమాన్యుడు (3)
17. ముద్దుపళని, మొల్ల వంటి ఓ ప్రాచీన కవయిత్రి (4)
18. ఇరవై నాలుగు అడ్డంలో కావాలి అనుకున్నదే (4)
20. కొందరు బాబాలు చూపేది (3)
22. వర్ణమాల తొలి అక్షరాలు (2)

### పదగారడి-271 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 జా | త | 2 ర | ■ | 3 మ | హం | కా | 4 ళి |
| 5 ఏ | ■ | ■ | 6 హ | ను | మ | ■ | ■ | కే |
| డు | ■ | ■ | స్యం | ■ | త | ■ | ■ | ళా |
| 7 పు | 8 ది | నా | ■ | 9 పే | ■ | 10 కా | 11 ను | క |
| ■ | నా | ■ | 12 మా | లి | క | ■ | ర | ■ |
| 13 సా | రం | గం | ■ | క | ■ | 14 అం | గ | 15 న |
| మ | ■ | ■ | 16 పా | ■ | 17 పా | ■ | ■ | గ్న |
| వే | ■ | ■ | 18 రా | బం | దు | ■ | ■ | ము |
| 19 దం | డ | పా | ణి | ■ | 20 ప్పి | ల | గం | ■ |

Printed and Published by VEMURI RADHAKRISHNA, Managing Director, on behalf of Aamoda Publications Pvt. Ltd., Plot No.76, Aswani Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad-500 033. Ph.(040) 23558233/44, Fax No.23558288. Printed at Aamoda Press, R.S.No.191/3, Ward No.43, Donka Road, Patamata, Vijayawada 520 010, Reg.No.: APTEL/2004/12594. Editor: A.N.JAGANNADHA SARMA

